# షయానుక్రమ

-: o :-

## జూలై 1954



త్రివర్ణ చిత్రము: వర్షాగమనం—వి. సంజీవరావుగారు

# తక్కువఖర్చుతో మనోహరమై శాశ్వతముగానుండు కాంక్రీటు ఇల్లు



ఇందులో చూపబడిన ఇల్లు ఢిల్లీలో అయిన ఇంటర్‌నేషనల్ ఎగ్జిబిషన్ ఆఫ్ లోకాస్టు హౌసింగ్‌లో చూపబడినది. ఈ ఇల్లు అన్ని సీతోష్ణములకు తగినట్లు ముందుగా తయారైన కాంక్రీటు బ్లాకులతో కట్టబడినది. దీనిని అతి త్వరితముగా కట్టవచ్చును. ఇది హౌసింగు స్కీములకు విడికట్టడములకూ కూడా ఉపయోగించవచ్చును. కాంక్రీటుతో కట్టిన ఇండ్లు ఏమరమ్మత్తు లేకుండా అగ్నిప్రమాదముగాని ఛోరభయముగాని లేకుండా యుండి శాశ్వతమై నివసించువారికి సౌఖ్యము విశ్రాంతి కలుగచేయును.




వివరములకు :

**ది కాంక్రీటు ఏసోసియేషన్ ఆఫ్ ఇండియా.**

8, మౌంట్‌రోడ్, మద్రాసుకు వ్రాయుడు

**ఏసిసి**

సేల్సు మేనేజర్లు :

**ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా.లి.**

SISTA'S CMJ - 171



వర్షాగమనం
చిత్రకారుడు: శ్రీ వి. సంజీవరావు



జయ
పార్థివము

# భారతి

సంపుటము 31
సంచిక 7

# సాయంసంధ్య

శ్రీ రమణారెడ్డి

అస్తంగత మార్తాండ హేమరుచి శశికొర కపరంబెత్తిన హారతి,
కంటే! అభ్రచర న్మేఘమ్ములు కప్పురపారతిమీది ధూపములు,
అలలై, విలసత్కాల భుజంగమ గతులై, యూహామతులై, లతలై
సడిసేయకయే, నడయాడుంగద, ఉడుమణులను ఫణమందు తాల్చుగద;
చిత్రకోటి రూపముల నందుగద, పశ్చిమ వృక్ష మ్మెగబ్రాకుం గద!
పడమటింట నే శుచిమతి దిద్దెనొ మణి దీపమ్ముల ముగ్గు లందముగ!
ఏ సాంబ్రాణికి పుట్టిన వీ పొగ తావులు సాయం వాయు స్పర్శల!
ఎట్టి యపూర్వ మనోహరచిత్రము తరువు లాపిన సంధ్యాగగనము!
ఎంత సంచలన మెంత సంభ్రమము శ్వేత విహంగశ్రేణీ విహరణ
మెంతటి దెంతటి దీ కవి యానందము! నిరవధికము రసనిమజ్జనము!
నాస్తిని అస్తిగ మార్చంగలిగిన దేది మరెయ్యది భావనకంటెను?

# ఆంధ్ర హైకోర్టు స్థాపన

## ప్రధాన న్యాయమూర్తి గౌ॥ కోకా సుబ్బారావుగారు

మనకు ప్రత్యేకంగా హైకోర్టు కావలెననెడి ఆంధ్రుల చిరమనోరథము 1954 జూలై 5వ తేదీ నాడు యీడేరుచున్నది. హైకోర్టు అంటూ ఒకటి ఏర్పడినంత మాత్రమున మన కర్తవ్యము తీరిపోలేదు. మనము అందుకు అర్హులమని ఋజువు చేసుకొని దానిని ఒక ఆదర్శసంస్థగా తీర్చి దిద్దుకొనుటకు శాయశక్తులా కృషి చేయవలసి వున్నది. న్యాయమూర్తులు, న్యాయవాదులు, ప్రజలు సహకరించి వ్యవహరించిననాడే అది సాధ్యమగును. హైకోర్టువారు నిర్వహించవలసిన విధులు క్లిష్టమూ, సున్నితము అయివుంటాయి. వ్యక్తికీ వ్యక్తికీ, వ్యక్తికీ ప్రభుత్వానికీ వచ్చే తగాదాలను విచారించి న్యాయాన్ని నిర్ధరించాలి. ప్రజల జీవన్మరణసమస్యలకూర్చి నిర్ణయాలు జరపడమే గాక రాజ్యాంగంలో నిబిడీకృతమైన ప్రజల ప్రాథమిక హక్కులు పాలింపబడేట్టు చూడాలి. ఈకర్తవ్యమును నిష్కర్షగా పాలించుటకును న్యాయమూర్తులు స్వతంత్రముగను, నిష్కర్షగను వ్యవహరించుటకును అనువైన బాహ్యాభ్యంతర వాతావరణమును ఏర్పరుపవలె [illegible] న్న

ప్రజాస్వామ్య ధర్మనిర్వహణలో న్యాయనిర్వహణ సంస్థల ప్రాధాన్యమును గుర్తించియే భారత రాజ్యాంగకర్తలు న్యాయనిర్వహణము నిరాఘాటముగ సాగుటకు వీలయిన ఏర్పాట్లను సాధ్యమైనంతలో కల్పించియున్నారు. రాష్ట్రగవర్నరుతోను, రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తితోను సంప్రదించియే భారత రాష్ట్రపతి న్యాయమూర్తులను నియమించును. వారి జీతములు ఇదమిత్థమని నిర్ణయింపబడి శాసనసభల ఓటుతో ప్రమేయము లేకుండా ప్రజలు చెల్లించు పన్నులనుండియే ఇవ్వబడుచున్నవి. న్యాయమూర్తుల పదవీ విరమణ వయస్సు నిర్ణయింపబడినది. వారు దుర్వర్తన పరులైనారని ఋజువైన పార్లమెంటువారిచే విచారింపబడి, $\frac{2}{3}$ మెజారిటీతో శిక్ష ఖాయమైనప్పుడే తప్ప వారిని పదవులలోనుంచి తప్పించుటకు వీలులేదు. న్యాయనిర్వహణలో న్యాయమూర్తులు చేయు పనులను పార్లమెంటులో గాని రాష్ట్రశాసనసభలలో గాని విమర్శించుటకు వీలులేదు. ఇదే లక్ష్యాన్ని దృష్టిలో వుంచుకొని వారిపట్ల కొన్ని విధులు నియమింపబడినవి. వారు పదవినుంచి విరమించిన తరువాత భారతదేశములో ఏ కోర్టులోను ప్రాక్టీసు చేయుటకు వీలులేదు. రాజ్యాంగముప్రకారము హైకోర్టు జడ్జీలుగా వారికి వచ్చు జీతభత్యములు తప్ప వేరేవిధముగా ఆర్జించుటకు వీలులేదు. న్యాయమూర్తి స్వతంత్రముగను విచక్షణను ఉపయోగించి న్యాయనిర్వహణ చేయుటకు రాజ్యాంగము అవసరమైన షరతులను ఎన్నిటిని విధించినను మానవసహజమైన ప్రవృత్తిని మరువలేము. న్యాయమూర్తి గూడా మానవమాత్రుడే గదా! అందువల్ల న్యాయమూర్తులు న్యాయనిర్వహణకు తమ జీవితముల నంకితము చేయవలెను. తమవద్దకు వచ్చు తగాదాలను నిష్పాక్షికముగా విచారించి, ఎట్టి ప్రేరణలకు లొంగకుండా తీర్పుల నివ్వవలెను.

మనరాష్ట్రములో న్యాయనిర్వహణ చక్కగా జరుగవలెనంటే న్యాయవాదవృత్తిలో ఉన్నవారు గూడా పాలించవలసిన విధులు కొన్ని వున్నవి. కక్షలే కారణంగా, వృథా ప్రయాసతో కూడిన తగాదాలను విసర్జించి, వ్యవహారమును క్షుణ్ణముగా ఆకళింపు చేసుకొని, సమర్థములూ, సంక్షిప్తములూ అయిన వాదనలతో శీఘ్రముగను, నిష్కర్షగను తగవులు పరిష్కారమగుటకు తోడ్పడవలెను. అల్లాగే ప్రజలు గూడా న్యాయనిర్వహణకు తోడ్పడవచ్చును. సక్రమసంఘనిర్వహణమునకు నిర్మింపబడిన సంస్థ



ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గా॥ కోకా సుబ్బారావుగారు



ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి
గా॥ పలగాని చంద్రారెడ్డిగారు

లలో న్యాయసంస్థగూడా ఒకటని వారు మరువరాదు. ప్రజలచే సృష్టింపబడిన ఈ ఉన్నత న్యాయస్థానమునకు ఉన్నతాసనము నిచ్చినగాని వారు తమ క్లిష్టమైన విధులను నిర్వహించుట కష్టమనునది స్పష్టము. అందువల్ల చాటుమాటుగా గాని, బహిరంగముగా గాని ఏ న్యాయమూర్తిని గూర్చిగాని, హైకోర్టును గూర్చిగాని పరుషవాక్యము లాడకుండుట అలవాటు చేసుకోవలెను. అట్లుగాక దురాలోచనతోను, అరకొర జ్ఞానముతోను, న్యాయమూర్తులను న్యాయస్థానములను విమర్శించినందువల్ల, తుదకు ఆ పదవుల సంస్థల ప్రతిష్ఠ నేలపాలు కాగలదు. న్యాయస్థానముల ప్రాధాన్యమును తగ్గించుటకుగాని, వాటి శక్తిని బలహీనము చేయుటకుగాని ఎట్టి విధముగాను యత్నింపక ప్రజలు న్యాయస్థానములతో హృదయపూర్వకముగా సహకరింతురని నేను నమ్ముతున్నాను. అట్లు సహకరించనిచో తమ హక్కుల నిమిత్తము తాము నిర్మించుకొన్న సంస్థను చేజేతులా నాశనము చేసుకొన్నటుల గాగలదు. ఆంధ్రరాష్ట్ర ప్రజాస్వామ్యసంస్థల అభ్యుదయప్రగతిలో జూలై 5 తేదీ ఆంధ్రులు పర్వదినముగా పరిగణింపదగినది.



ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి
గా॥ కొండగుంట ఉమామహేశ్వరంగారు

# ఆధునిక విజ్ఞాన పరిణామం

## శ్రీ వసంతరావు వేంకటరావు

"ఆకాశ వక్రత్వ భావాన్ని ఐన్‌స్టైన్ ప్రతిపాదించేరన్నారు కదా, భౌతికవిజ్ఞానం పురోగమిస్తుండిన సుమారు 300 ఏండ్లలోను ఈ భావానికి ఎందుకు ప్రాధాన్యం రాలేదంటారు?"

"ఐన్‌స్టైన్ అయినా ఉన్నట్లుండి ఉభేత్తుగా ఒక్కసారి ఈ భావాన్ని లోకాని కందీయలేదు. విజ్ఞాన గమనంలోనే ఈ భావోత్పత్తికి అనుకూలమైన పరిస్థితు లేర్పడుతూ వచ్చేయి. అయితే ప్రకృతి చాల సుందరమైనది సరళమైనది. అన్న విశ్వాసంతో ప్రకృతి పరిశీలనకు ఐన్‌స్టైన్ పూనుకొన్నారు. అంతేకాక, భౌతిక యాదార్థ్యాన్ని అవగాహన చేసికొనడానికై తపిస్తూన్న మానవులకు మహత్తరమైన కొన్ని విశ్వనియమాలను ఐన్‌స్టైన్ ప్రసాదించేరు. ప్రకృతి గమనాన్ని ఒకే ఒక సిద్ధాంతంతో నిరూపించాలన్న మహదాశయంతో ప్రచోదింపబడిన ఐన్‌స్టైను భౌతికవిజ్ఞానంయొక్క పరిమితత్వాన్ని చూపి, తాత్వికంగా నూతన దృక్పథాన్ని పెంపొందించేరు.

"ప్రపంచంలో అభివ్యక్తంగానున్న బహుధానేకత్వం యథార్థంగాదనీ, ఈ అనేకత్వంలో ఏకత్వం ఉందనీ మనీషాపరులు విశ్వసిస్తూ వచ్చేరు. ఆ భావం శాస్త్రవిజ్ఞానంలోకూడా ప్రవేశించింది. జగన్నిర్మాణానికి అవసరమైనవి కొద్దిపాటి భూతాలు మాత్రమే అని వివిధకాలాలలో వివిధదేశాలవారు నిర్ణయించేరు. వాటి సంఖ్య మూడునుండి ఏడువరకు ఉండవచ్చునన్నారు. మూలతత్త్వ (*element*) భావాన్ని ఆమోదించిన ఆధునిక విజ్ఞానులు వాటి సంఖ్య 92 వరకు పెంచేరు. కాని, ఇటీవల అది 100 వరకు పెరిగింది. ఈ మూలతత్త్వాలలోకూడ ఒకదానిని మరొక తత్త్వంగా మార్చవచ్చుననీ, సామాన్యలోహాలను బంగారులోనికి మార్చవచ్చుననీ నమ్మిన విజ్ఞానులు, చాలమంది, తత్త్వాంతరీకరణాన్ని సాధించడానికి ప్రయత్నించేరు. ఆనాటి రసవాదు లూహించినట్లు కాక, వేరొక విధంగా ఈనాడు మాత్రం తత్త్వాంతరీకరణం సాధ్యమాతూంది."

"కాని, ఈ మార్పు భారీగా సాగించే అవకాశం లేదని చెప్పేరుకదండీ?"

"ఔను. ప్రస్తుతం గమనింపతగిన విషయమేమంటే సహజావబోధంవల్ల కొన్ని శతాబ్దాలనుండి మానవు డూహించిన ఒకానొక అభిప్రాయం యథార్థమైనదే అని కాలం నిరయించింది. అంతమాత్రాన్న వైజ్ఞానికంగా ప్రాచీనులు తత్త్వాంతరీకరణాన్ని సాధించేరని చెప్పలేము. కాని, విజ్ఞానం పెంపొంది తుదకు అత్యంత స్వల్ప పరిమాణంలోనైనా దానిని సాధించగల అవస్థను చేరుకొంది. ఆదినుండి దేనికై మానవ హృదయం తపిస్తూందో దానిని భౌతిక విజ్ఞానులీనాడు హస్తగతం కావించుకొన్నారన్న సత్యం హృదయ నైర్మల్యానికి తార్కాణం.

"అనేకత్వంలో ఏకత్వం కనుగొందామన్న వాంఛకూడ అట్టిదే. విజ్ఞాన పురోగమనానికి మూలాధారమదే. విద్యుత్తు అయస్కాంత తత్త్వాలగురించి యోచిస్తే వాటివిషయమై ప్రాచీన గ్రీకులే కొంత పరిశ్రమచేసినప్పటికి సుమారొక శతాబ్దం క్రిందటి వరకు అవి విభిన్నరాసులనే భావ ముండేది. 19-వ శతాబ్దంలో విజ్ఞానులు ఆయిర్‌స్టెడ్, ఫారడేలు చేసిన ప్రయోగాలవల్ల వాటి పరస్పరసంబంధం స్పష్టమైంది. తీగెలోనుండి విద్యుత్తు ప్రవహించినప్పుడల్లా ఆ ప్రవాహాన్ని ఆవరించి అయస్కాంత క్షేత్రముంటుందని ఆయిర్‌స్టెడ్ నిరూపించేరు. ఆ అయస్కాంత క్షేత్రబలానికీ, తీగెలోనుండి ప్రవహించు విద్యుత్ప్రవాహబలానికీ, తీగెనుండి దూరానికీ గల సంబంధాన్ని పారిమాణికంగా నిర్ణయించేరు. అంటే, స్థావరవిద్యుత్తు నాశ్రయించి అయస్కాంత క్షేత్రముండదు. ఎప్పుడైతే విద్యుత్తు ప్రవహిస్తుందో అప్పుడు దాని నావరించి అయస్కాంత క్షేత్రం ప్రత్యక్షమాతుంది.

"స్థిరంగానున్న అయస్కాంతం చుట్టూ అయస్కాంతక్షేత్రంమాత్రమే ఉంటుంది. కాని, చలనంలోనున్న అయస్కాంతంవల్ల విద్యుత్ప్రవాహం జనిస్తుందని ఫారడే ప్రయోగాలుచేసి చూపించేడు. విద్యుజ్జనకయంత్రాలకీ సూత్రం ఎంతో ఉపయోగపడుతూంది. ఇట్టి ప్రయోగాలవల్ల విద్యుదయస్కాంతక్షేత్ర (*Electromagnetic field*) భావం జనించింది. కాంతి, వేడి, రేడియో తరంగాలు మొదలైనవన్నీ విద్యుదయస్కాంత తరంగాలే. ఈ విధంగా విద్యుత్తుని అయస్కాంతత్వాన్ని ఒకే బలంగా భావించడాని కవకాశం కలిగింది. సూక్ష్మ పరిశీలనవల్ల మరొక మహత్తర సత్యం వెలువడింది. గురుత్వాకర్షణ బలం తప్ప ఈ భౌతికజగత్తులోనున్న బలాలన్నీ విద్యుదయస్కాంతత్వ సంభూతాలే. అణువులలో పరమాణువులను బంధించు రసాయనిక బలాలు, పెద్ద ద్రవ్యఖండాలను బంధించు సంశ్లేషక (*Cohesive*) బలాలు, వస్తువులు బలప్రయోగానికి లోనైనప్పుడు అవి వాటి సహజాకారాన్ని సంరక్షించుకోడానికి తోడ్పడు స్థితిస్థాపక (*elastic*) బలాలు; ఇవన్నీ ద్రవ్యఖండాల అన్యోన్య ప్రవర్తనలో జనిస్తున్నాయి. ద్రవ్యమంతా పరమాణు నిర్మితం; వివిధ విద్యుత్కణాల కూడికవలన పరమాణువు లేర్పడుతున్నాయి. కాబట్టి, అంతిమ విశ్లేషణలో మిగిలేవి విద్యుత్కణాలు. అవి నిరంతర చలనంలో నున్నాయి. చలన విద్యుత్ వల్ల అయస్కాంతత్వం జనిస్తుంది. కాగా, పైని వివరించిన రకరకాల బలాలకు కారణం విద్యుదయస్కాంతత్వమే.

"విద్యుదయస్కాంత సంఘటనలకు గురుత్వాకర్షణ సంఘటనలకు అద్భుతమైన సామ్యముంది. పరమాణు కేంద్రంయొక్క విద్యుదయస్కాంత క్షేత్రంలో ఎలక్ట్రానులు పరిభ్రమిస్తున్నాయి; సూర్యుని గురుత్వాకర్షణ బలక్షేత్రంలో గ్రహాలు పరిభ్రమిస్తున్నాయి. అంతేకాదు; భూమి అయస్కాంతమన్న సత్యం సులభంగా నిరూపించవచ్చును. స్వేచ్ఛగా విశ్రమించగల అయస్కాంత సూచి, ఎల్లప్పుడూ, ఉత్తర దక్షిణ ముఖంగానే ఉంటుంది. సూర్యుడు సైతం పెద్ద అయస్కాంతమే. సూర్యుని ఆవరించి బలమైన అయస్కాంతక్షేత్రముంది. నక్షత్రాలు కూడ పెద్దపెద్ద అయస్కాంతాలే.

"ఈ సామ్యమే ఐన్‌స్టైన్‌ని ఆకర్షించింది. గురుత్వాకర్షణకూడ విద్యుదయస్కాంత సంబంధమైన బలమే అని నిరూపించడానికి ఆయన ప్రయత్నిస్తున్నాడు."

"ఈ బలాల స్వభావమేమిటో, అవి ఎలా ప్రవర్తిస్తాయో విజ్ఞానులు నిర్ణయించగలిగేరా?"

"లేదనే చెప్పాలి. మనచుట్టూఉన్న ప్రపంచాన్ని అవగాహనచేసికొనడమూ, వివరించడమూ విజ్ఞానంయొక్క లక్ష్యం. కాని, ప్రకృతిని అవగాహన చేసికొనడమంత సులభం గాదు వివరించడం. యథార్థానికి గురుత్వాకర్షణను, విద్యుత్తుని, అయస్కాంతత్వాన్ని విజ్ఞానం వివరించలేదు. వాటి ఫలితాలను కొలవగలదు; కొన్ని నియత పరిస్థితులలో అవి ఎట్లుంటాయో జోస్యం చెప్పగలదు. అంతేకాని, వాటి యథార్థ స్వభావంగురించి ఆధునిక విజ్ఞానికికూడా సరియైన జ్ఞానం లేదు. అంతేకాదు; రానురాను, భౌతికజ్ఞానం పెరుగుతూన్నకొద్దీ, ఈ దుర్జ్ఞేయ బలాల యాథార్థ్యాన్ని మానవు డెప్పటికైనా తెలిసికొనకలడనే భావాన్నికూడా, ఆధునిక విజ్ఞానులలో చాలమంది ఆమోదించలేకపోతున్నారు. ప్రస్తుత జ్ఞానానుసారం విద్యుత్తేమిటి? అను ప్రశ్నకు సమాధానం చెప్పకొంటే అదీవిధంగా నుంటుంది: 'ఇల్లు చెట్టువంటి వస్తువుకాదు విద్యుత్తు; వస్తువులు ప్రవర్తించే విధానమది. ఏ పరిస్థితులలో వస్తువులను విద్యుతీకరించగలమో, విద్యుతీకరింపబడినవస్తువు లెట్లు ప్రవర్తిస్తాయో వివరించినప్పుడు విద్యుత్తునుగురించి మనం చెప్పవలసినదంతా చెప్పినట్లే."

"అదేమిటండీ! విద్యుత్తు అంటే ఎలక్ట్రానుల ప్రవాహమని చాలసార్లు చెప్పేరే. ఇప్పుడు విద్యుత్తు అంటే తెలియదంటారు?"

"ఒక తీగెలోనుండి ఎలక్ట్రానులు ప్రవహించినప్పుడు కొన్ని ఫలితాలు కలుగుతాయి. ఆ ఫలితాలనుబట్టి విద్యుత్ ప్రవాహభావాన్ని సమర్థించుకొంటున్నాము. ఒక పరిస్థితిని ఊహాకందేటట్లు చిత్రించుకొనవలసిన అవసరముంది. ఎలక్ట్రానుల ప్రవాహాన్నే విద్యుత్ ప్రవాహంగాభావించి ఆప్రవాహంలో కలిగినమార్పులకు దానిఫలితాలలో మార్పులకుగల సంబంధాన్ని పారిమాణికంగా వివరించడం సాధ్యమైంది. ఆ వివరణ సత్యంగా కనిపిస్తూంది. అందుచేత విద్యుత్ప్రవాహమంటే ఎలక్ట్రానుల సక్రమగమనమే అని ఊహించుకొనడం తప్పుకాదు. కాని,

అదే యథార్థమనుకోవడం పొరపాటు. అంతిమ సత్యాన్ని తెలిసికొనే అవకాశం లేదన్న వాదాన్ని ఈమధ్యవరకు విజ్ఞానులు ఏవగించుకొనేవారు. ప్రకృతిని పరిశీలించినప్పుడు విశదమయే స్వయంవిదిత సూత్రాలను చర్చించి, ప్రకృతియొక్క అంతిమ యాథార్థ్య విషయమై మానవుడు సరియైన జ్ఞానం సంపాదించగలడని రెండువేల సంవత్సరాల క్రిందట తత్వజ్ఞుడైన అరిస్టాటిల్ నమ్మేడు. ఉదాహరణకు: ప్రతి పదార్థానికి జగత్తులో యుక్తమైన స్థానముంది అనేది ఒక స్వయంవిదిత సూత్రం. అందుచేత, వస్తువులకు భూమి ఆశ్రయం కాబట్టి అనవలంబన వస్తువులు భూపతనమొందుతాయని చెప్పవచ్చును. భూమిపై ఎత్తు ప్రదేశాలలో నుంటుంది పొగ; అది దాని సహజస్థానం, కాబట్టి, పొగ పైకెగసిపోతుంది. ఈవిధంగా సూత్రనిర్ణయం చేసిన అరిస్టాటిల్, సంఘటనలు ఎందుకు సంభవిస్తాయో వివరింపబూనుకొన్నాడు. సంఘటనలు ఎట్లు సంభవిస్తాయో వివరించడానికి గెలిలియో పూనుకొన్నప్పుడు ఆధునికవిజ్ఞానం జనించింది. దీనికి ప్రాతిపదిక ఏమంటే విజ్ఞాని శాసించగల పరిస్థితులలో ప్రయోగం చేయగల సామర్థ్యాన్ని పెంపొందించడం. ప్రయోగాలు చేయడంవల్ల అనేక ప్రకృతి నియమాలు తెలియవచ్చేయి. యంత్ర శాస్త్రానికి పునాదులు గెలిలియో వేసేడు. తరువాత దానిని విజ్ఞాని న్యూటన్ పెంపొందించేడు. 300 సంవత్సరాలు పెరిగిన విజ్ఞానంలో జగత్తు ఒక మహత్ యంత్రమనే భావం కలిగించింది. ఈ యంత్రంలో నున్నవి రకరకాల బలాలు, ప్రకంపనాలు, తరంగాలు. ఏ నూతన భావమైనాసరే ఒక నమూనా సహాయంతో ఊహించుకోగల అవకాశం కలిగింది. 1890 ప్రాంతంలో జగద్విషయమై తెలిసికొనవలసినదంతా తెలిసిందనుభావం విజ్ఞానలోకంలో ఉదయిస్తోంది. కాని, ఆ శతాబ్దం పూర్తిఅయే పదేండ్లలోను కొన్ని సంఘటనలు సంభవించేయి. యాంత్రిక జగద్భావాని కవి ఆఘాతం కలిగించగా విజ్ఞానలోకంలో అలజడి కలిగింది. సంఘటనలు ఎందుకు సంభవిస్తున్నాయో గెలిలియో వివరించేడని గమనించేము. కాని, ఆ వివరణ సమగ్రం కాదని బోధపడింది. ఆ ప్రశ్నకు విజ్ఞానం సమాధాన మీయగలదా అను సంశయం జనించి సుమారు 30 సంవత్సరాలు కావచ్చింది. ఇప్పటి పరిస్థితి మరీ అయోమయంగా నుంది. విజ్ఞానపథాన్ని ఆశ్రయించిన మానవుడు ప్రకృతిని అర్థం చేసికొన్నాడా ఎప్పుడైనా అర్థంచేసికోగలడా అని సతమతమౌతున్నారు నేటి విజ్ఞానులు."

"విజ్ఞానాన్ని విడిచిపెట్టి వేదాంతంలో ప్రవేశిస్తున్నారేమిటండీ? ప్రకృతి శక్తులను ఇంత అద్భుతంగా సాధిస్తున్న విజ్ఞాని ప్రకృతిని అర్థంచేసికోలేకపోవడ మేమిటి?"

"అదే విశేషం. జ్ఞానం వృద్ధిపొందుతున్నకొద్దీ ప్రకృతివిషయమై మనకున్న అభ్ర మాత్రాయనీ బలపడతాయనీ ఆశిస్తాము. కాని, దాని వ్యతిరేకంగా, అవి బలహీనమై, క్రొత్తవాటికి తావియ్య మొదలుపెట్టేయి. జగత్తు సమగ్ర యంత్రమన్నభావం నిజం కాదేమో అని సందేహం కలిగించే కొన్ని విషయాలు అగోచరమైన పరమాణు ప్రపంచంనుండి, అనవగాహ్యమైన అంతర్నక్షత్రాంతరాళ గాంభీర్యాలనుండి వెలువడ్డాయి. వాటిని పారిమాణికంగా వివరించడానికై ఈ శతాబ్దపు మొదటి 30 ఏండ్లలో రెండు మహత్తర సిద్ధాంతశాఖలను పెంపొందించవలసి వచ్చింది. అందొకటి క్వాంటం సిద్ధాంతం; అది, శక్తి ద్రవ్యముల మూలరూపాలను చర్చిస్తుంది రెండవది సాపేక్షతాసిద్ధాంతం; అది, ఆకాశం, కాలం, జగన్నిర్మాణాలనుగురించి చర్చిస్తుంది.

"ఈ రెండుసిద్ధాంతాలూకూడా ఆధునిక విజ్ఞాన భావసౌధానికి మూల స్తంభాలు. వాటికి సంబంధించిన విషయాలను యోగ్యమైన గణిత పరిభాషలో అవి వివరిస్తాయి. ఉదాహరణకు, కాంతి ప్రసారం ఏ నియమాలననుసరించి జరుగుతుందో వాటిని నిర్వచించే సమీకరణాలని ఆ సిద్ధాంతాలు ప్రతిపాదించేయి. అయితే, అందులో మరొక గొప్ప విశేష మేమంటే పరమాణువు యథార్థంగా కాంతి నెట్లు ప్రసరిస్తుందో, ఆ కాంతి ఏవిధంగా ఆకాశయానం చేస్తుందో మనకు తెలియదు; అవింకా దుర్జ్ఞేయమైన ప్రకృతి రహస్యాలే. ఇంకొక ఉదాహరణ రేడియోధార్మికత్వం. ఒక నిర్ణీతకాలంలో ఒక నియతరాశి రేడియమందలి పరమాణువులలో కొన్నిమాత్రం విచ్ఛిన్నమౌతాయని జోస్యం చెప్పడానికి రేడియోధార్మికత్వాన్ని శాసించు నియమాలు విజ్ఞానులకు సహాయపడతాయి. అయితే, వాటిలో ఏ పరమాణువులు విచ్ఛిన్నమౌతాయో, అవి ఏవిధంగా ఎంచుకోబడతాయో ఇంతవరకు విజ్ఞానులకు తెలియదు.

"వీటి పర్యవసాన మేమంటే, ప్రకృతిని గణిత పరిభాషలో వర్ణించు సమీకరణాలని అంగీకరించినప్పుడు పంచేంద్రియములద్వారా అనుభూతమైన ప్రపంచాన్ని విజ్ఞానులు విడిచిపెట్టవలసివచ్చింది.

ఇది తిరోగమనం కావచ్చు. కాని, దీని ప్రాముఖ్యాన్ని బోధపరచుకోనడానికి భౌతిక విజ్ఞానసీమ నతిక్రమించి ఆత్మ విద్యారంగంలో ప్రవేశించాలి. మానవునికి జ్ఞానోదయమైనప్పటినుండి పరిశీలకునికి ప్రకృతికిగల సంబంధమెట్టిది, జగత్స్వరూప మెట్టిది అను ప్రశ్నలు తత్త్వవేత్తలను వేధిస్తున్నాయి. గ్రీకు తత్త్వజ్ఞుడైన డెమొక్రిటస్ 2300 ఏండ్ల క్రిందట అన్నాడు: 'తీపి చేదు, చలి వేడిమి, ఎరుపు నలుపు మొదలగు రంగులు: ఇవన్నీ మన భావనలోనే కాని యథార్థంగా లేవు. యథార్థంగా నున్నవి మార్పులేని కణాలు, పరమాణువులు, శూన్యాకాశంలో వాటి గమనాలు మాత్రమే? గెలిలియో కూడా ఇట్టి అభిప్రాయాన్నే వెలిబుచ్చేడు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు కేవలం ఆత్మగతమైనవనీ, ఒక వస్తువును తాకినప్పుడు కలిగే బాధగాని జిలగాని దాని గుణం కాజాలనట్లే ఇవి కూడా దాని గుణాలు కావనీ భావించేడు. కాంతి, వేడి, వర్ణం మొదలైనవే కాక గమనం, ఆకారం, వ్యాప్తి కూడ కేవలం అభివ్యక్త గుణాలని రుజువుచేస్తానన్నాడు జర్మన్ గణిత శాస్త్రవేత్త లైబ్‌నిట్జ్. చక్షురింద్రియ సహాయంతో నిమ్మపండు పచ్చగాను గుండ్రంగాను ఉన్నదని చెప్పగలిగినట్లే, స్పర్శవల్ల అది నున్నగా నుందని చెప్పకలుగుతున్నాము. పసుపు అనేది లోకసమ్మతి వల్ల నిర్ణయింపబడిన రంగు. ఇంద్రియజ్ఞానం వినా దానికి ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. అట్లే మిగిలిన గుణాల విషయం.

"ప్రతి వస్తువు దాని గుణాల సముదాయం. గుణాలు మనస్సుచేతనే గ్రహింపబడతాయి; అంటే వాటి ఉనికి మనసులోనే కాని బాహ్యంగా లేదు. పరమాణువునుండి నక్షత్రాలవరకు వివిధ పరిమాణాలలో ద్రవ్యఖండాలను, కాస్మిక్ కిరణాలనుండి రేడియో తరంగాలవరకు బహువిధ శక్తి తరంగాలను కలిగిన వస్తుగత జగత్తు యావత్తు మన చైతన్యముచే నిర్మింపబడినదే, కాని, దానికి సహజంగా ఉనికి లేదని తత్వవేత్తలు భౌతిక విజ్ఞానులుకూడ నిర్ణయానికి వచ్చేరు. మానవుడు పంచేంద్రియాల ద్వారా సేకరించిన సాంకేతిక జ్ఞానసంభారంతో నిర్మించిన మహాసౌధమీ జగత్తు. మనస్సు లేనిదే విశ్వంలో ఏ వస్తువుకీ వస్తుత్వం లేదని తత్త్వవేత్త బెర్‌కిలే అభిప్రాయం. మనం వస్తువులను చూడనంతకాలం, వాటి జ్ఞానం మన హృదయంలో లేనంతకాలం వాటికి ఉనికిలేకపోవాలి, లేదా, జగదాత్మ మనస్సులో ఉండాలి అని బెర్‌కిలే అంటాడు. ఈ తర్కాన్నే మరికొంతదూరం తీసికొనిపోయిన ఐన్‌స్టైయిను ఆకాశము కాలముకూడా అంతర్‌జ్ఞానంయొక్క రూపాలంటాడు. ఆకాశంలో గోచరించు వస్తువుల ఏర్పాటుగా తప్ప ఆకాశానికి వస్తుత్వయాథార్థ్యం లేదు. కాలాన్ని కొలుచు సంఘటనలక్రమంతప్ప కాలానికి ప్రత్యేకమైన ఉనికి లేదు. చైతన్యం వినా కాలాకాశాలు లేవు."

"ఆధునికవిజ్ఞాన పరిణామం ఎంత అద్భుతంగా ఉందండీ! దృఢమైన భౌతికసూత్రాలతో ప్రారంభించి, తుదకు, అనాత్మవాదానికి గొడ్డలిపెట్టు అయిందే." అంటూ లావణ్య విస్తుపోయింది.

కథానిక

# * సావిత్రి *

“శండిల”

“సావిత్రీ! భానుమూర్తి మన్ని వాళ్ళింటికి రమ్మని మరీమరీ చెప్పిపోయాడు. రోగం నయమయ్యేదాకా అక్కడే ఉండమన్నాడు. పోనీ వాడేనా నాకు పైవాడు గాదుగా. మనమూ ఒక విషయం ఆలోచించాలి. ఉన్నది పట్నవాసం. సూర్యంచూస్తే ఇంకా కుర్రతనపు చేష్టలు మానలేదు. ఈరోజుల్లో ఇంటపడ్డె కలిసొచ్చినా కలిసిరావశమే. ఏమంటావ్” మేనత్త రత్తమ్మ చెబుతున్న మాటలు శ్రద్ధగా వింటోంది పదిహేడేళ్ళ వయస్సుగల పడుచుపిల్ల సావిత్రి. అయిదారు నిమిషాలు ఆలోచించి “ఎందుకత్తయ్యా! పట్టుమని పదిరోజులు గడిపేస్తే తెల్లారిపోతుంది. దగ్గు బాగా తగ్గిపోయాక మనవూరే వెళ్ళిపోవచ్చు. మళ్ళీ ఇంతలో ఈమార్పెందుకూ” అన్నది సావిత్రి. భానుమూర్తికి సాధారణంగా పొరుగువాసన కిట్టదే. ఏదో ప్రతిఫలం లేనిదే పల్లెత్తు సాయం పరాయివాడికి చెయ్యడు. అట్లాంటివాడు ఉన్నట్టుండి అత్తయ్యనూ తననూ కౌమాటంతో వాళ్ళింటికి వచ్చెయ్యమన్నాడంటే?— ఈ రోజుల్లో ఎవడిమటుక్కి వాడికే సంసారం సరినెత్తుకోవడం కష్టంగా వుంది; మరి ఈ ఆహ్వానం ఎందుకొచ్చినట్టు? “డాక్టరుకూడా కొంచెం స్థలం మార్పిడి అవసరమన్నాడు. భానుమూర్తికి మాత్రం ఏ పదిమందున్నారు. ఒక్కడే హోటలు మెతుకులు కతుకుతూ బతుకుతున్నాడు. పెళ్ళాంపోయి ఇంకా ఏడాది దాటలేదు. అది బ్రతికుంటే అక్కడే ఉండిపొమ్మనేది. కాబట్టి రాత్రికి అబ్బాయొచ్చాక ఆలోచించుకుందాం. జావ తెచ్చిపెట్టు” అంది రత్తమ్మ. సావిత్రి అత్తగారికి జావగాచి పెట్టడానికి లోపలికెళ్లింది. రత్తమ్మ దగ్గుతూ, “పిచ్చిపిల్ల ఇంకా సంసారం బరువు తెలుసుకోలేనిది” అనుకుంది.

సావిత్రి తండ్రి జగ్గరాజూ, రత్తమ్మా పెత్తండ్రి పినతండ్రి బిడ్డలు. పాపం! ఆ పిల్లకు చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోతే నలుగురూ రత్తమ్మనే పెంచమని ఆమె పాలబడేశారు. అప్పటికే తన పెనిమిటిపోయి ఆరేళ్లయింది. ఒక్కగానొక్క కొడుకు సూర్యాన్ని పెట్టుకుని స్వంతవూళ్ళో అయిదెకరాల మాగాణి సేద్యం చేయించుకుంటూ ఉంది రత్తమ్మ. బంధువులంతా చెప్పినమాట తీసెయ్యలేక సరే అంది. సావిత్రి పెద్దదిగినకొద్దీ ఒద్దికా, పొందికా నేర్చుకుని నలుగురిలోనూ తల్లో నాలుకై పోయింది. ఇంట్లో పనంతా ఏడోఏటనే చక్కబెట్టడం నేర్చుకుంది. అప్పుడే అనేవాళ్లు ఇరుగూ పొరుగూ “రత్తమ్మా— ఇంకెక్కడపై సంబంధాలు చూస్తావు సూర్యానికీ, సావిత్రికీ ముడెట్టి వాళ్ళింత కాచిపోస్తూంటే కృష్ణా, రామా అనుకుంటూ కూర్చుందూ” అని. వాళ్లమాటలకు నవ్వుకొని “బి. ఏ. ప్యాసైతేనేగాని మా బంగారు తండ్రి సూర్యానికి పెళ్ళిచెయ్యను” అనేది. సూర్యం రెండెకరాలు ఖర్చుచేసి బి. ఏ. నాలుగుమార్లు తప్పి ఇంటిదగ్గర కూర్చున్నాడు. స్నేహితులు మప్పిన సిగరెట్లు త్రాగడమూ, చీట్లపేకాడడమూ మిగిలాయి చివరకు. ఈ మధ్య జోరుగా డబ్బు తగలెయ్యడం మొదలెట్టాడు.

చూసి చూసి రత్తమ్మ సూర్యానికి పెళ్లి చెయ్యలేకనే పోయింది. అంతా సుస్తీఘటం తాను. సావిత్రి కావాలనీ ఉంది; కట్నంకానుకలూ, ముద్దు ముచ్చటలూ రావనే దిగులూ ఉంది. “కానీ చూద్దాం” అనుకొంటూండగానే ఈ మాయదారి క్షయదగ్గు వొచ్చిపడింది. అందరూ పట్నంలో మకాం పెట్టమంటే పొలంమీద అయిదువందలు అప్పుతెచ్చి నగరంలో ఇల్లొకటి అద్దెకు తీసుకొని మందు పుచ్చుకొంటోంది. ఎదిగిన పిల్ల సావిత్రే ఆమెకు అహర్నిశాలూ శుశ్రూష చేస్తోంది. రోజులు గడచినకొద్దీ సావిత్రి మీద త్సల్య దానంతటదే బలంగా అలుముకుంటూంది రత్తమ్మలో. “ఈపాటికే చేసెయ్యవలసింది— ఏమిటో ఏకసుస్తీ అయిపోయింది. సూర్యం చూస్తే

దురలవాళ్లు మళ్లీగి పాడైపోతున్నారు—పెళ్ళైతే కొంచెం బరువుమోసును" అంటూ ఎన్నోసార్లు సత మతమైంది. ఈ మాటలు వింటూంటే సావిత్రికి రత్తమ్మ జబ్బుకూడా తన మేలుకోరకే వచ్చినట్లని పించి లోలోపల తీయనికలలు కంటోంది. అయితే ఆమె జబ్బు త్వరలో నయమయ్యేట్లు కనిపించడం లేదు

పట్నంలో తమకు పరిచయమైన బంధువు భానుమూర్తి ఒక్కడే. ఎప్పుడూ తియ్యగా మాట్లాడు తుంటాడు. రెండురోజుల కొకసారైనా రత్తమ్మను చూసిపోతుంటాడు. వద్దంటున్నా వినక బత్తాయిలూ, దానిమ్మపళ్లూ, ద్రాక్షా తెచ్చి పడేసిపోతూంటాడు. ఒకటి రెండుసార్లు తనకు మల్లెపూలు కూడా తెచ్చి వుంచాడు. అతనిది హ్రాసి. పట్నంలో నాలుగు మేడలు అద్దెకు త్రిప్పుతున్నాడు. నెలకు ఎంత లేదన్నా మూడువందలు పైచిలుకు వస్తుంది. అతను మరీమరీ పట్టుబడుతున్నాడు రత్తమ్మని రమ్మని. డాక్టరుగూడా మకాం మార్పు చేయమన్నాడు.

జావగాచుతున్న సావిత్రికి గతమంతా తలుచు కొంటూంటే భావి అగమ్యగోచరంగావుంది. "వెళ్ల డమా - మానడమా"—తానైతే పెండ్లికాని పిల్ల. సూర్యం చూస్తే ఎప్పుడూ క్లబ్బులో నే ఉంటూ డబ్బు చీట్లాటకు తగలేస్తున్నాడు. తాను అతని ఉప్పుతిని పెరిగి, చెప్పుచేతల్లో మెసిలి తెగించి ఎలాగ మందలి స్తుంది. రత్తమ్మ అన్నా అతడు పట్టించుకోడు. గారాబుకొడుకు. రోజురోజుకీ రత్తమ్మ పరిస్థితి విష మిస్తోంది. డబ్బు మంచినీళ్లలా ఖర్చయిపోతోంది.

జావ త్రాగినతర్వాత రత్తమ్మకు నిద్ర పట్టింది. సావిత్రి సూర్యంకై ఎదురుచూస్తూ ఏదో కథల పుస్తకం తిరగేస్తూంది. చదువుతోందన్నమాటే గాని, ఆమె మనసు మనసులో లేదు. గడియారం పన్నెండు కొట్టింది. సాయంత్రమనగా — భానుమూర్తి రావ డానికి గంటముందు — నాలుగున్నరౌతుందేమో— వెళ్ళిన సూర్యం ఇంకా మెతుకులకు రాలేదు. పేకా టలో మునిగి ఊళ్ళకుఊళ్లు తగలేసుకున్న జమీం దార్ల కథలు తాను చదివింది. "సూర్యం అంత వాడు గాకపోయినా—ఏముందీ ఎంతచెట్టు కంత గాలి" అనుకుంటోంది. సాయంత్రం భానుమూర్తి పారేసిపోయిన సమస్య ఆమె మెదడులో అలా ఇరు క్కుని తెమల్కుండా ఉండిపోయింది.

ఇంతలో సూర్యం వచ్చాడు. "అమ్మ పడు కుందా—నీవు భోంచేసేవా" అన్నాడు లోపలికి అడుగు పెడుతూ నే. "ఆ! జావదాగి పడుకుందత్తయ్య. మీరు చెయ్యనిదే నేనెలా తిన్నా" అంది సావిత్రి. "ఎన్నిసార్లు చెప్పలేదు నాకోసం కూర్చోవద్దని నే భోంచెయ్యను—గ్లాసెడు మజ్జిగియ్యి" అన్నాడు. సావిత్రి లోపలికివెళ్ళి మజ్జిగ గ్లాసులోపోసి ఉప్పు రంగరించి తెచ్చింది. సూర్యం త్రాగుతూంటే ప్రస్తా వన ప్రారంభించింది. "భానుమూర్తి సాయంత్రం మీరు వెళ్ళాక వచ్చాడు అత్తయ్యను మరీమరీ తమ యింటిదగ్గరుండమని బ్రతిమాలాడు. మీ రేమంటారో నని మాటివ్వలేదు" అంటూన్న సావిత్రితో "అక్కర్లేదు—పదిరోజు లిక్కడేఉంటే సరి—రోగం నయ మవగానే మనింటికే పోవచ్చు" అన్నాడు సూర్యం ముడిగా. "డాక్టరుగారు ఇంకా నెలా పదిహేను రోజులైనా ఉండాలన్నారు. పైగా ఏవో క్రొత్త ఇంజక్షన్లు కొనాలన్నారుగా" అని ప్రొద్దుటిసంగతి మరచిపోయిన సూర్యానికి జ్ఞప్తిచేసింది సావిత్రి.

వీధి వసారాలో అమర్చిపెట్టిన ముడత మంచంమీద మేనువాల్చి ఆలోచించాడు సూర్యం— ఆవాళ అనుకోకుండా అరవైజను ఇడ్లీలు పంచి పెట్టాడు. ఎదురు మంచిగాకనో ఇంట్లో పోరువల్లనో ఎత్తుకున్న ముక్కల్లా ముక్కలు చేసేసేది ఆటను. డబ్బు సీదాగా ఖాళీ అయిపోయింది. అమ్మకూ సావిత్రికీ తెలిస్తే ఏమనుకుంటారో. ఇంక తనవద్ద మిగిలింది రేపు సాయంత్రమే వచ్చేనెలకు ఇంటి కివ్వ వలసిన అద్దె ఇరవైరూపాయలూను. తన ఊరికి సొమ్ము పంపమని రైతుకు వ్రాస్తే ఇంకా మనిఆర్డరు రానే లేదు. రేపు క్లబ్బుకు వొట్టిచేతులతో వెళ్ళడమా— మానడమా—చూడగా చూడగా తప్పక ఆటకు వెళ్ళి తీరాలన్న నిశ్చయానికి ఒకే ఒక ఊహ తట్టింది అతనికి.

చటుక్కున లేచాడు. లోపల అమ్మ మంచం ప్రక్కన తుంగచాపమీద బొంతపరచుకుని పగలల్లా ఇంటిచాకిరీచేసి వొళ్లుమరచి నిద్రపోతున్న సావిత్రిని సమీపించాడు. తన ఊహ ఆమెతో ఎలా చెప్పాలి? గదంతా చీకటిగా ఉంది. దీపం ఆరిపోయిందో ఏమో! "సావిత్రీ!" ఒకసారిపిలిచాడు. పాపం! అలసి సొలసిన ఆ పిల్లకు మెలకువరానిదే. ఆమె దగ్గరగా వెళ్ళి తట్టిలేపాడు. ఆమె కళ్లు నులుముకుంటూ లేచింది. "ఇంత రాత్రివేళ లేపారెందుకూ" అంది. "రేపు ప్రొద్దున్నే మనం మకాం మార్చేద్దాం. అమ్మ

జబ్బు నయమవాలంటే మార్పు అవసరం. రోగం ప్రతిమించుతూనే ఉందిగాని తగ్గుముఖం పట్టడం లేదు. భానుమూర్తి ఇంటికి వెళదాం." అంటున్న సూర్యం ఆలోచనలో జరిగిన మార్పుకు ఆశ్చర్య "అతడు రమ్మన్నాడు గదా అని వెడితే బాగుంటుందా" అంతకన్న తన అనంగీకారం సూర్యంముందు సావిత్రి బలంగా వ్యక్తం చెయ్యలేకపోయింది. "అబ్బే—రేపు ఈ ఇల్లు ఖాళీ చేసెయ్యాల్సిందే—తప్పదు. ప్రొద్దున్నే అమ్మతో చెబుతా" అంటూ వీధి వసారాలోకి వెళ్ళిపోయాడు సూర్యం. ఇంత రాత్రివేళ తన్ను ఎన్నడూ లేనిది సూర్యం చీకటిలో తట్టి లేపడం అందునా ఏకాంతంలో ప్రశాంతంగా ఉన్న చీకటిలో ఇలా క్రొత్త గొంతుతో మాట్లాడ్డం సావిత్రికి విడ్డూరంగా నేఉంది. రత్తమ్మలోవలె ఇటీవల సూర్యంలో గూడా తనంటే ఆప్యాయతా, ప్రేమా పొడుకొంటున్నాయని ఆమెకు ఈ సంఘటన ఋజావు చేసింది. లేకుంటే లోగడ ప్రతి చిన్న విషయమూ కొడుకులు నిర్ణయించడమూ, తాను నోరెత్తకుండా ఆచరించడమూ పరిపాటి. ఈనాటినుండి ఆమె జీవితంలో ఒక మార్పు మొదలుపెట్టింది. తాను ఒక ఆరిందాగా, పెద్దదిగా, ఓరిమిపరురాలుగా వారిద్దరి దృష్టిలోనూ పెరిగి వారికి మరింత దగ్గరయింది. ఇది ఆమెలో ఎనలేని ఆనందం కలిగించింది. అయితే మకాం మార్చేడి విషయమే ఆమె తనలో సంబాళించుకోనలేక పోతోంది. ఎంత ఆప్యాయతగా వస్తున్నా భానుమూర్తి అంటే తనకు క్రొత్తే. కాకున్నా ఇంటిలో అత్తయ్యతో ఎప్పుడూ కేఉండే తను. సూర్యం చూస్తే తిండైనా తినకుండా తిరుగుతూండే మనిషి. ఏమో! భానుమూర్తి ఎటువంటివాడో—కాకపోయినా నిజంగా రత్తమ్మమీద అభిమానమైనా ఆతన్ని పిచ్చేటట్లు పురికొల్పుతా—ఇంతలో చటుక్కున ఒక క్రొత్త ఊహ తొలకరి మెఱుపులా ఆమె మనోవీధిలో దూసుకుపోయింది. తనకు సూర్యంతో పెళ్లయిపోయివుంటే ఎంతబావుండేది. దాని వనక నే ఒక చిన్న సమస్య—సూర్యం ఇంతలో ఇంతకే తన ఊహ ఎందుకు మార్చేసుకున్నాడు. ఆమె చిన్ని మెదడులో ఈ సమస్యలు తేలిగ్గా పరిష్కరింపబడటంలేక పోతున్నాయి.

మరునాడు ప్రొద్దున్నే బండి అద్దెకు కట్టించి సూర్యం భానుమూర్తియింటికి మకాం మార్చేశాడు. సావిత్రికి ఇది ఇష్టంలేకపోయినా చేయక తప్పింది గాదు. భానుమూర్తి కిది అనుకోకుండా జరిగింది; కాబట్టి అతడు ఎంతో ఆనందం అనుభవించాడు. అతని సంతోషాన్ని రత్తమ్మ ఒకలాగా, సూర్యం ఇంకొకరీతిగా — అందరికంటే సావిత్రి ఇంకొక మాదిరిగా అర్థం చేసుకున్నారు. మన మనస్సులో తిష్ఠ వేసుకున్న అనుమానం కారణంగా జరిగే ప్రతి దాన్ని మన గీటురాయిమీద గీచి చూసుకుంటాం. ప్రతిసన్నివేశమూ, పరిస్థితుల్లోవచ్చే ప్రతిమార్పు దాన్ని బలీయం చేస్తున్నట్లు భావిస్తాం. అది మంచైతే ఆనందమూ చెడుగైతే బాధా మనకుగా మనం నెత్తిన రుద్దుకుంటాం. మానవసహజమైన ప్రవృత్తుల్లో ఇదొకటి. ఇంతకీ చెప్పవలసిన విషయం సావిత్రి కిది చేదుగానే రుచించింది. సామానులింట్లో సర్దకుండానే సూర్యం క్లబ్బుకు వెళ్ళిపోయాడు. అనుకోకుండా పదిహేను రూపాయలు కలసి వచ్చాయి అతనికి.

భానుమూర్తి బజారుకువెళ్లి ఇంట్లో కావలసిన సరుకులూ, రత్తమ్మకి పళ్ళూ, కూరలు తెచ్చాడు. ఆవాళటికి అతడు ఎప్పటిలాగా హోటల్లోనే తిన్నాడు. డాక్టరువచ్చి రత్తమ్మను పరీక్ష చేసి సుమారు నెలా పదిహేనురోజులైనా ఉండాలని చెప్పిపోయాడు. ఆతనికి కొంత డబ్బు భానుమూర్తే చెల్లించడం సావిత్రి స్వయంగా చూచింది. తాను ఎవ్వరినీ ఏమీ అనడానికి వీల్లేకుండా ఉంది. భానుమూర్తితో ఎదటబడి మాట్లాడ్డానికి ఎంతో భయంగా ఉంది. ఇలాగే రెండు మూడురోజులు గడిచాక ఒకనాడు రత్తమ్మ సావిత్రిని పిలిచి "ఏమే — వాడికి లేకపోతే ఆడదానివి నీకేనా మర్యాదా, మంచీ ఉండక్కర్లేదుటే! ఇంతగా మన్ని ఆదుకొంటూన్న మా నాయన భానుకి రెండు మెతుకులే వండి పెట్టలేవూ. నేను మంచమెక్కడం ంత ప్రారబ్ధ మొచ్చిపడిందే—ఇంతకీ నా కర్మ" సావిత్రి కేం సమాధానం చెప్పాలో పాలుపోవడం లేదు. క్రమంగా ఎవరో పెద్దబరువును తనమీద మోపుతున్నట్లు కుంగిపోయింది. "తెలిసిందిగాదు అత్తా. మీరు ఆనక చెప్పండి రేపటినుంచీ ఇక్కడే తినమని. పెళ్ళికాని పిల్లను నే నెలా నోరు మెదపను ఆయనముందు. మీరే చెప్పండి!" అంది రుద్ధ కంఠంతో. "పిచ్చిపిల్లా వాడుమాత్రం పైవాడామ్మా! మా అక్కయ్యే వుంటే ఎంత ఎరమరిక లేకుండా ఉండేది! సరే—నేనైనా చెబుతాలే" అంటున్న రత్తమ్మ మాటలు విని సావిత్రి లోపలికెళ్ళిపోయింది. రాత్రి పన్నెండు గంటలకు ఇంటికొచ్చిన కొడు

కుతో గూడా అదే సణిగింది రత్తమ్మ. ఇదంతా విని ఈవేళగూడా సీదాగా జేబు ఖాళీచేసి వచ్చిన సూర్యం పోకడ కనిపెట్టి దుఃఖంతో కళ్లు మూసుకుంది సావిత్రి. మరునాడు ప్రొద్దున్న సూర్యం కటువుగా మాట్లాడాడు. “ఇంకా తనకు ప్రపంచ జ్ఞానం తెలీదుట; పెద్దాళ్లను చూసైనా నేర్చుకోవడం లేదుట; ఇప్పటినుంచైనా మంచి అలవాట్లు చేసుకోవాలట; తాము ఆయన ఇంట్లోపడి తింటూ ఆయనకు తిండి పెట్టకపోవడానికి ఎంతో భానుమూర్తి కుములుతూన్నాట్ట” ఈ చివరి చురుకు ఆమెలో పౌరుషం రేకెత్తించింది. నిజంగా భానుమూర్తి అలా మథనపడుతున్నాడా—ఆమెకు వాస్తవంగా ప్రత్యుత్తరం రాలేదు. కాగా భానుమూర్తి లోలోన ఎంతో ఖులాసాగా ఉన్నట్లు గుర్తించింది ఆమె అనేకసార్లు. తాను పన్నిన వ్యూహంలో జయసూచనలు గాంచినప్పటి సేనాధిపతి పొందే ఆనంద రేఖలు అతని కళ్లల్లో కొద్దిగానైనా సావిత్రి చూడలేకపోలేదు. కనుక సూర్యం చేసిన ఈ మందలింపు ఆమెకు అన్యాయంగా తోచింది.

మరునాటినుంచి సావిత్రికి మరీ క్లిష్టపరిస్థితి వచ్చిపడింది. భానుమూర్తి ఊళ్లోపనులు చూసుకుని వేళగాని వేళ భోజనానికి వచ్చేవాడు. రత్తమ్మ మంచంపైనే ఉందిగదా. సూర్యం ఎప్పుడూ ఊరు పట్టుకునే తిరిగేవాడు. రోజూ ఇంటికి ఉత్తరాలు వ్రాయడం, రైతులు డబ్బు పంపారో లేదో అని సణుక్కుంటూ పదేపదే పోస్టాఫీసు కెళ్ళివస్తూ, వాళ్ళేమీ పంపకపోతే తిట్టుకోవడం, మధ్య మధ్య తన మీద గూడా చీకాకుపడడం అలవాటు చేసుకుంటున్నాడు. తానొక్కర్తే ఏకాంతంగా భానుమూర్తికి భోజనం పెట్టవలసివచ్చేది. అయితే అతడుమాత్రం ఎప్పుడోగాని ఆమెతో మాట్లాడేవాడు గాదు. ఏదేనా నూటికీ కోటికీ మాట్లాడినా ఆమె వంటకాలను ప్రశంసించడం, రత్తమ్మ యోగక్షేమాలు తెలుసుకోవడం, సూర్యాన్ని దుయ్యబట్టడం ఇట్లాంటివే జరుగుతూండేవి. సావిత్రి మాత్రం చాలాసార్లు ‘మౌనంగా ఉంటూనే భాను తన నేత్రాలతో ఆమెను నఖశిఖ పర్యంతం త్రాగేద్దామా’ అని మిఱ్ఱుచూపులు ప్రసరిస్తున్నాడా అని అతని వైఖరినిబట్టి అనుమానం పడుతూండేది. ఇంటి ఖర్చులతోబాటు భానుమూర్తి అప్పుడప్పుడు సూర్యానికి పెట్టుబడి పెడుతూండేవాడు గూడా పేకాటకు—ఈ ఆదరణలు, అనుకోని ప్రేమలు కేవలం ఆయన ఊరికేనే చూపుతున్నాడా అని ఆమె రంధి. దీనివల్ల ఒకటిమాత్రం పరిణమించింది. రత్తమ్మకూ, సూర్యానికీ భానుమూర్తిపై మమకారం ఎక్కువైంది. ఏవో పొలంమీదవచ్చే శిస్తులు తెచ్చుకుంటూ ఇక్కడే ఉండిపోతే ఎంత బావుంటుందీ! అనుకొనేదాకా వారి మనస్తత్వాలు మారిపోయాయి.

ఒకనాడు సావిత్రి వంట చేస్తూంటే చిన్న తమాషా జరిగింది. పోపుల పెట్టెకోసం అలమారు తెరచిన ఆ పడుచుకంటికి అవుపించిన రెండు వస్తువులు ఆమెను పులకితాంగినిచేశాయి. ముప్పేట గొలుసు ఒకటి—రెండోది ఒక గాజులజత. అట్లాంటి నగలు సావిత్రి అనేకసార్లు ఇతరులవద్ద చూచింది. అప్పుడు వాటిని చూచిన దృష్టే వేరు. కన్నెప్రాయపు ఆకర్షణకు లొంగి ఇప్పుడామె కేవలం ఇంకొకదృష్టితో చూడసాగింది. అబలత్వం ఆమెను ఆవహించింది. లాలస లలనకో బలహీనత. సహజదౌర్బల్యాన్ని ఆమె ప్రతిఘటించలేకపోయింది. ఔను! ఆ లేబ్రాయపు కన్నె హృదయం బరువైన జీవితంలోని అనుభవాలెన్ని చూసిందీ? చటుక్కున ఆ గొలుసు మెడలో వేసుకుంది. గాజులు సరిగా చేతులకు సరిపోయాయి. ఎవరో తనకోసమే చేయించి పెట్టినట్లుంది. ఒక్క అంగలో నడవలోనికి దూకి నిలువుటద్దంముందు నిలచింది నిజంగా తనలో ఇంత అందం ఇమిడివుందా. నివురుగప్పిన నిప్పులా సొగసుదనం తనలో పొదుక్కొని వుంది. భానుగాని సూర్యంగాని అప్పుడప్పుడు దప్పిగొన్న అడవి మృగాలవలె తనను శరీరంలో కణకణమూ మ్రింగివేయాలని ఎందుకు చూస్తున్నారో తనకు తాను తెలుసుకోగలిగింది. మళ్ళీ అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది. చిరునవ్వుతో మురిసిపోయింది. గిరుక్కున మెడ వెనక్కు త్రిప్పి ఆ సోయగంగూడా చూడదలచింది. గొలుసు ఆ తిరుగుడులో పేటలుగా చీలి ఆమె గుండెలను బలంగా ఆవరించింది. ముప్పేట గొలుసు ఆమె గుండెను గట్టిగా అదిమిపట్టి గుండెలో నుండి పైకుబికే హృదయంలోని పొంగును దేన్నో అణచివేస్తున్నట్లు ఆమెకుతోచింది ఆ ఉవ్వెత్తుగాలేచే శక్తి యౌవనపుపొంగు గాదు; శారీరకప్రకోపం అంతకన్నా కాదు. ఆమె ఎన్నడూ ఊహించలేని ఆమెలో నిబిడీకృతమైఉన్న ఒక దివ్యశక్తి, అంతర్వాణి నేడు ఆమె కేదో చెప్పడానికి ఉద్వేగంతో ఆమె ఎద తలుపుల్ని తెరచుకొని వెలికి వస్తూంది. సావిత్రి నిశ్చేష్టురాలైంది.

“సావిత్రీ! ఈ నగలెవరివే వెర్రిదానా! ఇవి భానుమూర్తి ప్రథమకళత్రం జానకివే—నీవు వాటిని

ధరించావు. వీటిని ధరించే త్రాణకోసం ఉబలాటపడేముందు ఆతన్ని గూడా ధరించగలనో లేనో అని ఆలోచించుకో—కేవలం నగలూ, నాణేలూ గాదు ప్రపంచంలో ప్రధానం! నీతీ, నియమమూ, సౌశీల్యమూ స్త్రీకి పుట్టుకతోవచ్చిన పెట్టని భూషణాలు. వాటి నెవ్వరూ దొంగిలించలేరు—

కాగా ఈ వస్తువులు—కన్నెపడుచా—పిచ్చి రామచిలుకా! నిన్ను పట్టుకోవడానికై వేటకాడు పన్నిన ఉచ్చులలోని జీడిపలుకులు ఇవి. జాగ్రత్త ఇప్పుడైనా శ్రుతిమించలేదు—వీటిని తప్పించుకొని ఎక్కడికైనా ఎగిరిపో"—సావిత్రికి ఒడలంతా గగుర్పొడిచి ముచ్చెమటలు పోసింది ఈ అంతర్వాహినీ తరంగాలు పెల్లుబకడంతో. ఆమె కళ్లు చెమ్మగిల్లాయి. ఇంతటి బరువైన, బలమైన సందేశం ఇవ్వడానికి ఆ కన్య లేతహృదయం ఎంత సతమతమైపోయిందో—అప్రయత్నంగా ఆమె నోట పిచ్చిగా రెండుముక్కలు భయంతో వెలువడ్డాయి. —ఎక్కడికి ఎలా ఎగిరిపోనూ" ఎదురుగాగోడకు తగిలింపబడ్డ రవివర్మ చిత్రం చూచింది. యమధర్మరాజు క్రూరంగా సత్యవంతుని ప్రాణాలులాక్కుపోతూంటే నెర్రిగా సావిత్రి వెంబడిస్తోంది పతికై. "ఔను! ఆమె జయించింది నే నెందుకు నిలవరించలేను" అనుకొని ఆత్మవిశ్వాసం నింపుకొని త్రుటిలో ఆ నగలు తీసేసి యథాస్థానంలో వుంచి మళ్లీతన నిత్యకృత్యంలో లీనమైంది. ఛా—ఇదేవిఁటి ఇంత 'బేలనయ్యాను' అనుకొంది.

మధ్యాహ్నం రెండింటికి భానుమూర్తి భోజనానికి వచ్చాడు. మాట్లాడకుండా మజ్జిగ పోసుకోవడందాకా వచ్చింది వాయి. ఇంక ఉండబట్టలేక సావిత్రే ప్రారంభించి "మఱచిపోయి అలమారులో వుంచేసినట్లున్నారు కాసులు పేరూ, గాజుల జతాను. తీసి జాగ్రత్తపెట్టండి" అంది. "ఆఁ—ఇక్కడ మాత్రం పైవాళ్లెవరున్నారూ! కాకపోయినా అది బ్రతికున్నప్పుడు అన్నీ తానే చక్కబెట్టుకు నేది. తర్వాత క్రమేపీ నాబుద్ధి మందగిస్తోంది. ఏం బ్రతుకో—వెధవజన్మ" భానుమూర్తి కంఠం రుద్ధమైంది. "ఇదిగో—అలా ఇదవకండి. మనం మాత్రం కలకాలం ఉట్టిగట్టుకు ఊరేగుతామా. విచారించి ప్రయోజనం?—ఊరుకోండి" ఇది మానవ సహజమైన సంతాపం, సావిత్రిసానుభూతి వెల్లడిచేసింది. పీటమీదనుంచి లేస్తూ దుఃఖం నిండుకున్న కళ్లతోనే సావిత్రివైపు ఒకసారి చూశాడు—ఆ కన్నీళ్ల వెనుక దాగివుండె ఆ ప్రాణి ఎందుకో తన సానుభూతిని మరీ లాక్కొన తాపత్రయ పడుతున్నాడని గ్రహించిన సావిత్రి గుండె గతుక్కుమంది. చేతులు కడుక్కొని తుండున తుడుచుకొంటూ "పోనీ సావిత్రీ—అవి అలాగ బందిఖానాలో పడిఉన్నట్లు ఇనప్పెట్టెలో ఎన్నాళ్లో మూలుగుతాయి. నీవు వేసుకో ఏమీ అరిగిపోయేవీ విరిగిపోయేవీ గావుగా" అంటూ ఆమె సమాధానానికైనా వేచియుండక నడవలోకి నడచాడు. సావిత్రి చెప్పుతూనే ఉంది. "వద్దు అవి నాకెందుకూ—జాగ్రత్త పెట్టండి." భానుమూర్తి నగలను, జవ్వారీని ఖాళీచేసిన ఇనప్పెట్టెలో తన హృదయాన్నుంచి శాశ్వతంగా బందీ చేయబోతున్నాడేమో అని హడలిపోయింది. ప్రాణంలేని వస్తువుల స్థానే తన పవిత్రమైన, ప్రాణంకంటె మిన్నయైనదాన్ని దేన్నో ఆతడు లాగివెయ్యడానికి గేలం వేస్తున్నట్లు పసికట్టింది ఆ పడుచు.

రత్తమ్మ మకాంమార్చి ఇరవైరోజులయ్యింది. అయినా గుణమేమీ కానరావడంలేదు. డాక్టరు రోజూ పరీక్షచేసి సూదిపోట్లు పొడిచి వెడుతూనే ఉన్నాడు. క్రమేపీ ఆమె స్థితి క్షీణిస్తోంది. రెండునాళ్ళ నుంచీ మరీని. కళ్లలో నెత్తురుజీర పడుతోంది. రోజు లెంతో బరువుగా దొర్లుతున్నట్లనిపించింది సావిత్రికి. సూర్యం బొత్తిగా ఇల్లుమొహం మఱచిపోతున్నాడు. తల్లిజబ్బు అలాగుండేదే అనేధీమా నెలకొన్నది ఆతనిలో. పేకాటకు ఇంటిదగ్గరనుంచి వొచ్చిన డబ్బూ చాలడంలేదు; భానుమూర్తి ఇచ్చే అప్పూ చాలడంలేదు.

ఆవాళ శనివారం. ప్రొద్దుటనే స్నానం చేసి పూజాదికాలు ముగించుకొని సావిత్రి వంటపనిలో లీలమైంది. వసారాలో మంచంమీద రత్తమ్మ నిద్రపోతోంది. ఏడున్నర గంటలకే ఊళ్లో తనకు రావలసిన ఇళ్లద్దె బకాయిలు వసూలు చేసుకోవడానికి వెళ్లాడు భానుమూర్తి. సూర్యం రైతుతో మాట్లాడ్డానికి స్వగ్రామం వెళ్లాడు. మనసు పరిపరి విధాలపోయి యేమీ తోచక దిగులుపడి అలాగే రెండుగంటలసేపు కూర్చుండి పోయింది. ఇంతలో నడవలో గడియారం తొమ్మిదిన్నర కొట్టింది. అత్తయ్యకు జావ కాచడానికి పొయ్యిమీద నీళ్ళు పెట్టింది.

నీళ్లు సలసల మఱుగుతున్నాయి. వాటిలో రవ్వ వేసింది. రవ్వతో కలసి ఉడికే జావ కెరటాలు లేస్తోంది. కళపెళ ఉడుకుతోంది. ఆమె తరుణ హృదయంలో ఒక్కసారి ఎన్నో తీయని కోర్కెలు కెళ్లు

తున్నట్లూ వాటికి ఆవలో పొంగులు తాళం వేస్తున్నట్లూ అనిపించింది. జీవితంలో సుఖం అన్నది తీయగా ఉంటుందనుకోవడమే గాని ఎన్నడూ చవి చూడని పడుచు. ఆద్వారం తెరచుకుని పట్టుపాన్పుల పై పరచబడ్డ ఆ అందాల దొంతరలను అమాంతంగా కౌగలించుకునే పుణ్యక్షణం ఎప్పుడొస్తుందో గదా! ఆహా! జీవితంలో యౌవ్వన ప్రభావం వర్ణనాతీతం. ఊహించిన కొద్దీ ఆమెలో భావాలు సముద్ర కెరటాలవలె ఉబుకలెత్తుతూ ఉవ్వెత్తుగా లేచి ఎదురు తాకే ఆస్కారం లేక తమకు తామే ఢీకొని ప్రిదిలిపోయి నురుగులు గక్కి ఉక్రోషంతో వెనక్కు పోతున్నాయి. ఈ వీచులతో సావిత్రి మేనుస్నానం చేసి, పరిప్రభితను కూర్చుకొన్న ఆమె శరీరంలో అవయవాలన్నీ గర్వాటుతో కీలక స్థానంలో నిలుచున్న బాటసారుల్లా నిటారుగా నిలుచున్నాయి. ఆమె అంద చందాలు ఆక్షణంలో అక్కడున్న ప్రాణవిహీనములైన పాత్రలకు తెలుసు; అక్కడ పరివ్యాప్తమైఉన్న పంచభూతాల కెఱుక— ఇట్టి సంఘర్షణ ఆమె ఏకాంతంగా ఉండగా జీవితంలో పొందడం ఇదే ప్రప్రథమం.

భావజలధిలో మునిగి జావ పొంగి పోవడం చూడడం అశ్రద్ధ చేసింది. పాత్ర అంచుల మీదనుంచి పొర్లి పొయ్యిలోపడ్డ తెరకలు ఆమెను ఈప్రపంచంలోకి లాక్కొచ్చాయి. పీటమీదనుండి లేచి పొయ్యి మీదకి వంగి రెండు చేతులనుఎత్తి గిన్నెను తీయడంలో సవరించుకోని ఆమె పమిటకొంగు పొయ్యిలోకి పడిపోతూన్న క్షణంలో—"అఁ—అఁ— సావిత్రీ అంటూ" ముందుకువచ్చి ఆమె పమిటనుఎత్తి భుజాలమీదకు చేర్చి ఆమెను పొదివి పట్టుకొన ప్రయత్నించాడు భానుమూర్తి. 'ఈయనెప్పుడొచ్చాడు— ఛా—ఇదేమిటి' అనుకుని కలద్రొక్కు కోవడంలో కాళ్ళ దగ్గరున్న గరిటె పొయ్యిలోకి దొర్లింది. అగ్ని నాలుకలుచాస్తూ భానుమూర్తి కామంలా ఎగబ్రాకుతూంది సావిత్రిముఖం దెసకు. గుప్పున సెగదగిలి ఆమె కళ్ళు మూసుకుంది. ఇదంతా కొన్ని సెకన్లలో జరిగి పోయింది. సావిత్రికి నిలువునా ప్రాణాలు పైకెగసిపోయాయి "మీరు—వదలండి— ఇదేంన్యాయం—" పెనగులాడు తోంది అతనిచేతులు విదిలించుకోవడానికి. నోటితో కరుద్దామా! గోళ్ళతో రక్కుదామా! ఏంచేయాలీ కబంధహస్తాల్ని ఛేదించడానికి—ఆమెకేమీ తోచడం లేదు. భానుమూర్తి చిత్రప్రతిమయై ఆమెనింకా అలా పట్టుకునే ఉన్నాడు. అతని భావం ఆమెకు అర్థంకాలేదు. అతడు తన్నేంచేద్దామని అలా పట్టుకున్నాడు?

చుట్టూ ఆయుధానికై ప్రాకులాడింది లాభం లేక పోయింది పాదముల ముందున్న ఇనుపగరిటె సన్ననికొస ఆమె దెసకు కొరకొర చూసింది. వెంటనే చేతిని అటుపోనిచ్చి గరిటకాడని ఉన్నట్టుండి ఒక్క పెట్టు తన భుజాల్ని అదిమే వ్రేళ్ళమునకలపై వుంచింది. పొయ్యిలో ఉండటి కొద్దిసేపేఅయినా గరిట ఎర్రగా కాలిపోయి ఉంది. 'కెవ్వు'న కేక పెట్టి 'అబ్బా! ఎంతపని చేశావు సావిత్రీ!' అంటూ రెండు గజాల దూరాన కూలబడ్డాడు భానుమూర్తి. మదం వొదిలి మళ్ళీ స్పృహలోకొచ్చాడు. సావిత్రిపై చింత నిప్పులు కురిపిస్తూ "సరే! నీ ఇష్టంవచ్చినట్లు చేద్దామనుకుంటున్నావు. పెళ్ళి కావలసిన దానివి జాగ్రత్తగా ఆలోచించుకో. నాకా ఇంకా ముప్పై దాటలేదు. ఆస్తిపాస్తులు గలవాణ్ణి. నీఉద్దేశం నేను కొన్నాళ్ళ క్రితమే తెలుసుకున్నాను. సూర్యం గతి ఏమవుతూందో తెలుసుకో—డాక్టరు మీతో చెప్ప లేదు. నాలుగైదు రోజుల్లో రత్తమ్మ కాలం చేస్తుంది పొలం నా పెట్టి డబ్బుదెచ్చి పేకాడి తగలేసు న్నాడు. ఈమధ్య త్రాగుడు గూడా అలవాటుచేసు కున్నాడు—" అంటూ బొబ్బలెక్కిన చేతిని చూపుతూ "సరే— నేను దీన్ని ఎన్నడూ మఱువ లేను—ఇంకా నీవేమో వివేకంగా ప్రవర్తిస్తా వనుకున్నా—బాగా ఆలోచించుకో సావిత్రీ—నీభవిష్యత్తు నీచేతుల్లో ఉంది. నన్ను పెళ్లిచేసుకు సుఖించినా సరే—లేక కాదని కష్టపడ్డా సరే. నేను నిన్నేమీ చెడిపో మనడంలేదు. సంపన్న గృహిణివై వృద్ధిలోకి రమ్మంటున్నా" అంటూ చరచర బయటకు నడిచాడు. "వీళ్ళంతా తనయింట్లో వుంటున్నారు; సూర్యం తనదెబ్బ వాడుకుంటున్నాడు; సావిత్రి మాత్రం తాను తెచ్చిన పూలు పెట్టుకొనేది, ముద్దుగా తనతో మాట్లాడేది; ఇంట్లోకి ఏమికావాలన్నా వినయ విధేయతలతో తనతో చెప్పి తెప్పించుకునేది. వచ్చి ఇన్నాళ్ళైనా కనీసం కల్లోనైనా తనపై అయిష్టం ప్రకటించలేదు; ఆమె వొట్టి అమాయకపు పిల్ల; తనవంటి ధనికుణ్ణి, ప్రాయంలో ఉన్నవాణ్ణి కాదంటుందా అని భ్రమపడి ఎంత తొందర పడ్డాను! సరే సిరిరామోకాలాడ్డింది. మీద ఈమె గతి ఏమవుతుందో చూస్తాగా" అనుకొని డాక్టరు దగ్గరకు వెళ్ళిపోయాడు.

ఇంక సావిత్రి. తాను మూర్ఛిల్లి పోయినట్లే అయింది. పంచేంద్రియాలు పని చేయలేదు ఆమెకు.

కళ్లు తెరచి తన శరీరాన్ని తానే అసహ్యించుకొంది. ఎంతలో ఎంత మార్పు—కొంతక్రితం నవనవోన్మేష భావాలతో పుష్పంలా వికసితమై వున్న ఆమె దేహం ఇప్పుడు ఊడబీకి ఎండలో పారేసిన లేతతోటకూర కాడలాగైంది. తన్నెందుకు దేవుడిలా సృష్టించాలి! 'ఛీ—ఛీ' ఎంత అప్రతిష్ఠ—తన్ను, స్నానం చేసిన శుభ్రశరీరను, అనాచ్ఛాదితమైన వక్షంపై వస్త్రం జారిన దాన్ని—తుచ్ఛుడు భానుమూర్తి తాకి, లేత గులాబిని కర్కశకర యుగ్మంతో నలిమివేయ ప్రయత్నించినట్లు కోమాంగుణ్ణి నలిపివేయ ప్రయత్నించి—మైలపరచాడు. కుమిలికుమిలి ఏడుస్తోంది. రక్షణ లభిస్తుందనుకున్న ఇల్లు త్రాచు పాముల కిరవయ్యింది. ఇంక తనకేది దిక్కు? తానాశ పెట్టుకుని ఆకాశవీధిలో గాలిమేడలు నిర్మించే—సూర్యం త్రాగుబోతు; జూదరి. సమాజంలో ఒక ఉచ్ఛిష్టంగా మారి పోయింది అతని బ్రతుకు. ఇంతకీ ఇప్పుడు తన్ను పెళ్లి చేసుకోమంటే ఏమంటాడు—తనను ఇంత చేసిన భానుమూర్తి ఆ అన్యాయకుణ్ణి మాత్రం పాడు చెయ్యడని నమ్మకం?—

సావిత్రి భానుమూర్తిని వాత పెట్టింది, అసలు పురుష ప్రకృతే విచిత్రమైంది. ఇట్లాంటి అవస్థల్లో స్త్రీలు ప్రయోగించే ప్రతి ఆఘాతమూ గూడా అట్లాంటి పురుషులవల్ల ఎంతో ఓపిగ్గా సహింపబడతాయి. ఎన్ని తన్నులు తిన్నా అవమానం పొందడు. గోళ్లతో వొళ్ళంతా నెత్తురులు చిమ్మేట్లు రక్కినా సహిస్తాడు. వాతలు లెఖ్ఖ పెట్టడు. ఇన్ని బాధలూ తనవల్ల పొందుతున్న ప్రాణిపై సహజంగా అబలమనస్సున సానుభూతి కలసిందా—సరి. అతడు విజయం సాధించాడన్న మాటే. స్త్రీ తాను స్వయంగా చేసిన ఆ ప్రయోగాలే విచ్చుకత్తులై ఆమె అమూల్య సౌశీల్యాన్ని ఖండ ఖండాలు చేస్తాయి—

క్రమంగా కాస్సేపటికి ఆమెలో ఇంకో ఊహ లేచింది "అరే—ఆయన నేమనుకున్నాడో—బ్రతిమాలితే విడచేవాడు గాదూ—" బాల్య చాపల్యం ఇంకా వదల్లేదు ఆమెలో—పోనీ—ఇతన్ని పెళ్లి చేసుకుంటే—ఏం—ఇతనికేంతక్కువ? రేపు చేసుకోమంటే సూర్యం ఏమంటాడో! రత్తమ్మ బాగా ఉండగానే పెళ్లి జరిగి ఉండవలసింది; కాలేదు. ఆమె ప్రాణం హరీ అంటే తనభావి!—ఇంతలో రత్తమ్మ మూలుగు వినిపించింది—జావపట్టుకు వసారాలోకి వెళ్లింది. దొంగతనం చేసిన దానికివలె రత్తమ్మ మొహం చూడలేక పోయింది సావిత్రి. "ఇలా రాఅమ్మా—ప్రక్కన కూర్చో" అంది దీనంగా రత్తమ్మ. తలవంచుకుని కళ్ళనీళ్లు నింపుకొని అత్తయ్య చెప్పే మాటలన్నీ శ్రద్ధగా వింటోంది. "పిచ్చితల్లీ నీవు పసిదానివి సావిత్రీ—నేనింక నాలుగైదు రోజులకన్న ఎక్కువకాలం బ్రతకను. కట్టారా సూర్యమూ నీవూ కాపురం చేస్తుంటే చూద్దామనుకున్నా. ఈ జన్మకు ఆభాగ్యం నాకు లేదు. ఒక్క కోరిక చెల్లించు తల్లీ! సూర్యం బొత్తిగా పాడై పోతున్నాడు. చిన్నప్పటినుంచి నేను పెట్టిన గారాం వాణ్ణి ఈస్థితికి లాక్కొచ్చింది. త్రాగుడుకూడా మొదలు పెట్టాట—నేనుపోయాక నీవూ, వాడూ చెట్టుమీద పక్షుల్లా మిగిలి పోతారు. "అని గ్రుడ్లనీళ్లు గ్రుక్కుకుంది" విచారపడకండి. అత్తా—మీమాట నేను అక్షరాల పాటిస్తాను. చెప్పండిఅంది ఏడుస్తూ సావిత్రి. "ఇంకనుంచి సూర్యం బాధ్యత చిన్నదానివైనా నీమీదే పెడుతున్నా—ఎలాగైనా సరే ప్రయత్నించి మనఊరు తీసికెళ్లిపో వాణ్ణి. మనరైతు వీరరాజు చాలా మంచివాడు. ఎలాగో త్వరగా మూడుముళ్ళూ పడేటట్లు చూసుకో—సూర్యమూ నీవూ మళ్లీ ఆ యింట్లో దీపంపెట్టి పదికాలాలు బ్రతకాలి" ఆయాసపడుతోంది మాట్లాడలేక రత్తమ్మ. సావిత్రి మౌనంగానే ఆమె చేతిలో చేయినుంచింది. ఇంతలో కెరటంలాగా పెద్ద దగ్గువచ్చింది రత్తమ్మకు. ఆమెలేచి దగ్గలేక పోయింది. శ్లేష్మంతోపాటు బేసినులో నెత్తురుగూడా ముద్దుముద్దలుగా పడడంచూసి సావిత్రిగుండె ఝల్లుమంది.

ఆవాళ భానుమూర్తి అసలు ఇంటికే రాలేదు. సావిత్రికి అన్నం సహించలేదు. నట్టనడి సంద్రంలో చుక్కానిలేని నావ పెనుతుపానులో కొట్టుమిట్టాడుతున్నట్టుంది ఆమెబ్రతుకు. రాత్రి ఒంటిగంటకు వచ్చాడు సూర్యం చినిగిన బట్టలతో. తప్పత్రాగి ఉన్నాడు. భోజనానికి లెమ్మంటే ఆమెను కొట్టబోయాడు. మాట్లాడితే "గ్లాసు—గ్లాసు" అంటూ అరవడం మొదలు పెట్టాడు. రాత్రల్లా బేజారైన గుండెతో సావిత్రికి నిద్ర పట్టనేలేదు.

మరి వారం రోజులకు అనుకున్నంత పనీ జరిగి పోయింది. రత్తమ్మ ఇంటిల్లిపాదినీ దుఃఖసముద్రంలో ముంచి స్వర్గస్థురాలైంది. ఆమె కన్నుమూసేసరికి దగ్గర సావిత్రి తక్క ఒరులెవ్వరూ లేరు. కడసారి చూపులు కూడ దీనాతి దీనంగా ప్రార్థించాయి సావిత్రిని సూర్యం భారం వహించమని పదేపదే. ఆవిడ తనువు చాలించిన గంటసేపటికి భానుమూర్తి

వచ్చాడు ఇంటికి. పనిచేసే కుర్రాడిని వెంటనే తీసుకురమ్మని సూర్యం కోసం కబురుపెట్టాడు క్లబ్‌కి. సూర్యం నెత్తీనోరూ మొత్తుకుంటూ వచ్చాడు ఇరుగు పొరుగు వాళ్లు నలుగురూ సాయంచేసి రత్తమ్మ శవాన్ని శ్మశానంకు చేర్చారు. తంతుకయ్యే ఖర్చంతా భానుమూర్తే భరించాడు. మధ్యాహ్నం రెండుగంటలయ్యింది చితికి అగ్గి బెట్టే సరికి అత్తయ్య దేహం అగ్నికాహుతి అవుతూంటే కడుపు తరుక్కుపోయేటట్లు బావురుమని యేడ్చింది సావిత్రి.

ఆపిల్లకు ఆక్షణంలోనే ఆసంసారం బరువు మీదపడి ఆమెను బొత్తిగా భూమిపై అణచిపెడుతున్నట్లనిపించింది. చితిపైరేగిన జ్వాలలు ఆకసంలోకి నాలుకలుచాస్తూ ఎగబ్రాకుతున్నాయి. ఆమెకు ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి. 'రేపటినుంచీ ఇలాంటి సూర్యంతో బ్రతుకెలాగ? చిన్న చావుగాదు గదా! అరవయ్యోపడి వగరబడి రత్తమ్మ కాలంచేసింది. రేపటినుంచీ జరగవలసిన కర్మమాట! దానాలు ధర్మాలు. చుట్టాలు పక్కాలు. వచ్చేపోయ్యే వాళ్ళ పరామర్శలు—భోజనాలు బోల్లు వాయినాలు. ఆహా! తను వెళ్లినా దినమెళ్ళదంటారు ఇందుకే గాబోలు—పాపం! పిచ్చివాడు! తొమ్మిది నెలలూ మోసి కని పెంచి గారాబుతండ్రిని చేసిన రత్తమ్మచావుకు సూర్యం ఎంత విలపిస్తున్నాడో—ఏమిటో! వెధవబ్రతుకు—ఉన్నన్నాళ్ళూ నాయిల్లూ నావాకిలీ—నాసౌఖ్యమూ ఎంతసేపూ 'నా' గొడవే! బొంది బూడిదౌతుంటే ఏమీ అక్కర్లేదుగదా! ఒక్కరూ కూడా రారుగదా! ఈ జీవితమంతా ఒక మహా మాయావ్యూహం. -ఇందులోబడి గుడిగుడి గుంజం తిరుగుతూంటుంది ప్రాణి. దీనికి ఎన్ని మెరుగులు, ఎన్ని ఊహాలు. ఎన్ని కాంక్షలు ఎన్ని కోరికలు ఎన్ని...' ఆలోచిస్తూ అలా చూస్తుండగానే మంటలు క్రమంగా చల్లారి పోయాయి. అంతా లేచి ఇళ్లకు చేరుకున్నారు

కర్మయావత్తూ శాస్త్రోక్తంగా భానుమూర్తే సూర్యంచేత చేయించాడు. 'ఆమెకు ఏమీలోటు చెయ్యలేదన్నారు' చూడవచ్చిన బంధువులంతా. వాళ్ళల్లో అంతా తలొకలాగునా సూర్యం భవితవ్యం చిత్రించుకున్నారు తమలో. కొందరు 'నాయనా—త్వరలో ఆపెళ్లిగొడవగూడా పూర్తిచేసుకుని ఇంటి దగ్గరే కొండ్రదమాసుకుంటూ పడిఉండ'మన్నారు. మరి కొందరు సావిత్రిని 'నీవే చూసుకోవాలింక—పాపం! పసిదానిని నెత్తిన ఎంత బరువెత్తిపోయిందో రత్తమ్మ' అన్నారు కళ్ళనీళ్ళు నింపుతూ. ఇంకా కొందరు 'ఆసమయానికి పినతల్లిమీద అభిమానం ఉంచుకున్నాడు భానుమూర్తి—ఏమాటకదే చెప్పుకోవాలి. ఈరోజుల్లో ఇంతఖర్చు ఎవడు భరిస్తాడమ్మా! లేదంటే అరసంచి పైచిలుకు అయివుంటుంది. కాకపోయినా ఆభగవంతుడు గూడా అవసానకాలానికి ఎవరినో ఒకర్ని చూపిసాడు' అన్నారు.

పన్నెండోనాడు సమారాధన జరిగింది. బంధువులంతా ఎవరిమటుకువారు జారుకున్నారు. మరి రెండురోజుల అనంతరం సూర్యం భానుమూర్తి లెక్క చూసుకున్నారు జమాఖర్చు—వెరశి అయిదు వందలడెబ్భై అయిదైంది చిల్లరకాగితాలు పాతికా చేతిలో బెట్టి ఆరువందలకీ నోటువ్రాయించుకున్నాడు సూర్యంచేత భానుమూర్తి. పాతబకాయి నాలుగు వందలకీ సరేసరి నోట్లుండనే ఉన్నాయి! ఏదో—స్థిమితపడ్డాక నెలా రెండునెలల్లో బాకీసీదాగా ఎత్తేసేలాగ చూడు' అన్నాడు సూర్యంతో.

సాయంత్రం సూర్యం మళ్ళీ క్లబ్బుకువెళ్ళాడు. ఇంట్లో ఏడుస్తూ సావిత్రి ఒకర్తే కూర్చుంది. భానుమూర్తి నెమ్మదిగా ఆమెను ఓదార్చసాగాడు "ఇంక రోజూ ఏడ్చి ప్రయోజనంలేదు. సూర్యం పరిస్థితి చూస్తున్నావుగా. ఇప్పటికైనా సరే—నేనొక్కటడుగుతున్నా—నీతోఅన్న విషయమై జాగ్రత్తగా ఆలోచించావా? నీయిష్టం వచ్చినట్లు చేసుకో—అభ్యంతరంలేదు—నేను ఆవాళ అలాగ చెయ్యడం నాదే పొరబాటు. కేవలం భ్రమపడి అలాగ చేశాను. నీకుగూడ ఇష్టమే నేమో అనుకున్నాను. దానికి నీవేమీ చింతించకు—ఏమంటావ్" అని ప్రశ్నించాడు. సావిత్రికి మరీ దుఃఖం అధికమయ్యింది. ఆమె ఆలోచిస్తూంది 'భానుమూర్తి భ్రమించడంలో తప్పు చెయ్యలేదేమో. అంతకుపూర్వం చూపులతో భావాలు ప్రకటించడంతప్ప తానూ, అతడూ ఎదుటపడి ప్రత్యక్షంగా ఆసందర్భంగూర్చి ప్రస్తావించుకోనిదే'—కుండెధైర్యంగా చిక్కబట్టుకొని రత్తమ్మకు తాను చేసిన వాగ్దానం వ్యక్తపరచింది. భానుమూర్తి ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు "సరే—ఇంక ఈక్షణం నుండి నేనుగాని నీవుగాని ఆసమస్యను తలపెట్టవద్దు. జరిగిపోయిందేదో జరిగింది. రేపటినుండి పదిహేను రోజులలో మరి నీవేమి ఆలోచిస్తావో సూర్యంతో—మరేం చేసుకున్నా సరే—మీరిద్దరూ ఇక్కడనుంచి మకాంమార్చేటట్టు చూడాలి. నేనుమాత్రం ఎన్నాళ్ళు పోషిస్తాను—ఏదో ఇంకో సంబంధమైనా చూసుకోవాలిగా. బాగా ఆలోచించుకోండి ఆనక" అంటూ

లేచాడు భానుమూర్తి. మళ్ళీ యథావిధిగా ప్రారంభమయ్యింది పోరుజీవితం సూర్యానికి. రాత్రి పన్నెండింటికి మైకంలో గడపత్రొక్కాడు. సావిత్రి పడిపోకుండా అతన్ని చెయ్యి బట్టుకొని మంచంపై వాల్చింది. ఏదో అనునయించడానికి ప్రయత్నిస్తే ఆమె పై చెయ్యిచేసుకుని రెండుకొట్టాడు చెంపపై. ఆమెకు ప్రాప్తించిన దురవస్థకు మళ్ళీ బావురుమని ఏడ్చింది. కంటికి కునుకులేదు. ఈమధ్య భానుమూర్తి గూడా ఇంటికిరావడం మానేశాడు రాత్రిళ్ళు.

మరునాడుదయం సూర్యం సావిత్రీ ఘర్షణపడ్డారు. సంభాషణలు తీవ్రంగా సాగించుకుంటుండగా భానుమూర్తి ప్రవేశించాడు. ఆతడు వచ్చిన తర్వాత గూడా తీక్ష్ణంగా మాట్లాడుకుంటున్నారు—

"ఏమైనాసరే రేపు మకాం మార్చెయ్యాలి. భానుమూర్తిగారు చెప్పనే చెప్పారు" అంది సావిత్రి. "అలాగలే—ఇంకా నెలరోజులుండి పనేదైనా చూసుకుని" సూర్యం.—"ఇంకా ఈ ఊళ్ళో ఉండడమా. వద్దు—ఎంతమాత్రం వద్దు."

"ఔను—నీకుమాత్రం లోటేమిటే—ఏం తక్కువౌతోంది ఈఇంట్లో"

"అదేవిటి అలా మాట్లాడుతున్నారు—చెరుకు తియ్యగాఉందని వేళ్ళతో పెల్లగించుకు తింటారా"

"నీఇల్లులాగ చూసుకుంటున్నావుగా! ఏం ఇబ్బంది వచ్చిపడింది"

"నాయిల్లా" సావిత్రి గజగజ వణికిపోయింది. ఆమెకు సూర్యం ఇలాగనడంలో అర్థంకనపడలేదు. సూర్యం తన్ను అనుమానిస్తున్నాడు దేనికో—"ఏం—ఏమీ ఎరగనట్లు మాట్లాడుతున్నావు" అని చెయ్యి చేసుకోవడానికి లేచాడు సూర్యం. భానుమూర్తి కలుగచేసుకున్నాడు. "తగ్గుసూర్యం తగ్గు—పెళ్ళికాని పిల్లపై అలా చెయ్యి ఎత్తడానికి నీకు అధికారం ఎవడిచ్చాడు" అన్నాడు. సూర్యంవైఖరి క్షణంలో మారిపోయింది. మతిపోయినవాడైనట్లయ్యాడు. "ఔను—భానూ—క్షమించు. మాఅమ్మ బ్రతికున్నట్లే చనువుగా అనుకొని మూర్ఖత్వం ప్రకటించాను. నేనింకా పిచ్చిలోనే ఉన్నాను. కాకపోతే ఈమెకూ నాకు సంబంధం ఏమిటీ?— నే నెవరిని ఈమెను శాసించడానికి.—చివరకు నాబ్రతుకు ఇలా బ్రద్దలు చేసుకున్నాను. ఒకరిని అని ప్రయోజనం శూన్యం—దీపం ఉండగా ఇల్లు చక్కబెట్టుకోకపోతే ఏమవుతుంది. యౌవనం మైకంలో పడుచుదనపు బింకంతో ఏమేమో అనుకొని ఏదేదో సావిత్రి పెళ్ళికాని పిల్ల—కన్య. ఆమెను తాకడానికైనా నాకు అధికారంలేదు-అధికారం ఎన్నేళ్ళు పెంచితేమాత్రం ఎంత పరిపోషణ చేస్తేనేం—ఎంత ప్రేమచూపితే మాత్రం ఒరులసొత్తు మనదౌతుందా—ఎరువు ఏడాదుంచుకుంటే మాత్రం స్వంతం ఎట్లాగౌతుంది" అనుకుంటూ పిచ్చిధోరణిలో పడి వలవల ఏడ్వడం ప్రారంభించాడు.

సావిత్రికి మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లయింది. ఉన్నవాటికిదో జతగూడ. కానిఒకటి: ఇతః పూర్వం వచ్చిన ఆపదలన్నింటిని సైపడానికి నిర్మితమయ్యే దుర్భేద్యమైన మహాదుర్గంవంటి మనస్సులో తనకు తెలియకుండా పునాదులు ఊగిసలాడుతున్నట్లు కనుపిస్తోంది. ఇలాంటప్పుడు ఏది దారి? సూర్యం ఇలా మారిపోవడానికి కారణం? అసలు ప్రపంచం తంతే ఇంతా? లేక మహాకష్టాలు లేనిదే పెనుతుపానులేని సాగరంవలె జీవితంలో చేవ వుండదా? తనను ఈబాధలో ముంచి సూర్యం లేచి వెళ్ళిపోయాడు—ఆతనితో మాట్లాడడానికేనా అవకాశం లేకుండా అస్త్రం చేతలేని యోధుణ్ణి శరపరంపరలచేత వొళ్ళంతా తూట్లుపొడిచి పోయినట్లు తన్ను దిగ్భ్రాంతను చేసి, వెన్నులో పొడిచేసి, తనయెదను పొడిచేసి, మనస్సును హూనంచేసి వెళ్ళిపోయాడు—ఇదంతా చూస్తూ భానుమూర్తి రాయిలా పడి వుండిపోయాడు.

తల్లి దండ్రులులేని తాను—ఊహరాని పసితనం నుండి చీమూ నెత్తురూ ధారవోసి ఎవరికైతే సేవచేసిందో, మానాభిమానాలను మంటగలుపుకొని ఎవరికైతే దాసిగా బ్రతికిందో, గాలిమేడలు కట్టుకొని దృఢచిత్తంతో నాటివరకు జీవిస్తోందో—భవిష్యత్తులో గూడా ఎవరి యండన తానొకపత్నియై ఇల్లాలై, స్త్రీయై సభ్యమానవప్రపంచంలో జీవించనువ్విళ్ళూరుతోందో—ఆ సూర్యం తన్ను కాలదన్నాడు. ఆత్రేయపుకన్నె చిన్న బ్రతుకులో ఎంతటి ఎనలేని ఒడిదుడుకులు కల్పించావు హతవిధీ!

'ఛీ! ఈ ప్రపంచాన్ని ప్రేమించగూడదు. ఏకాకిని, అర్భకుని, తోటివాడనీ—జూదరి, త్రాగుబోతు, భ్రష్టుడు, అవినీతిపరుడు—అట్టివాణ్ణి—కేవలం చిన్నప్పటినుంచి తనకతడే భర్తయని పెద్దలయెదుట రూపొందించుకున్న కారణాన, ఒకానొక ప్రాణికి అవసానదశలో మాటయిచ్చిన కారణంగా—తనకుఎదుట 'వేసివేయ్' మని లక్షాధికారి వంటి, వయసులోఉన్న, అన్నింటికన్నా తనపై

మోజుతో మగులుగొని తహతహలాడే—యువకుణ్ణి కొలదన్ని—కేవలం పవిత్ర హిందూధర్మానికి కట్టు—, తన్నే దేవునిగా పూజిస్తున్న సావి( ఉత్తమురాలిని అనుమానించాడు సూర్యం! అయినా తన గనపదాటలేదు సావిత్రి—ఓహో! పసితనంలో ఇంతటి దిట్టతనం ఈపిల్ల కెలాగలిగిందో. ఈఅసిధారా వ్రతచర్య వీళ్ళకి ఉగ్గుబాలకు ముందే వచ్చిఉందేమో లేక భారతదేశ సహజప్రకృతిలోనే ఈసహజ శక్తికి ఏనాడో మహర్షుల మంత్రోచ్చాటనవల్ల మహాసాధ్వీమణుల దివ్యత్వంవల్ల బీజారోపణ గలిగిందేమో.

భానుమూర్తి చూచాయగా రెండుమూడు దఫాలు సూర్యంతో సహా ఇల్లు ఖాళీచెయ్యమని వ్యక్తంచేశాడు సావిత్రికి. ఆమెకు గూడా ఇంక మళ్ళీమళ్ళీ అతగానిచే స్పష్టంగా అనిపించుకోగూడదని పౌరుషం గలిగింది. అయితే ఏం చేస్తుంది? చేతిలో ఎర్రని ఏగాని లేదాయె. సూర్యంకు చీమ కుట్టినట్లైనా తోచదు. ఆమెకో ఉపాయం తట్టింది. సాహసించి వీర్రాజుకు ఉత్తరం వ్రాసింది. ఎంత కొద్ది మొత్తమైనా సరే పైకంమాత్రం తెమ్మని హెచ్చరించింది. సావిత్రివద్దనుండి లేఖ రావడం వీర్రాజుకు కొంచెం విపరీతంగానే తోచింది. రత్తమ్మ పెత్తనం వచ్చినప్పటినుండి సొమ్ము ఇస్తున్నాడు; పుచ్చుకుంటున్నాడు. ఎప్పుడూ శిస్తు నాగా పెట్టలేదు. ఆవిడ పోయింతర్వాత గూడా సూర్యం వ్రాసినప్పుడల్లా డబ్బు పంపుతూనే ఉండె—మరి యీయమ్మ ఉత్తరం వ్రాసిందేమా అనిపించి సందేహనివృత్తిచేసుకోవడానికి మర్నాడే బయలుదేరి పట్నం చేరుకున్నాడు వీర్రాజు.

రైలు దిగి వస్తూంటే వీర్రాజుకు క్లబ్బుకు వెళ్ళే సూర్యం దారిలో ఎదురుపడ్డాడు. "ఏమోయ్! వీర్రాజూ, ఇలా దిగేవేమిటికథ— సొమ్ముగానీ ఏమైనా జతపడిందా" అన్నాడు సూర్యం. "లేదు బాబూ! వారమేనా కాలేదు నూటయాభై పంపుకున్నాను. మళ్లీ సావిత్రమ్మ ఇలా గుత్తరం వ్రాసిందేంటీ" అన్నాడు ఆత్రుతను ప్రకటిస్తూ వీర్రాజు.

సూర్యం విస్తుపోయాడు. "ఏమిటీ? సావిత్రి ఉత్తరం వ్రాసిందా? అపుడే అంతవరకూ వచ్చిందన్నమాట! ఏమని వ్రాసింది" సూర్యం తీక్ష్ణంగా ప్రశ్నించాడు. "ఏం వ్రాస్తుంది బాబూ! సొమ్ముకు ఇరకాటంగా ఉంది. ఎంతైనా సరే తెమ్మని" వీర్రాజు జవాబిచ్చాడు. "పోనీ! ఆవిడ వ్రాసినందుకేనా తెచ్చావుగాదే—లేకపోతే తెచ్చే నా దగ్గర దాపరికం వుంచుతున్నావా" తాపీగా మళ్ళీ అడిగాడు సూర్యం. "నీతోడు లేదు బాబూ. కాపోయినా ఏడనేనా చెట్టుగానా వుండేటి బాబూ రూపాయలు దులుపుకురావడానికి. పిల్లా పీమూతో గంపెడు సంసారం—మీ రెరుగని దేముంది?" అన్న వీర్రాజును ఇంటిదారి చూపి సాగనంపి తాను క్లబ్బుకు సాగిపోయాడు సూర్యం.

వీర్రాజు గుమ్మంలో అడుగెడుతూండగానే కుంచెడు నీళ్ళకు గుమ్మరించింది సావిత్రి. వీర్రాజు చిన్నప్పటినుండి ఆమెను బాగా ఎరుగు. తన చేతుల మీదుగా ఎత్తుకుమోసిన పిల్ల ఇలా గేడుస్తూంటే చూడలేకపోయాడు. రత్తమ్మ పోయినందుకే సావిత్రి అలా కుమిలిపోతోందనుకుంటున్నాడు గాని అసలు సంగతి అతనికేం తెలుసును? "ఊరుకో తల్లీ ఊరుకో—పోయిన వాళ్లతో పోగలమా? ఏదో—ఎవరికి నూకలు చెల్లిపోతే వారు వెళ్ళిపోతారు" అంటూంటే, "ఇంక రోజు వెళ్ళే దారిలేదు వీర్రాజు తాతా" అంటూ బావురుమంది సావిత్రి. "ఏవమ్మా—నీకేం—నిక్షేపంగా నేడో రేపో సూర్యంబాబుకూ నీకూ కల్యాణం అవుతుంది. ఆయనా చదువుకున్నాడు. ఎక్కడ తల తాకట్టుపెట్టినా నెలకు వంద తెస్తాడు" అంటూంటే "ఆ దారే అధ్వాన్నమైపోతోంది తాతా" అని దుఃఖిస్తూనే సూర్యం జీవితం గూర్చి క్లుప్తంగా చెప్పింది. వింటూ వీర్రాజు విస్తుపోయాడు. "అయితే అమ్మ దినవారంఖర్చుకని నే పంపిన అయిదు వందలూ ఆరిపేశాడన్నమాట. మొన్న మళ్ళీ నూటయాభై...ఇలా తగలేస్తూంటే గనులేనా ఆగవు" అని నొచ్చుకున్నాడు. సావిత్రి కీమాటలు వింటూంటే గుండెదడ పట్టుకొంది.

వీర్రాజు కాపుగూడా ఏమీ తేలేదు. సాయంత్రానికల్లా సూర్యం ఇంటికొచ్చేశాడు. బహుశా మధ్యాహ్నం జేబులోవున్న పాతికరూపాయలూ ఆరిపోయుంటాయి — లేకుంటే రాత్రి పన్నెండింటిదాకా రానివాడు ఈవాళ ఇంత పెందరాళే వచ్చేస్తాడా అనుకొంది. పట్నంలో ఎవరో స్నేహితుణ్ణి చూచివచ్చి రాత్రి కక్కడే పడుకొని చీకటితోనే లేచి పల్లెకు పోతానని చెప్పి వీర్రాజు ఎక్కడికో వెళ్ళాడు.

సుమారు ఏడవుతుంది. వచ్చిన అర్ధగంటసేపటిలోనూ సావిత్రిగాని సూర్యంగాని ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. ఒకళ్లనొకళ్లు చూసుకోలేదు

గూడా. దీపం పెట్టడానికని సావిత్రి లోనికి వెళ్లింది. సూర్యంగూడా ఆమెను వెంబడించాడు గదిలోకి. సంజచీకటిలో అగ్గిపెట్టెకోసం గూడు తడుము తూన్న సావిత్రితో ప్రసంగం ప్రారంభించాడు. ధుమధుమలాడుతూ "ఊఁ—అయితే వీర్రాజు ఎందు కొచ్చినట్లూ! కాకపోయినా వ్యవహారం ముదురు తున్నట్లుందే". "నేనే రమ్మని వ్రాశాను. మరి మీకు వేడెక్కడం లేదు. ఎన్నాళ్లీకొంపమీదపడి తింటాం? ఏమేనా సొమ్ము జతపడితే తెమ్మని వ్రాశాను."

"ఔను—కష్టమే-ఖర్మంచాలక నేను గూడా తగులడ్డానాయె మధ్య."

"అదిగో-—అదే మళ్ళీ మాట్లాడొద్దంట."

"అహ్హా-—హ్హా! (నవ్వి) పోనీలే—ఆ గొడవెం దుకు గోజూ ఉండేదేగా—వీర్రాజు ఏమాత్రం తెచ్చాడు?"

"వొట్టిచేతుల్తో వచ్చాడు."

"ఇదిగో—అబద్ధం ఆడకు. నాకు ఇప్పుడు సొమ్ము అత్యవసరం—వెంటనే ఇవ్వు."

"మీకు అవసరంకాని దెప్పుడూ? అస్తమానమూ మనం డబ్బు తగలెయ్యడమేగా."

"అదిగో—ఆ ఊసే ఎత్తొద్దన్నాను. నువ్వే మైనా నీసొమ్ము పెడుతున్నావా. వీర్రాజిచ్చినా నాదేగదా—పోతే భానుమూర్తి ఇస్తే ఓలాగ నీకు హక్కున్నట్లు ఇంకోలాగ నాకూ హక్కుంది ఆ సొమ్ముమీద."

"మీతో మళ్ళీ చెబుతున్నా—ఆ పాపిష్ఠి కూతలే కూయొద్దని."

"నీతో ఘర్షణ అనవసరం నాకు. వెంటనే పది రూపాయ లిలా పారెయ్."

"లేవు—నాదగ్గర లేనిదే."

"నేను నమ్మను. ఎంతగా స్వతంత్రించకపోతే నీవు వాడికి ఉత్తరం వ్రాయగలవూ? ఊఁ తొందరగా తే—లేకపోతే చెయి చేసుకుని నే తీసుకోవలసి ఉంటుంది" కళ్లెర్రబడ్డాయి సూర్యా నికి. వళ్లు వణకింది సావిత్రికి—"చెయ్యి చేసు కుంటారా—నన్ను చంపెయ్యండి—నా దగ్గర ఎఱ్ఱని ఏగాని లేదు" సూర్యం అమాంతంగా సావిత్రిని రెక్క పట్టుకున్నాడు—ఆమె విదలించుకోవడానికి ప్రయత్నించింది రెండవచేత్తో. పెనగులాడ్డంలో ఆమె చేతులకున్న గాజులు పప్పు పప్పు అయిపో యాయి. పైట జారిపోయింది. కంటికీ మంటికీ ఏక ధారగా విశ్వేషం ప్రారంభించింది. సూర్యం ఇంకా గద్దిస్తూనే ఉన్నాడు. సాయంత్రం జూదపాటలో సర్వం ఒడుచుకుని పిడిచేసి వికటాట్టహాసాలతో క్లబ్బునుండి బయటకు గెంటివేయడంవల్ల క్రమ్ము కున్న మైకం పొరలు ఇంకా విచ్చిపోలేదు. సావిత్రి ఏడుస్తూనే ఆతనినుండి తప్పించుకొన ప్రయ త్నించింది.

ఇంతలో బయటనుండి వచ్చి ఎవరో సావిత్రిని సందిట పొదివిపట్టుకొని సూర్యం నుండి విడదీశారు. ముందు వీర్రాజు కాబోసు అనుకొంది. కాని కాదు. దారినబోయే వాళ్లెవరేనా ఏమో అని భ్రమించింది. "సూర్యం నీవు రోజురోజుకీ పశువైపోతున్నావు. పెళ్లికాని పిల్లపై చెయ్యిచేసుకోవడానికి నీకు పెత్తన మెవ డిచ్చాడు! ఛీ—తుచ్ఛుడా-ఫో—అవతలికి" గర్జన వెలువడ్డ కంఠం సావిత్రికి భానుమూర్తిని పరి చయం చేసింది. క్రుటిలో ఆమె ఎంతగానో కుంచిం చుకుపోయింది. క్షణంక్రితం ఆమె పొందిన తృప్తి దుఃఖంగా నయనాలనుండి పైకుబికింది. సూర్యంచేత నిందించబడుతూ హింసించబడుతూండడమే ఆమెకు భానుమూర్తిచేత ఆ అవస్థలో అలా విడదీయబడం కంటె వేయిరెట్లు ఆనందాన్ని నుమడింపచేసింది. భానుమూర్తి తన్ను పొదివిపట్టుకోవడం ఇది రెండో సారి. విధి కరాళ కాళికవలె వేయి నాలుకలు చాచి తన కుసుమకోమల జీవితాన్ని నలిపివేయ బ్రయత్ని స్తున్నట్లు తోచింది. ఏ అవస్థలోనూ తన్ను భాను మూర్తి తాకగూడదు! ఇది ఆమె వజ్రకఠోర నిశ్చయం. కాని విధి ప్రతికూలించింది. తన నిశ్చయం భగ్న మైంది. తన్ను కాపాడ్డానికే కావచ్చు ఆ నీచుడు తాకాడు. అందునా సూర్యంసమక్షంలో—తన్ను భానుమూర్తి రెండు చేతులతోనూ బంధించి విడ దీశాడు—సూర్యాన్ని తూలనాడుతున్నాడు. తనపై సూర్యానికి హక్కు లేదని ఖచ్చితం చేస్తున్నాడు. అయితే ఈతూరి ఆతని స్పర్శలో విషం లేదు—వాంఛ లేదు. కామం లేదు. కాని ఈ ఘట్టం సూర్యంలో ఎంతటి విప్లవమో తీసుకొచ్చింది. అదిగో—ఆతడు వెళవెళ మాట్లాడేస్తున్నాడు అవమానా గ్నితో దహింపబడి.

"ఔను. తల్లిలేనివాడికి, తండ్రీ దమ్మిడీ లేని వాడికి, జూదరికి, త్రాగుబోతుకి—ఇట్లాంటి శ్రీమం త్రాపకంలో ఉన్న కన్యను ముట్టడానికి హక్కెక్కడివుంది?—క్షమించండి—సావిత్రీ—భాను మూర్తీ—సర్వమూ కోలుపోయి పిచ్చివాణ్ణై మతో

న్మత్తతచే నీపై చేయిచేసుకున్నా — సావిత్రీ నీవెవరవు? నేనెవర్ని? క్షమించు—బుద్ధి వచ్చింది." అంటూ రొప్పుకుంటూ రోజుకుంటూ గుమ్మం దాటుతున్నా ఈలోగా భానుమూర్తి దీపం వెలిగించాడు.

సావిత్రి ఒక్కమారుగా దీపాన్ని చూచి మళ్ళీ కళ్ళు మూసుకుంది. ఏ పాపమూ ఎరుగకపోయినా మహా నేరం చేసిన ముద్దాయివలె కళ్ళుమూసుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ వీధివెంట బడింది. ఇదంతా అప్పుడే ఊళ్ళోంచి వస్తున్న వీర్రాజు చూశాడు. "నీకేమైనా మతిపోయిందా రావమ్మా ఆయనేవస్తాడు" అని బలవంతంగా సావిత్రిని ఇంటికి లాక్కొచ్చాడు వీర్రాజు.

సావిత్రికి రాక తప్పిందిగాదు. కాని రాత్రల్లా విపరీతమైన ఆలోచనలు ఆమెను కలచివేశాయి. తుపాను నాటి నడురేయి కడలి తరగ ఎన్నో ఊహలు ఆమెలో మౌనంగా మహా సంఘర్షణ సాగించుకున్నాయి. "వెళ్ళిపోయాడు సూర్యం. తన ఆశాజ్యోతి ఆరిపోతోంది.— మళ్ళీ రాడు. అతనికి యధార్థం ఎలా తెలుస్తుందీ? భానుమూర్తి చెప్పినా నమ్మడా సూర్యం! ఆవాళే అంతకుమించి అబల, పైసాయైనా లేని తాను ఇంకెలా మాట్లాడాలి? మాట్లాడిందే అనుకో—తన్ను చంపేసినా బావుండేది సూర్యం—విధి—శనియై కలియై తన్ను బ్రతికించి కలకాలమూ కాల్చడానికొక్కకపోతే ఆ సమయంలో భానుమూర్తి నెందుకు తీసుకురావాలీ అక్కడికి?— వస్తేమాత్రం అతగాడు అలా విడదీయనా? తీసీ— ఎంతో నిర్లక్ష్యంగా—సర్వమూ సూర్యంసొత్తేఅయి— స్వాతంత్ర్యం అనేది కన్యాత్వం అనేది ఏనాడో ఎగఊపిరి దిగఊపిరిగా కొట్టుమిట్టాడే రత్తమ్మ చేతిలోవుంచి ఆమెతోనే సాగనంపబడిందే— మఱెం కలాంటప్పుడు హక్కు లేకపోవడమేమిటే— పిచ్చిభానుమూర్తీ—సావిత్రి సర్వస్వమూ సూర్యమే అయిహూర్చుందోయి అతనిది కానిదొక్క కణమైనా ఆమెలో లేదు—తనపాపం అలా బ్రద్దలైంది. తెల్లవారుతుంది—పొద్దు ముఖంచూసే దెట్లా—రేపటినుంచి రోజు గడవడం?"

## 6

సావిత్రి బ్రతుకంతా చూసి వీర్రాజుకు ఎంతో జాలివేసింది. మరునాడు ప్రొద్దుట తనతో గ్రామానికి రమ్మన్నాడు. సూర్యం లేనిదే రానంది సావిత్రి. సూర్యంగూడా వచ్చే ఉపాయం ఆలోచిద్దామన్నాడు కాపు. వీర్రాజుకు ఇట్లాంటివాళ్ళను వశపరచుకోవడం డబ్బువల్ల కొంచెం సాధ్యమవుతుందని తెలుసు. 'అబ్బే! అది అసాధ్యం' అంటుంది సావిత్రి. 'ఏనా ప్రయత్నిద్దాం' అంటాడు వీర్రాజు. భానుమూర్తి ఇంటినేగాదు కేవలం పట్నవాసాన్నే వదలి పల్లెటూళ్ళో మకాం పెడితేనేగాని వాళ్ళ బ్రతుకు బాగుపడదని అతనివాదన. పెద్దవాడు ఎందుకు చెప్పాడో ప్రయత్నిద్దా మనుకొని బయలుదేరింది సావిత్రీ స్వస్థలానికి.

మధ్యాహ్నం రెండుగంటలకు ఊరు చేరుకున్నారు సావిత్రీ వీర్రాజూను. ఆమెకు సూర్యం లేకుండా ఆవూళ్ళో అడుగుబెట్టడమూ, రత్తమ్మ పోయినతర్వాత తొలిసారిగా రావడమూ ఏదో మహా నేరస్థురాలిగా ఇల్లు ప్రవేశించినట్లు చేశాయి. కన్నీటిధారలతో ఇంట్లో ప్రతిగదినీ త్రొక్కింది. లంకంతఇంట్లో తాను ఉండగలనా అని హడలిపోయింది. వెనకటిరోజుల్లో ఎంతో పెద్ద కుటుంబాలు మసలినచుండువాలోగిలి. ఇప్పుడు దీపంపెట్టే నాథుడు లేక పాడైపోతోంది. అంగుళన్నర ఎత్తున పట్టింది మట్టి నేలమీద. నెత్తిపైకెత్తితే తారాడే బూజులు. గబ్బిలాలు స్వైరవిహారం చేస్తున్నాయి. ఇంట్లో ఉన్న ధాన్యాదుల నెప్పటినుంచి బొక్కుతున్నాయో ఎలుకలూ, పందికొక్కులూను. రత్తమ్మ ఉంటే పెద్దపులిలా ఇల్లంతనూ పాలించేది. సావిత్రి కిప్పుడు ఏమూల కెళ్ళినా ప్రాణగొడ్డంగా ఉంది. గోడలు బీటలుదీసి బెల్లులు ఊడిపోతున్నాయి. నాటుపెంకు ఎన్నాళ్ళయిందో వేసి అడుగు వెదురుబద్దలు చివికి పెణకవంగి విరుచుకుపడుతుందా అనే భయం కలుగుతోంది. ఈ యింటిలోనా తాను భవిష్యత్తులో సూర్యంతో జీవించాలని కలలు కన్నది? మరి కలలన్నీ కల్లలై పోతున్నాయే? శిథిలమై జీర్ణమై పోయే సామ్రాజ్యరాజధానిలాగున్న ఆ గృహంలో మళ్ళీ వెలుగవలసిన దీపం సావిత్రి. బూజుపట్టి కాలగర్భంలో మఱుగుపడుతున్న, నివురు గప్పుకున్న అగ్ని పాతివ్రత్యం—దాన్ని మళ్ళీ తాను రగిలించాలి తన జీవితాన్నే చమురుగాపోసి ఆ అగ్నిని ప్రజ్వలించాలి. దీనికై తన యత్నం ఫలిస్తుందా? తాను గృహిణియై మళ్ళీ ఆ యింటినీ తన పాతివ్రత్యాన్నీ నిలబెట్టగలుగుతుందా?

నాటిరాత్రి పాడు పీడకలలెన్నో ఆమె మనసును కలచివేశాయి. ఆమె మనసులో ఎనలేని అశాంతి పొడుకొంది. భావిజీవితాన్ని గూర్చిన ఆలోచనలు

అర్థంలేని ఎన్నో సంఘర్షణల్ని ఆమెలో రగుల్కొల్పాయి. మధ్యాహ్నంనుండి రాత్రిదాకా గ్రామస్థులు జరిపిన పరామర్శలు, వారి ఓదార్పులు ఆమె దుఃఖాన్ని అధికంచేశాయి. పట్నవాసం గాదుగదా? పల్లెటూరాయె! దేనికి దానికే సుఖానికి సుఖానికే — దుఃఖానికి దుఃఖానికే ఒండొరులపట్ల తమకుగల ఆప్యాయతల పురస్కరించుకొని హావభావాల్ని ప్రకటించుకోకుండా ఉండజాలని ప్రవృత్తి వాళ్ళది.

మరునాడు వీర్రాజు ఎక్కడో తలతాకట్టు పెట్టి ముప్ఫై రూపాయలు తెచ్చి ఆమె కిచ్చాడు దానితో అసలు సంసార మనిపించమని చెబుతూ. ఒక్క హంగూ లేదాయె యింట్లో. మరి రత్నమ్మ ఉన్నన్నాళ్ళూ యీ వెలితి ఎక్కడ చచ్చిందో! డబ్బు యిచ్చి జాగ్రత్తగా ఖర్చుపెట్టమని మరీ మరీ చెప్పి వెళ్ళాడు వీర్రాజు. సావిత్రికి తన చేతిలో ముప్ఫయి రూపాయలు చూడగానే ఎంతో ఆశ జనించింది. ఆ క్షణంలో ఎన్నో ఊహలు ఆమెలో మెదిలాయి. ఏమేమో నిశ్చయించుకొంది. ఆ రూపేణా దేవుడు తనకు నడియేటబడి కొట్టుకొనే నావవంటి బ్రతుక్కి చుక్కాని చూపినట్లైంది. పెందరాళే వంట చేసేసుకుని ఇల్లు ఉన్నంతలో జాగ్రత్తగా సర్ది తాళం వేసి ఏకాఏకిని పట్నం బయలుదేరి సాయంత్రం నాలుగింటికి చేరుకుంది కారుపై.

పట్నంలో అడుగు పెడుతూనే సూర్యంకై వెదుకడం మొదలుపెట్టింది. తిన్నగా క్లబ్బుకెళ్లింది. ఎవరూ తనకు సూర్యం భోగట్టా చెప్పలేకపోయారు. బంట్రోతుమాత్రం చూచాయగా తెలియబరచాడు "ఒట్టిచేతులతో రెండుసార్లు వచ్చి అంతా నవ్వితే విసుక్కొని బిక్కమొగమేసి ఎటకో వెళ్ళాడ"ని. బహుశా డబ్బుకోసం ఎవరినో తడుముకొంటాడని అన్నాడు. అక్కడనుండి భానుమూర్తి యింటికి వెళ్ళింది. భానుమూర్తి లోపలనుండి కుర్రాడితో కబురుచేశాడు ప్రొద్దుట సూర్యం తనదగ్గరకు వచ్చాడనీ డబ్బు ఇమ్మని బ్రతిమాలాడనీ అయితే తాను ఏమీ ఇవ్వలేదనీ. ఎక్కడ ఉంటాడో తెలియలేదనీ, త్రాగుబోతుకు ఒక మకాం అంటూ ఉండదనీ చెప్పాడు. ఆమె సాహసించి లోపలికెళ్ళి దీనంగా అడిగితే, భానుమూర్తి ఇపుడు పూర్తిగా తమతో తెగతెంపులు చేసుకున్నాడు. తాను ఎదరబడితే ఒకపీడలాగుంది అతనికి. దీనికి రెండే రెండు కారణాలు. ఒకటి ఆమె అతన్ని — అతడు ఎంత బ్రతిమాలినా ఎంత ఆశపెట్టినా వినక కాదనడం; రెండవది సూర్యం మర్యాద విడిచి ప్రవర్తిస్తూ అతని డబ్బు మంచినీళ్ళలాగున వాడెయ్యడం, త్రాగుబోతై అతనికికూడా చెడ్డపేరు తెప్పించడం. సావిత్రికి ఏంచెయ్యాలో తోచలేదు. రాత్రి అవుతోంది — సూర్యాన్ని పత్తా పట్టడం ఎలాగ?

మనస్సును పరిపరివిధాల పరువు లెత్తించే ఆలోచనలతో ఊరంతా గాలిస్తోంది. పార్కులు, సినీమా హాళ్ళ ప్రాంగణాలు, రైలుస్టేషను, క్లబ్బులు, నదీతీరం — తిరుగుతోంది పిచ్చిగా వీటివద్ద. రాత్రి ఎనిమిదవుతుంది. ఒక దృశ్యాన్ని చూచి ఆమె చకిత అయ్యింది. కిళ్లీకొట్టుదగ్గర ఒకచోట ఘర్షణ జరుగుతోంది. ఎవరో తీవ్రంగా మాట్లాడుకుంటున్నారు. దూరాన్నుంచి ఆమె జాగ్రత్తగా ఆ గొడవను పరికిస్తూ ఏమిటో చూద్దామని అటు బయలుదేరింది. దాదాపు కిళ్ళీదుకాణం సమీపించేసరికి చిలికి చిలికి గాలివానైపోయింది. చేతులు చేతులు కలుసుకున్నాయి. ఖాలీసోడాబుడ్లతో, కర్రచెక్కలతో ఒకళ్ళనొకళ్లు బాదుకొంటున్నారు. అందులో ఒకరిద్దరు తప్పత్రాగి ఉన్నారు.

ఆమె సరిగా షాపువద్దకు వచ్చేసరికి జరుగవలసినదంతా జరిగిపోయింది. నలుగురూ ఆ త్రాగుబోతుల్ని చావమోది గాయపరచారు. వారిద్దరూ స్పృహతప్పి పడిపోతే ప్రక్కనున్న చెట్టువార కీడ్చేశారు. అందులో ఒకరికి కణత పగిలి నెత్తురు చారికలు కట్టింది. దుస్తులు మరకలయ్యాయి నెత్తుటితో. సావిత్రి అందరినీ తోసిచ్చి ఆ వ్యక్తిని పరీక్షగా చూసింది — "సూర్యం" అని కెవ్వున కేకబెట్టి అతని మీద పడింది. కిళ్ళీకొట్టువాడు చూసి "ఎవరమ్మా నువ్వు? ఆయన మీకేం కావాలె" అన్నాడు. "ఈయన మా బంధువు." అంటూ వెక్కి వెక్కి ఏడ్వడం మొదలుపెట్టింది. కిళ్ళీకొట్టు యజమానికి జాలివేసింది. "అయినింటివాళ్లు గదా! ఇట్లా వొళ్ళు మాసుకోకుండా మసిలితే ఎట్లాగ? పెందలకడనే ఆసుపత్రికి జేర్చండి. ప్రాణాపాయం రావచ్చు" అన్నాడు. సావిత్రి హడలిపోయింది. రిక్షాను పిలిచి దగ్గరనే ఉన్న రంగారావు డాక్టరుగారి ప్రయివేటు ఆస్పత్రికి చేరవేసింది సూర్యాన్ని.

డాక్టరు అతన్ని జాగ్రత్తగా పరీక్షించాడు. ప్రాణాపాయమైన దెబ్బే తగిలిందన్నాడు. "వెధవ త్రాగుబోతులు —" అని చీదరించుకుని కట్టుగట్టాడు. ఆ రాత్రి. మరునాటి ప్రొద్దుట సూర్యానికి విపరీతంగా జ్వరం వచ్చింది. ఉపంవల్ల మూసిన కన్ను తెరువడం లేదు. రంగారావు క్రొత్తగా ప్రాక్టీ

పెట్టిన యువకుడు. సావిత్రి స్థితి అతనికి ఎంతో జాలి గలిగించింది. సూర్యం వంటి దౌర్భాగ్యులపై ఎంతమాత్రమూ దయదలచ గూడదన్నాడు.

ఆ జర్వం అట్లానే నిలబాటు చేసిందిగాని తగ్గ లేదు. సూర్యం శరీరస్వాస్థ్యం నానాటికి బాగా తప్పిపోసాగింది. రంగారావుగారి ఆస్పత్రిలో ఉంచి మందు ఇప్పిస్తూనే ఉంది సావిత్రి. తాను తెచ్చు కున్న పైకమూ అయిపోయింది. సూర్యానికి తెరుపూ మరుపూ అవుపించడంలేదు. డాక్టరుగారు రోగం నయమవడానికి చాలా రోజులు పడుతుందనీ ప్రస్తుతానికి కనీసం రెండు వందలేనా ఉంటేగాని మనిషి మనలోకి రాడనీ నిర్ధారణచేశాడు. డబ్బు తెస్తేగాని మందిచ్చే స్థితిలో లేడు ఆయన. జాలిగా బ్రతిమిలాడుకొంది సావిత్రి. కాని సనేమిగా వీల్లే దన్నాడు రంగారావుగారు. సూర్యానికి క్రమేపీ క్షుతి మించిపోతోంది. రెండు వందలు ఆమె కెలా వస్తాయి. రోజులు గడుస్తున్నకొద్దీ రాత్రింబవళ్ళు ఆమె కిదొక సమస్యగా పరిణమించింది.

ఊహాసంఘర్షణ తెగిపోయింది. తుట్టతుదకు ఒక నాటి సాయంత్రానికి ఆమె ఒకనిశ్చయానికివచ్చింది. ఎలాగైనాసరే సూర్యాన్ని బ్రదికించుకోవడం ఆమె కర్తవ్యం. రాత్రి ఏడు గంటలౌతుంది. వొళ్ళంతా ముసుగు వేసుకున్నట్లు దుప్పటి గప్పుకుని తిన్నగా భానుమూర్తి ఇంటికి బయలుదేరింది. అతన్ని ఎలాగ ప్రాధేయపడైనా సరే డబ్బు తీసుకురావాలని ఆమె వజ్రనిశ్చయం.

హాల్లో ఒంటరిగా కూర్చుని ఏవో సుదీర్ఘంగా ఆలోచిస్తున్న భానుమూర్తి పాదాలు సావిత్రితో స్పృశింపబడేసరికి అతడు ఈ ప్రపంచంలోకి వచ్చాడు. క్షణంసేపు తన కళ్లు తానే నమ్మలేకపో యాడు—ఏమిటి! సావిత్రేనా తన్ను తాకుతా! దిగ్భ్రమతో త్రుళ్ళిపడ్డాడు—"ఆఁ—ఎలాగుందే మిటి? సూర్యానికి. నాలుగు రోజులనుండి చూడ్డానికి వద్దామనుకుంటే తీరికే లేదు" అంటూంటే పాదాలపై తడి అతని శరీరాన్ని పులకింపజేసింది. "ఏడుస్తున్నావా! సావిత్రీ! నీవే ఇంత బేలవైపోతే ఎట్లా? లే—అలా దుఃఖించకు" ఆమెను తన రెండు చేతులతోనూ లేవనెత్తి ఎదుటమంచంమీద కూర్చుంప బెట్టాడు. ఈ మాటలు ఆ పడుచుకు ఎంతో ఎత్తి పొడుపుగా తోచి వేధించుకు తినసాగాయి. అయితే ఈసారి భాను తన్ను లేవనెత్తడంలో, అతని ఈ స్పర్శలో కేవలం ఒక నూతనత్వం ఆమె గుర్తించింది, భానుమూర్తి మారిపోయాడు. ప్రపంచం నిజస్థితి తెలుసుకుని జాగ్రత్తపడుతున్నట్లున్నాడు.

"ఏం చెప్పను—నేను ఏకాకినై విధితో పోరాడు తున్నాను. ప్రపంచంలో ఎవ్వరూ సాయం చెయ్య డంలేదు. సూర్యం చావుబ్రతుకుల్లో ఉన్నాడు. నేను తమను ఒక సాయం చేయమని ప్రార్థిస్తున్నాను ఈ క్లిష్టసమయంలో" కన్నీటిధారలతో చెప్పుకుపోయే ఆమెను ఆపాడు, భానుమూర్తి "అలాగా! అంత క్షుతి మించిందన్నమాట! అవును! త్రాగుడూ, జూదం ఎంత వాణ్ణైనా ఇంతలో పీనుగును చేసేస్తాయి. ఇళ్లు వళ్లు గుల్ల చేసే పిశాచాలు. అయితే ఇంతకీ—(తటపటాయించి) నేనేం చెయ్యగలను" జాలిగొలిపేటట్లు ప్రయత్నిస్తూ అన్న ఈ పలుకులలో అతడు దేనికో సన్నద్ధుడగు తున్నట్లు పసికట్టింది సావిత్రి. కానీ దాన్ని ఎదు ర్కోవాలి దీనంగా ప్రారంభించింది "చెయ్య గలరు. మీ రొక్కరే నాకిపుడు తోడ్పడగలరు తలుచు కుంటే"

"అలాగా (నవ్వు తెచ్చుకోవడానికి ప్రయ త్నించి) అయినా ఆ సాయమేమిటో సెలవిస్తే ఈ దీనుడు"

"భానుమూర్తిగారూ! అలాటి మాటల కిది సమయంగాదు. మీ ఎదుట వొక వ్యక్తి ప్రస్తుతం వర్ణనాతీతమైనవిపత్తులోబడి గిలగిల తన్నుకుంటోంది. దాన్ని ఉద్ధరించడం సంమానవధర్మం.

"ధర్మాలుగూడా తెలిసిన మీతో ఎలా మాట్లా డాలో"

"బహువచనప్రయోగంతోనూ, ఎగతాళిగానూ నన్ను నొప్పించవద్దని ప్రార్థన"

"ప్రార్థనా—ఓహో! ఎన్నాళ్లకి దిగివచ్చారు. ఈ అపరసావిత్రిగారు! (హేళనగా) సావిత్రీ— నీవు ఎవరిప్రార్థనలేనా వింటేగదా ఒరులు నీ ప్రార్థన వింటారు—నీవు పెట్టినవాత ఈనాటికీ నెయ్యికీలలై నా మనస్సును శరీరాన్ని దహించి వేస్తోంది"

"అందుకని ఇప్పుడు ప్రతీకారం తీసుకో దల చారా? ఇది మీకు న్యాయమేనా?"

"ప్రతీకారమా — నేనేమీ తీసుకోదలచుకో లేదు. సావిత్రీ! విను. నేను ఆనాడు తుచ్ఛుడనై నీచుడనై నీయెడల అలాగ ప్రవర్తించలేదు. సూర్యంతో నా అవస్థచెప్పి అతని అంగీకారంపొంది, అతడు నీపై అంత మక్కువతో లేడని తెలుసు కొన్నాకనే—నీవు వెనకటి నీ సంచారంలో నన్ను

ఏవగించుకోకపోయినందుకే — ఒక మర్యాద గల పురుషుడుగా నిన్ను వివాహం చేసుకోదలచాను. కాని నీవో — నిర్దాక్షిణ్యంగా చేతికొచ్చిన ఫలాన్ని కాలదన్నావు. బుద్ధొచ్చింది నాకు."

"అయితే అదికూడా మీ కల్పనే అన్నమాట"

"కల్పనగాదు. ఆశఉన్న ప్రతివాడూ అన్ని దారులూ వెదుక్కుంటాడు — ఎదిరి తనను ప్రతిఘటించేవరకు ఆశిస్తూనే ఉంటాడు. ఇది ప్రపంచ ధర్మం"

"ఇపుడు నామీద దయ దలచరూ నన్ను? నాకొక రెండువందల రూపాయ లిప్పించండి. చర్మంతో చెప్పులు కుట్టియైనా మీ రుణం తీర్చుకుంటాను"

ఆమె రుద్ధకంఠంతో మాటాడింది.

"ఏమిటీ! రెండువందలా దాదాపు వెయ్యిదాకా వాళ్ళ వెన్నునపోశాను. ఇంక చూస్తూ చూస్తూ డబ్బు తగలెయ్యడానికి నేనేమీ అవివేకినిగాను — కాకున్నా ఎదుటివాళ్ళ ఎదల్లో ఆవేదన గుర్తించలేని మీవంటి విశ్వాసహీనులకు నేను ఏ సాయమూ చెయ్యను. తెసుదునమ్మ తెచ్చావుగాని- ఇంక నీవు వెళ్ళవమ్మ" కోపంగా చించుకున్నాడు గొంతు భానుమూర్తి

సావిత్రి పౌరుషంతో చివాలున లేచింది. కొద్దిక్షణాలు యోచించింది తీవ్రంగా. గుమ్మందాకా రెండడుగులు వేసింది. ఈ కొంచెం సమయంలోనూ ఎంతో సంఘర్షణ చెలరేగింది. ఆశలన్నీ ఉడిగిపోతున్నాయి. ఇంక ఒక్కటే ఆయుధం మిగిలింది. అదే వజ్రాయుధంగా తన్నింతవరకూ కాపాడుతూ వచ్చింది. దాన్నికూడా ప్రయోగించవలసి వచ్చింది — తుదకు తన ప్రాణం కన్నా కూడా మిన్నయనుకున్న దాన్నే విడిచెయ్య దలచుకుంది. ఇనంతా తన భర్తకోసం — తన నిధానం కోసం అనుకొంది. పాతివ్రత్యంకోసం ఆ పతివ్రత తన పాతివ్రత్యాన్నే బలిపెట్ట నిశ్చయించుకొంది. సావిత్రి గుండె పాషాణమైపోయింది.

కుర్చీలో కూర్చున్న భానుమూర్తి పాదాల చెంత కుప్పలా కూలబడింది. నెమ్మదిగా లేవ ప్రయత్నించి అతని రెండు చేతులూ తన కుసుమకోమల కరయుగ్మంతో స్పృశించింది. ఆ స్పర్శలో ఎంతో వ్యామోహాన్ని విద్యుత్తులాగ ప్రవహింపచేయడానికి ప్రయత్నిస్తూ లేని మందహాసం ప్రకటిస్తూ "జరిగిందేదో మరచిపో భానూ—ఇప్పుడు సావిత్రి నీ అధీన — నీవేం చెయ్యమన్నా సరే సిద్ధం — కాని నా కావలసింది డబ్బు. శంకించకు — డబ్బిచ్చేసి ఈమెను నీ వశం చేసుకో —" — ఓహో! ఎంతటి పతనావస్థ — హిమాలయ పర్వతం హిందూ మహాసముద్రంలోకి దొర్లిపడుతూంటే ఇంతటి సంఘర్షణ అవుపిస్తుందా — మరి ఈ దేశంలో పతివ్రత మనడం ఎలాగ — ఓ! అలాగే! నిక్షేపంగా బ్రతుకుతుంది. ఆమె మనడమేమిటి? జాతినే నవనవోన్మేషంతో జీవింపచేస్తుంది. ఇది తథ్యం. భారతీయ ఆదర్శమే ఇది. ఇదే లేకుంటే ధర్మమే లేదు...యుగయుగాల మన చరిత్రలో మనలను రక్షించిం దీమహాశక్తియే — ఇదే ఈనాడూ మనకూ మన స్త్రీలకూ పరమాదర్శం — దీన్ని విస్మరించిన వారికి గత్యంతరం లేదు — చూడండి—సావిత్రిని అగ్నిపరీక్షకు గురిచేసిన ఆవిధి— నిర్దయతో కఠోరంగా ఆమెను దహించిన దైవం. ఆమెను లేవనెత్తడం తనవిధిగా ఆమె సేవకై వస్తాడు — దీనుల్ని రక్షించడం ఆయన కర్తవ్యం గాదూ - హేళనతో అనండి- లేదా కోపమే అనండి- నీచత్వమే కానీండి, పోనీ దానవత్వం అందాం — ఏదైనాసరే అది భానుమూర్తి ముఖతః వచ్చింది. అతడు ఒకే ఒక వికటాట్టహాసం చేశాడు "సావిత్రీ! నీవు మహాపతివ్రతవు — నేను ధూర్తుడుగా నీచుడుగా రుజువు పరచావు — నాకా అవమానం చాలు. వెళ్ళు ఇక్కడనుంచి నీ కల్లబొల్లి కబుర్లు కట్టిపెట్టి- ఉందిగా నీ పాతివ్రత్య ఎవరిపై ఆశ బెట్టుక వారే నిన్ను రక్షిస్తారు." ఒకే ఒక త్రోపు త్రోసివేశాడు ఆమెను ఇలా గర్జిస్తూ. ఆ దూకుడుకి సావిత్రి అమాంతం గడపమీద పడిపోయింది. కణత పగిలేటంత దెబ్బతగిలి నెత్తురు నుదుటిమీదనుండి చారికలు గట్టింది. "పో అవతలకి — ఏ గాలికో ఊగు ఊగే కులటల కిక్కడ తావులేదని" తలుపు మూసేశాడు.

సావిత్రికి తగిలిన దెబ్బకన్నా భానుమూర్తి మాటలు ఆమెను ఏ నిద్రలోనుంచో హఠాత్తుగా మేలుకొలిపాయి. అతని పలుకుల్లోనే భగవానుడు తనకిచ్చిన దివ్యసందేశం ఇమిడిఉన్నదని గుర్తించింది. తన చపలత్వానికి తగినశిక్ష ఆ దెబ్బ అనే స్వీకరించింది. ఆమెలో మబ్బుతెరలు విడిపోయాయి. ఆశలన్నీ ఉడిగిపోయాయి. కేవలం దైవంమీదనే భారం వుంచి ముందుకు సాగింది. నెత్తురుమయమైన నుదుటితో ఆసుపత్రికి చేరింది. ఎలుగెత్తి పిలిచింది డాక్ట

హాలులోకి వచ్చి లైటు వేశాడు రంగారావు. ఎదుటి దృశ్యం చూసి తెల్లబోయాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ప్రుటెలో మందు తీసుకొచ్చి ఆమెకు కట్టుకట్టాడు. ఆమెను తాకడం డాక్టరుకు అదే ప్రథమం. ఆ స్పర్శలో—ఆమె దీనత్వం—ఆమె నిస్సహాయత — కుసుమకోమలత — ఆమె పరిస్థితి సావిత్రి సౌజన్యం — రంగారావు హృదయంలో ఎక్కడో ఇరుక్కుని ఇవతలికి రావడానికి ప్రయత్నించే కరుణను వెలుగులోకి లాక్కొచ్చాయి. స్వయానా తన సోదరి ఇంతటి దీనస్థితిలో ఉన్నా భావించలేనంతటి ఉత్తుంగ శిఖరాలకు అతన్ని లేవనెత్తింది ఆ కరుణ. ముంగురులు సవరించి గాయం కడిగి ఓపిగా కట్టుకట్టాడు.

క్షణంలో సావిత్రి కన్నీళ్లు అతన్ని తడిపివేశాయి—ఎండలో ఎడారి దాటివచ్చిన బాటసారి చలివేంద్రంలో కొలూనగానే పొందే సౌఖ్యం అది—నట్ట నడిసంద్రంలో చిక్కుని పోగొట్టుకొని అలల సుడుల ఒడుదుడుకుల క్రిందుమీదై తీరం జేరవేసుకొన్న నావలో నావికుడు పొందే ఆనందం అది—దేనితోనూ పోల్చలేని ఒక విచిత్రవిస్మయావస్థ ఆమెది. క్రమంగా సేదదీర్చుకుని రంగారావు గారివద్ద తన చరిత్రనంతా కన్నీటి ధారలతో వెళ్ళబోసుకుంది. ఆ పశ్చాత్తప్త హృదయగాథ డాక్టరుకుకూడా పశ్చాత్తాపం కలిగించింది. "లే సోదరీ! లే—నీవు చెల్లివే గాదు తల్లివమ్మా—నాకేగాదు లోకానికి - సావిత్రీ - నీవు సాక్షాత్తుసావిత్రి వేనమ్మా — ఇంతవనుక జరిగిన అవినయానికి మన్నించవూ" అని ఆమె చేతులు పట్టుకున్నాడు. ఆమె మొదట్లోనే అసలు సంగతి చెప్పనందుకు చింతించాడు.

తన యావచ్ఛక్తినీ ధారపోసి నెల నాళ్లకు సూర్యానికి జీవం రప్పించాడు. అక్కడనే వివాహం జరిగించడానికి సిద్ధపడ్డాడు సావిత్రికీ సూర్యానికీ— అయితే వారుమాత్రం అంగీకరించలేదు. ఆయనకు అభ్యంతరం లేకపోతే తమపల్లెకువచ్చి తమ్ము ఆశీర్వదించమన్నారు. మరి నెల్లాళ్ళకు పెళ్ళి సన్నాహాలు ప్రారంభమయ్యాయి. ఈ వివాహం హడావుడిఅంతా విర్రాజు కాపురే. పెళ్ళి శుభలేఖలు వ్రాసే ప్రసక్తి వచ్చేసరికి భానుమూర్తిని పిలవనన్నాడు సూర్యం— "ఏం—" అంది సావిత్రి—కొంచెం ఘర్షణ జరిగింది ఇద్దరికీ—

"అసలు దీనికంతకు కారకుడుగాదు సావిత్రీ! ఆ ధూర్తుడు?" సూర్యం అన్నాడు.

"ఔను—నిజంగా దీనికంతకూ అతడే కారకుడు అందుకే పిలవాలి ఆయన్ను"

"నీమీద లేనిపోని అనుమానాన్ని నాలో రేకెత్తించి నాకు నీయెడల విముఖత్వం రేకొల్పాడు. నేను నిజంగా నమ్మి నిరాశను పూరించుకొని హృదయబాధను మరలించుకొందామని అపాను త్రాగుడు అలవరచుకున్నాను. ఏం చెయ్యను! అంతకుతక్క నాకు ఇంకోదారి దొరకనిదే"

"ఐనాసరే—మనల్ని ఎన్నో విధాల ఆతను ఆదుకున్నాడు. మనను కష్టాలు పెట్టినవాళ్ళే ఒక్కొక్కప్పుడు మహాపదల్లో తమకు తెలీకుండా మనకు ఆశాకిరణాలు ప్రసారిస్తారు. ఇదే సృష్టిలో ఒక వైపరీత్యం—నేను అనుభవంవల్ల దీన్ని గుర్తించా. కాబట్టి ఆయన్ను ఆనందంతో ఆహ్వానించి గౌరవించండి"

"నీది ఎంతో లోతుగుండె. నీ ధారణశక్తి అపారం సావిత్రీ! అందుకే ఇంతటి సాగరం ఈదగలిగావు"

"దీనికి మీ ప్రేమయే చుక్కాని"

సూర్యానికీ సావిత్రికీ మహావైభవంగా స్వగ్రామంలో వివాహం జరిగింది. ఊరు అశేషజనమూ ఆనందాబ్ధిలో ఓలలాడారు. డాక్టరుగారు వచ్చి నాలుగురోజులూ ఉండి వారిఆతిథ్యం అంగీకరించారు. బంధువులంతా వచ్చారు. భానుమూర్తి రావడం సూర్యానికి పెళ్ళి సమయంలో నాటుపదహార్లు చదివించడం ఒక ప్రత్యేకతగా మెరిసింది సావిత్రి హృదిలో—సూర్యం మదిలో—ఎందుకో!

# విప్లవా[illegible]పం

రేవూరు సుబ్బరావు

గీ॥ వింధ్యభూధర పరిసరోర్వీం బ్రసిద్ధిఁ । గాంచు మాహిష్మతీపురి రాజధాని
గాఁ దనర ధారుణీవలయమ్ము నేలె । నూర్జిత బలుండు కార్తవీర్యార్జునుండు.

కం॥ పరిజన సహితుండై య । న్నరపతి యొకనాడు కాన । నమునకు మృగయా
తురతంజని కేళీగతి । నరిగెన్ జమదగ్నిమౌని । యాశ్రమమునకున్.

చం॥ పొదలెడి రాచఠీవి వెడ । పోకడలచ్చటి మౌనులందు జు
ల్కుఁదనము మోపి చూప నడ । లన్ నుడులన్ గనులం దగౌరవా
స్పద బహు సంజ్ఞలేర్పడ । నృపాలుఁ డసంగత మందహాసముల్
పొదివిన నెమ్మొగంబడరఁ । బోయి కనెన్ జమదగ్ని నచ్చటన్.

ఆ॥ వె॥ అరసి లాంఛనార్థమైన నమస్కృతి । సలుపుటయును నలరి సంయమీంద్రుఁ
డతని నుచితవిధుల నలరించి తత్పరి । జనుల నాదరించె సముచితముగ.

చం॥ మెఱుఁగులఁ గుమ్మరించు తెలి । మేను సమంచిత సాధుభావమున్
నెఱపెడి కన్నులున్ మొనలు । నీటుగఁ దేలిన కొమ్ము లున్నతిం
గొఱలిన సోయగంపుఁ బొదు । గున్ మురువుల్ ఘటియింప వచ్చె న
త్తఱి నొక పాడియావు జమ । దగ్ని కుఱంగటి కల్ల నల్లనన్.

గీ॥ తాపసేశ్వరుఁ డగ్గవి తనువుఁ గేల । నిమురుచుండగఁ గాంచి యా నృపతి దాని
నపహరించికొనుచుఁ బోవ నాత్మఁదలఁచి । పరిజనుల కవ్విధంబు నేర్పడ వచించి.

చం॥ ఒడళుల నొవ్వనోఁకుటకు । నోర్వక తాపసవృత్తిఁ దాల్చి యీ
యడవినిడాగి దుంపలును । నాకులుఁ గాయలుఁ దించుఁ గాలమున్
వెడఁగుఁ దనంబునన్ గడపు । విప్రుల కిమ్మొదవేల ? మేదినీం
ద్రుఁడనగు నేన దీనిఁ బరి । తోషమునం గొనిపోవుటొప్పగున్.

కం॥ దత్తాత్రేయ మునీశ్వర । దత్తబలైశ్వర్య ధీరతా మహితుఁడ రా
జోత్తమ పూజ్యుఁడ నే నీ । యుత్తమ ధేనువును బడయు టుచితమకా దే.

ఆ॥ వె॥ అని యుపన్యసింప, నగు నగు ననుచుఁ ద । త్పరి జనమ్ము లమ్మొదవును వేఁగ
నంటఁ గట్టి కొనుచు నరుగఁ దొడంగిన । నచటి మునులు నృపతి నరయ వచ్చి.

ఆ॥ వె॥ కాన నుండి తపము గావించికొనెడి మా । మొదవు నపహరించి హృదయముల న
శాంతి సంఘటింతె ? సార్వభౌమ ! సమస్త । ధర్మవేత్త విది యధర్మమనక.

ఆ॥ వె॥ సాధుపోషణంబు సలిపెడి నీ విట్లు । ధర్మ కర్మకుం బధంబుఁజూప
వలదు నాఁగ నోరులుఁ గలరె? జగజ్జ్యోతి । కాల్పఁదొడఁగ మాన్పఁగలడె? దిట్ట.

గీ॥ అతిథి సంతర్పణాది కార్యముల కిచటి । తాపసులకెల్ల వలయు దుగ్ధము లొసంగు
చున్న యీ ధేనువేగదా! యున్న దరయ । మాకు; కలవె తదన్యముల్ మానవేంద్ర.

మ॥ సకలైశ్వర్య నిధానమైన వసుధాచక్రంబు నీ చేతి దో
క్క కొఱంతేనియు లేదు నీకు శతసంఖ్యల్ ధేనువుల్ లెవె నీ
కకటా! నిర్దయ బుద్ధి నిమ్మొదవు నిట్లార్జింపనౌనే? నృప
ప్రకరాధీశ్వర! లోకధర్మముఁ దలంపం జాలవే నెమ్మదిన్.

చ॥ బలమును శౌర్యమున్ సిరికిఁ బ్రాపయి చెల్లుచునున్న విప్డు నీ
తలఁపును మాన్పఁజాలముగదా! ధరణీశ్వర : కాంచెదొక్కొ ని
శ్చల సుఖవృత్తి నింక విధి సల్పిన మేరకుఁ దప్పిపోవు వా
రలుఁ గలరే జగంబున బరాక్రమ మెంతటికైనఁ జాలదే.

ఆ॥ వె॥ అనిన వరుణ నేత్రుఁడగుచు నమ్మునుల న । య్యాశ్రమముఁ గలంప నాత్మభట త
తులను బంచి, మొదవుఁ దోలించికొని చనె । నర్జునుండు హితజనాళిఁ గూడి.

ఆ॥ వె॥ పతి యనుజ్ఞ దమ్ముఁబయ్యెరగితి రేఁచ । సైనికులు గడంగి సంయములఁ ద
దాశ్రమమును దుర్మదాటోప భరితులై । గాసిఁ జెందఁ జేసి రీసు వెలుఁగ.

కం॥ తరణి నభోమధ్యంబున కరుదెంచిన యపుడు కట్టియలఁగొని రాముం
డరుదెంచి కాంచె వికృతిం బొరసిన యాశ్రమము నెగులు పుట్ట మనసులోన్.

* * * *

శా॥ ఏమేమీ! భటవర్గముం గొని యతం డేతెంచెనే? తాపస
స్తోమంబున్ నిరసించి ధేనువును గొంచుం బోయెనే? యాశ్రమా
రామక్షోణిఁ గలంచి సంయములపైఁ గ్రౌర్యంబు సాఁగించి తా
రేమున్ వీరులమైతి మంచుఁ జనినారే? వేడ్కఁ దత్సేవకుల్

ఉ॥ మానస శాంతిఁ గోరి యభిమానము లౌకిక కాంక్షలందు సుం
తైనను లేమిగా బ్రతుకునట్టి తపస్వులపై దురాగ్రహం
బూని వృథా విపద్దశల నొందఁగఁ జేసిన క్రూరచిత్తుఁడ
మ్మౌనిఁ బురంబు సొచ్చి కనుమేలిఁకఁ గల్గునె? రాముఁ డుండఁగాన్

మ॥ అనుచుం దండ్రి మొగంబుఁ గాంచిన నతం డాశ్చర్య రేఖాయుతా
ననుఁడై యెద్దియుఁ బల్కకున్న మదిలో నంబొంగి రాముండు వి
ల్లును బాణమ్ములు గొడ్డలిం గొని మునుల్మత్తంబులై మూఁగి క
న్గొన నుగ్రాహవ దీక్ష నిల్లు వెడలెన్ గ్రోధాగ్ని దీప్తాస్యుఁడై.

# తలుపుదగ్గరపాటలు

# జాజఱపాటలు

"కృష్ణశ్రీ"

## తలుపుదగ్గర పాటలు

. శే. మంగు వెంకట రంగనాథరావుగారు 1905 ప్రాంతంలో ప్రచురించిన "వేడుక పెండ్లి పాటలు", చెన్నపట్నపు 'వెస్టువార్డు కంపెనీ' వారి "నూతన వేడుక పెండ్లిపాటలు" అనే పుస్తకాలు పాతపుస్తకాల అంగడిలో కొన్నాను. వాటిలో ఏడు 'తలుపుదగ్గర పాటలు' కనబడ్డాయి ఒకదానిలో "చిటపట చినుకులు దుప్పటి తడిసెను తలుపు తియ్యవే భామా! నువ్వు, తలుపుతీయవే భామా" అన్న చరణము,—ఎన్నడో నా బాల్యములో మా పక్కయింటి తాతగారు మా చెల్లెలిని హాస్యమాడుతూ పాడిన పాటలోది — కనపడింది. బాల్యస్మృతితో ఒళ్లు పులకరించింది. ఆ ఆనందానికి కారణమైన యీపాటసంగతేదో కనుక్కోవాలని కుతూహలము కలిగి పూర్తిగా చదివినాను. ఈ పాట కిటతక, కిటతక అనే నాలుగు అక్షరాల ఆవృత్తాలు పన్నెండు చేరి ఏర్పడిన పాదాలతో నడుస్తుంది. గణవిభజనకి ఇది లొంగదు. కనక పాటఅనే అనాలి. సత్యభామ వాకిట కృష్ణుడు నిలిచి తలుపు తియ్యమంటాడు. ఆమె ఖండిత నాయికఅయి "చక్కని దేహము నలుపెక్కినదేమోయి" అనీ "చిక్కని గోరులు కొనలు వంగెనేమోయి" అనీ నిలవదీస్తుంది. ఏవో కుంటి సమాధానాలు చెప్తాడు స్వామి. రెండోపాట సీతారాములకు తలుపుదగ్గర సంవాదము. అయితే సీత ఖండితనాయిక కాదు. ఆ అమ్మకు ఆ అయ్య సంగతంతా బాగా తెలుసును. కనక ఏదో వినోదానికి మాత్రమే అడ్డు ప్రశ్నలు వేస్తుంది. ఈ పాటలో చివర "ధరణిలో శ్రీహరి దాసుల బ్రోచితె" అని కనబడుతోంది. ఒక హరిదాసు సుమ్మడుపాట, ఇంకొకడు తిరుమంత్రము, మూడో ఆయన కీర్తనలతో బాలకృష్ణలీలలూ రచించారు. ఈ రచనలకు వీటిలో వీటికి శైలిలో మైత్రి కనపడలేదు. కాని ఇది పాట కనక బాలకృష్ణలీలలు రచించిన అక్కన ప్రగడ హరిదాసే ఈపాట రచించియుండవచ్చునను కున్నాను... మూడోది ఈ ధోరణిలోనే బాలకృష్ణ భామలకు సంవాదము. ఇందులోని భామ ప్రశ్నలలో గడుసుదనము పదునెక్కింది. 'చీరలు రవికెలు చిత్రపటంబులు కొని తెచ్చితినే భామా' అని స్వామి అంటే, 'చీరలు కలిగితే చెలియలవలువలు చేకొని పోదువటోయీ' అని అడుగుతుంది. 'పాముపై పవళించెడివారికి పరుపులెక్కడివి' అనీ, "అక్షయముగ గజ అశ్వములుంటే పక్షినెక్కుటేమోయీ' అనీ 'విప్రుని దోవతికొంగున యటుకులు విప్పితివటే యేమోయీ' అనీ అలరి పెడుతుంది. ఈపాటకు 'ధత్రిపురీశ' అన్న మకుటము కనబడుతోంది. "ధత్రిపురి జగన్మోహన వర నాటకసూత్రధారి" అన్న మకుటము ధత్రిపురి జావళిలకు కనపడుతోంది. ఈ రెంటి రచయితా ఒకరేనేమో!... నాలుగోది పార్వతీ పరమేశ్వర సంవాదము, ఈ వరసలోనిదే. "వర నవమణి కనకోజ్జ్వల కనకకవాటము దియ్యవెగౌరీ" అని మహోక్తిగా అడుగులువేస్తూ ప్రారంభించింది. ఇది ఎవడో ప్రౌఢకవి రచించి ఉంటా డనిపించింది. 'శిఖిలోచనము, కలపము, చిలుకవజీరు,' వంటి పదాలుకూడా 'పొన'న్నాయి ... తరవాతిది వెంకటేశ్వరులకునూ అలమేలుమంగకునూ సంవాదము. తనవంటిమీద చిన్నెలన్నిటికీ ఏవో సమాధానాలు చెప్పి, "భామరో నేనే మెరుగననుము బల్ పామునైన బట్టెనే" అనీ "అతివల నెవ్వరి కలయలేదని అగ్నినైన మింగెనే" అనీ అంటాడు స్వామి. 'వాటికంటె ప్రబుద్ధుడవు నీకు వాటివల్ల భయమేమిటి?' అని అడ్డు సవాళ్లు వేస్తుంది... ఆరోది, ఉత్సవార్థాలలో ఉన్నది. వెంకటేశ్వర అలమేలుమంగా సంవాదమే. మూడు పాదాలు నడిచిన తర్వాత నాలుగోది '(ప్రా)ణేశా— విచిత్రభవపాశా — శేషాద్రీ పురవాసా — భాళీశ వెంకటేశా—అని చతురశ్రగతిలోనే సాగిపోయింది.

పద్యార్థదరువులు యక్షగానాల్లోనూ గొల్ల కలాపాల లోనూ తరుచు కనపడతాయి. కనక ఈ తలుపుదగ్గిర పాటగాని యక్షగానాల్లో కనపడుతుందేమో నని పించింది. వెతికాను.

మనకి ఇంతవరకూ లభించిన యక్షగానాలో కందుకూరి రుద్రకవి (క్రీ. శ. 1580-1620) సుగ్రీవ విజయము కాబోలు ప్రాచీనము. శ్రీనాథాదులు "కీర్తింతు రెద్దానికీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని వ్రాసినా, వస్తురూపమైన యక్షగానము కందుకూరి రుద్రయదే ఇంతవరకూ దొరికినవాటిలో మొదటిది. దీనిలో తలుపుదగ్గర పాట లేదు. ఆశాభంగమైంది. అసలు దారే తప్పినా నేమో నని ఇటీవలి యక్షగానాలు వల్లూపుర ఉషాపరిణయమూ, గరుడాచల నాటకమూ, గౌరీశంకర విలాసమూ, భవానీశంకర విలాసమూ, ఆణ్డాళ్ చరిత్రమూ, భామకలాపమూ, రంగనాథుని పంగుణోత్తరోత్సవము, ధర్మాంగ నాటకమూ తిరగవేశాను. అన్నిటిలోనూ తలుపుదగ్గర పాటలు కనపడ్డాయి, కనక యక్షగానాల్లో తలుపుదగ్గర పాటలు వాడడము పరిపాటే నన్నమాట. ఎందుచేత? అని సందేహము ంది. పాలుట్ల లక్ష్మణకవి తన ధర్మాంగద నాటకము పూర్తి అయిపోయిన తర్వాత "స్త్రీల పాటలు" అన్న పేరుతో మంగళహారతులు, లాలిపాట, జోలపాట, తలుపుతీసే పాట, సువ్విపాట, శోభనపాట నలుగుపాట రచించాడు. అయితే స్త్రీలపాటలు ఇన్నిరకములు ఉండగా యక్షగానాల్లో తలుపుదగ్గర పాట ఒక్కటిమాత్రమే ఉంటుందా? తక్కినవో? అని సందేహము తట్టింది. మళ్ళీ చూశాను.

యాలలు, ధవళములు, మంగళహారతులు, తలుపుదగ్గర పాటలు, లాలి, జోల, పాటలన్నీ అవకాశమున్నప్పుడు యక్షగానాల్లో ప్రవేశిస్తునే ఉన్నాయి. యక్షగాన గాథలో ఏ పాటనైనా ఇరికించడానికి వీలైతే అది అక్కడ దూర్చనే దూర్చినాడు కవి! ఉషాపరిణయములో తన్ను నిరాకరించిన అనిరుద్ధుణ్ణినిందించి తలుపులు మూసుకుంటుంది ఉష. అంతసేపూ బెట్టుచూపిన అనిరుద్ధుడు మెత్తబడి తలుపు తియ్యమని బ్రతిమాలుతాడు! తలుపుదగ్గర పాట నిరికించడాని కింతకంటె వికృతమైన సన్నివేశముంటుందా? ఇదే రీతిగా స్త్రీల పాటలు లాలి, జోలవంటి పాటలు స్వామికీ అమ్మవారికీ వివాహమై సంతానము అయిన సందర్భాలలో యక్షగాన రచయిత లెందరో వాడినారు. విజయ రాఘవ నాయకుడు (1633-1673) తన విప్రనారాయణ చరిత్రములో దరువులూ, పదములూ, జతులూ మాత్రమే వాడి, ఇందాక చెప్పిన స్త్రీల పాటలను వేటినీ వాడకపోయినా తలుపుదగ్గర పాటను మట్టుకు వాడినాడు. (నాకు తెలిసినంతమట్టుకు ఇదే తలుపుదగ్గరపాటలలో ప్రాచీనము.) దరువులూ, పదములూ, సంస్కారులు తమ కాలక్షేపాలకు వాడుకు నేవి. వీటితోపాటు తలుపుదగ్గర పాటను కూడా విజయరాఘవుడు వాడినాడంటే ఆ రోజులలో ఈపాటకు చక్కని ప్రచారము ఉండినదన్నమాటే గదా? అయితే "ఈ పాటగాని అరవములోనుంచి తెలుగులోకి దిగుమతి అయినదా?" అన్న సందేహము కలిగింది. ఆనాటి ఔత్తరాహ యక్షగానము కందుకూరి రుద్రయ రచనలో తలుపుదగ్గర పాట లేకపోయె; దక్షిణదేశపు యక్షగానాలలో కనబడుతూండె. ఇటీవలనైనా ఉత్తరప్రదేశములలో బయలుదేరిన యక్షగానాలు యక్షప్రశ్నలు, నిజలింగ చిక్కయ చరిత్రము, రాములవారి యెలుక, గోకులపాటి కూర్మనాథుని మృత్యుంజయ విలాసము, రామతి వెంకటసుబ్రహ్మణ్యుని సీతా స్వయంవరము, తిరునగరి వెంకటదాసు కపిల దేవహూతి సంవాదము, వంటి యక్షగానాలలో తలుపుదగ్గరపాటలే లేకపోయె. మళ్ళీ తమిళముతో పరిచయముండిన ఈ దంబాటి శ్రీనివాచార్యులూ, రామానుజమ్మలచే రచించబడిన ఆండాళ్ చరిత్రమూ, రంగనాథుని పంగుణోత్తరోత్సవమూవంటి యక్షగానాల్లో విరివిగా కనబడుతూండె. కనుక తలుపుదగ్గర పాటలు అరవములో ప్రచారములోనుండి, విజయనగరవినాశముతో దక్షిణాదికి తరలిపోయిన యక్షగానాలలో నెమ్మదిగా ప్రవేశించి ఉండవచ్చునని అనుమానము తట్టింది. నాకు తెలిసినంతవరకూ ఈ పాటల ప్రశంస తెలుగులో రాయలనాటికి లేదు. అన్నమాచార్యులు జోల, లాలి, చందమామ, ఉయ్యాలా, శోభనము, మంగళము, జాజర, వంటి జానపద గేయఫణితులను ఎన్నిటినో తన సంకీర్తనములలో వాడినప్పటికీ, తలుపుదగ్గర పాటను రచించినట్లు కనబడదు. కాని

"లకుమమ్మ కేమైన లంచమిమ్మనవో
శుకవాణి తలుపు మూసుక తియ్యదు"

అన్న మాటలలో తలుపుదగ్గరపాట సూచన మాత్రము కనబడుతోంది. అన్నమయ్య అహోబిల

మతస్థాపకుడగు శఠకోపయతికి శిష్యుడు. అహోబిల నారసింహుడు చెంచులక్ష్మిని ఇంటికి తెచ్చినప్పుడు లక్ష్మీదేవి తలుపులుమూసి బింకము చూపిన 'గాథయే తెలుగునాటి తలుపుదగ్గర పాటకు ఆరంభమని అనుకుంటే, క్రీ. శ. 1400 నాటికి పూర్వము తెలుగు దేశములో తలుపుదగ్గర పాటలు లేవని చెప్పవలసి వస్తుంది. అరవదేశములో చోళులనాటికే తలుపుదగ్గర పాట లున్నవట.

తంజావూరును పాలించిన చోళరాజొకడు పాండ్యరాజు కుమార్తెను వివాహమాడెనట. ఆమెతో అరణముగా వచ్చిన కవికిన్నీ తంజావూరు ఆస్థాన కవికిన్నీ ఎప్పుడూ వివాదాలు జరుగుతూండేవి. అది చూచి కినిసి, రాజు 'నీ అరణపు కవి అల్లరిని చూచితివా?' అని రాణీతో అన్నట్టుగా ఆమెకు తలుపులు మూసినాడట. అప్పుడామె ఆస్థానకవిని "కవిత్వము చెప్పి తలుపులు తీయించు"మని కోరినదట. ఆయనగారి రచనను విని రాజు మరి రెండుగడియలు బిగించినాడట. అప్పుడు అరణపు కవి కవిత్వముచెప్పి తలుపులు తీయించగలిగినాడట. ఈ కథ ప్రేయసీ ప్రియుల నడుమ కలిగిన వివాదమును కాక ఒకరి కోపమునూ ఇంకొకరి అనునయమునూ ఆధారము చేసుకున్నది. ఈ రకపు గాథ చోళులనాటికి తెలుగులో లేదు. కనక తలుపుదగ్గరపాటలకు తమిళములోని ఈ "కదవు తెరక్క పాట"యే ఆధారమని చెప్పవలసి వస్తోంది.

తమిళములో యక్షగానములు లేవంటారు. తలుపు తెరిచేపాట ఈ తెలుగురచనలలో ప్రవేశించి చాలా మార్పులు చెందింది. ఈనాడు తెలుగులో తలుపుదగ్గరపాటలు చాలా కనబడుతున్నాయి. మొదట వీటిని ప్రచురించినవారు శ్రీ నందిరాజు చలపతిరావు గారు. వారు 1921 లో ప్రచురించిన స్త్రీల పాటలలో ఈరీతి సంవాదాలు నలభైయిదాకా ఉన్నాయి. ఇటీవలి యక్షగానాల్లో కూడా ఈ పాట లుంటున్నాయి. అయితే ఈపాటలు యక్షగానాలలోనుండి తర్వాత వ్యవహారములోనికి వచ్చినవని చెప్పడానికి వీలుకాదనుకుంటాను. వాడుకలోనున్న పాటల ఫణితులే యక్షగానాలలో ప్రవేశించినవి. తలుపుదగ్గర పాటలు—లక్ష్మీదేవి విష్ణుమూర్తులా, శివపార్వతులా మధ్య నడిచేవి—దేవాలయాలలో స్వామి పారువేటకి వెళ్ళి తిరిగివచ్చిన సందర్భములో భక్తుల వినోదము కోసము పాడతారు. అసలు వీటి మొదలు ఈ రీతిగానే దేవాలయాల్లో ప్రారంభమనే అనుకోవచ్చును. తర్వాత నివి యక్షగానాలలో ప్రవేశించిఉంటాయి.

వైవిధ్యము సాధించిన కవులు వీటిని మార్చుకొని కూడా రచనలు సాగించినట్లు కనబడుతుంది. స్వామినోట పద్యమూ, అమ్మవారినోట దరువూ పలికించిన పాటలూ; ఈ రెండూ చేర్చి ఇద్దరిచేతా కందార్ధ దరువులూ ఉత్పలార్ధ దరువులూ పలికించినవీ, పూర్తిగా కీర్తన రూపాన్నే వాదము సాగించినవీ, కేవలము పద్యరూపాన్నే వాదము నడిపినవీ కనబడుతున్నాయి. అసలీ పాటలకు 'చిటపట చినుకులు గుప్పటి తడిసెను' అన్న చతురశ్రగతియే సాధారణమైనా, తకిట తకిట అని త్రిశ్రగతిలోనూ, తకిట తక అని ఖండగతిలోనూ, తకిట తకతక అని మిశ్రగతిలోనూ, తకిట తకిట తక అని అష్టతానికి ఎనిమిదక్షరాలలోనూ రచించిన పాటలుకూడా విరివిగా కనబడుతున్నాయి. వీటి చివర కనబడే 'సత్యవోలు సుందరకవి వెంకటరాయుడు, నాగభూషణ, మాచెమ్మ, చామేంద్ర, వీపూరి, సోమర్తి బసవాచార్యులు, శేషాచలదాసు, ఛత్రపురీశ, సుగగిరివాస, సుబ్రహ్మణ్యదాస, వాగిరి కొండె గోపాల, యేనుగుల మహల్వాస, పాలుట్ల లక్ష్మణ, వంగల కృష్ణయ, యేలూరిదాస, రేపూడి పిచ్చయ్య, తుమ్మూరి ఆనందరావు, నాదెండ్ల రామచంద్రుడు, అద్భుతాంబిక, వెంకటదాస, పుసులూరి వెంకటసుబ్బరాయ, రావూరి శేష,' అన్న మకుటాలనుబట్టి వీటిని రచించిన కవుల పేర్లు తెలుస్తున్నాయి. ఒక పద్యకావ్యము రచించిన కవియే ఇతర పద్యకావ్యాలు రచించినట్లే స్త్రీల పాటలూ యక్షగానాలూ రచించే కవులే ఈ తలుపుదగ్గర పాటలు రచించారు. దేవాలయాల్లో ఉత్సవసమయాల్లోనే కాక, పెళ్ళిళ్ళలో వధూవరులను గుమ్మాని కటూ ఇటూ ఖణాయించి ఈ పాటలు పాడడముకూడా నేడు పరిపాటి అయినది. స్వామికీ అమ్మవారికీ పాడిన మంగళహారతులే వధూవరులకు పాడడము మామూలు కనక తలుపుదగ్గర పాటల్ని కూడా ఆరీతిగానే ఉపయోగించడము వచ్చియుంటుంది.

ఈ పాటలు పున్నాగ రాగములో ఉన్నాయి చాలామట్టుకు. నాదనామక్రియలో కూడా ఉన్నాయి కొన్ని. ఈ రెండింటికి మూర్ఛన ఒకటేగాని స్వరాలు తేడాలున్నాయి. పున్నాగవరాళివి, తోడి స్వరాలూ నాదనామక్రియవి మాయామాళవగౌళ స్వరాలున్నూ. పంతువరాళి, కేదారగౌళలోకూడా కొన్ని పాటలు ఉన్నాయికాని చాలా తక్కువ. అసలీపాటలకు గతి నిర్దేశమే గాని రాగనిర్దేశము తక్కువనుకుంటాను. మేళవీణలతో వీటిని పలికించినప్పుడు తోడికి మేళవించిన వీణతో పలికిస్తే పున్నాగవరాళిలాగా,

మాయామాళవగౌళకి మేళవించిన వీణతో పలికిస్తే నాదనామక్రియలాగా వినబడుతుంది వీటి రాగము. ఇది అత్యూహఅయితే కావచ్చునుగాని రాగనిర్దేశము లేదన్న సంగతినే చెప్పుతుంది ఈ ఊహాకూడాను.

తలుపుదగ్గర పాటలలో ముఖ్యమైన అంశము సంవాదమని పాఠకులు గుర్తించి యుంటారు. కాలక్రమాన్న ఈ పాటలలో దేవీ దేవతా అదృశ్యులై అన్నా చెల్లెళ్ళూ, ముక్తికాంతా జీవులూ, తారా చంద్రులూ, ఉషా అనిరుద్ధులూ, గురు శిష్యులూ, రాధాకృష్ణులూ, రతీ మన్మథులూ ప్రవేశించినారు. అటుతర్వాత సంవదించేవా రెవరేనా సరే వారి వాదన లీరకపు పాటలుగా కూర్చడము పరిపాటి అయినది. ఈశ్వర పార్వతీ భృంగిసంవాదము అని మిశ్రగతిలో నడిచేపాట గోర్తి రామదాసరావుది, ఈ రకమే. నరిసిపురి విశ్వనాథుని 'మేనకా పార్వతీ సంవాదము'లో పార్వతి శివునిలోపములెంచే మేనకాదేవితో అవి లోపములు కావు గుణములే అని చెపుతుంది. 'పార్వతీ లక్ష్మి సంవాదము' అందంగా ఉంటుంది: 'గౌరిదేవి నీ శంభుదేవునికి గళమున నలుపేమమ్మా' అని లక్ష్మి ఆక్షేపిస్తే 'నారీమణి నీ విష్ణుదేవుడే నలుపేగాడటె కొమ్మా' అని పార్వతి అడ్డుసవాలు వేస్తుంది. "గజ్జెలందియలు ఘల్లుఘల్లని మ్రోయ కలహంస నడకల కలికి యెక్కడికే" అన్న పాట సంభాషణ రూపములో ఉన్నది మాత్రమే అయినా సంవాదాలకోవకి చెందినదని మాత్రము చెప్పవచ్చును.

గారె బూరె సంవాదమూ, లడ్డు పకోడీ సంవాదమూ, తాటిచెట్టూ కొబ్బరిచెట్టూ సంవాదమూ ధన ధాన్య సంవాదమూ అన్నవి సంవాదాలు కావు, కయ్యములు. అవి తలుపుదగ్గర పాటలనుంచి వచ్చినవని చెప్పలేము. సుదీర్ఘమైన గంగా గౌరీ సంవాదము వాటి కన్నిటికీ మూలగేయమనాలి. సవతుల కయ్యములన్నీ ఈ కోవలోనివే.

## జాజఅ పాటలు

జాజఅలను పేరు తెలుగులో తొలిసారి పాల్కురికి సోమనాథుడు వాడి అతని కాలమునాటికి జాజఅ పాటలు వాడుకలో నుండినట్లు తెల్పినాడు. అయితే ప్రభాకర శాస్త్రిగారు అన్నమాచార్య చరిత్ర పీఠికలో చెప్పినట్లు, షోడశమాత్రలు గలిగి రెండు రెండు ప్రాసలుగల 'చర్చరి' అన్న ప్రాకృతుల పదమే 'జాజర'గా వ్యాప్తి చెందియుండునని మనము ఒప్పుకొనవచ్చును. నాచన సోమన చెప్పిన

వీణా గానము వెన్నెలతేట
రాణమీఅగా రమణుల పాట
ప్రాణమైన పిన ౹ బొహ్మణిపీట
జాణలు మెత్తురు జాజఅపాట.

కూడా పదహారు మాత్రలుగల పాదాలూ, రెండు ప్రాసలూ గలిగి పై లక్షణానికి సరిపోతోంది. అయితే ఈ పాటలోని ప్రత్యేకత, సంగీత లక్షణ గ్రంథాలు 'సా వసంతోత్సవే' అని చెప్పిన జాజఅ పాటలు పాడే సన్నివేశాన్ని 'వీణా గానమూ, వెన్నెల తేటా, రమణుల పాటా, జాణల మెప్పూ' చెప్పి చక్కగా వివరించడము అని గుర్తించుకోవాలి.

అన్నమయ్య (1424-1503) తన కాలానికి వాడుకలోనున్న ఇతర పల్లెపదాలతోపాటు జాజర పాటలను కూడా రచించి వీటి నైజమును చక్కగా వివరించినాడు. పూర్వులు హిందోళ రాగములో రచిస్తే అన్నమయ్య

"చాలుఁజాలు నీ జాజఅ, నన్ను
జాలి బఱచె నీ జాజఅ"

అన్న పదము ముఖారిలోనూ,

"జగడపుం జనవుల జాజఅ
సగినల మంచపు జాజఅ"

అన్న పదము హిందోళ వసంతములోనూ రచించినాడు. జానపదుల గేయములకు రాగనిర్దేశ ముండదు. రాగనిషేధమున్నూ ఉండదు. కనుక అభిలషితార్థ చింతామణి కాలానికి హిందోళములో నుండిన జాజఅ అన్నమయ్య నాటికి రాగము మార్చుకోవడము నేర్చినదని ఊహించవచ్చును. జాజర పాటల సందర్భము అన్నమయ్య పదాలలో చక్కగా తెలిసిపోతున్నది. "వెంకటపతిపై వెలదులు నించేరు। సంకుమదంబుల జాజర" అన్న పాదాలు జాజర అంటే (ద్రవరూపమైన) సుగంధ ద్రవ్యమని చెప్తేస్తున్నాయి. దీనిలో కస్తూరీ, పునుగూ, పచ్చకప్పురమూ మున్నగు సుగంధ ద్రవ్యాలూ చేరి ఘుమఘుమ లాడిస్తాయి. ఈ 'జాజ

రాటే'కు వీణాగానమూ, వెన్నెలతేట, రమణుల పాటా చేరి అందగిస్తాయి.

నేటికీ తెలంగాణపు పల్లెటూళ్ళలో "కాముని పున్నమపండుగ సందర్భాన...జాజఱ పాటలూ కోలాటము పాటలూ పురుషులు పాడుకుంటార"ని బి. రామరాజుగారు 'స్రవంతి' మూడవసంచికలో చెప్పుతున్నారు. వారు నేటికీ వాడుకలోనున్న రెండు జాజఱ పాటలను కూడా ఉదాహరించినారు.

'జాజిరి జాజిర జాజిరి జాజ
జాజిరాడబోతే జొన్నిత్తు దొరికె'

అన్నవి ఒకదానిలోని రెండు పంక్తులు. ఈ పంక్తులు 'కిటతక కిటతక కిటతక కిటతక' అని చతురశ్రగతిలో నడుస్తున్నాయి. మన కోలాటపు పాటలలో "గొల్లవారి వాడలకు కృష్ణమూరితీ, నీ, వేమి పనికొచ్చినావు కృష్ణమూరితీ" అని చాలామట్టుకు చతురశ్రగతిలో నే ఉంటాయి ఇంతవరకూ మనము తెలిసిన జాజఱులలో పాటప్రశంసయే గాని ఆటప్రశంస లేదు. ఇక్కడ మాత్రము "జాజిరాట" పొడచూపుతున్నది. ఈ ఆట కోలాటమని రామరాజుగారు చెప్పుతున్నారు. కోలాటపు పాటల చతురశ్రగతి వీటికుండడాన్ని బట్టి జాజరపాటలుకూడా కోలాటపు పాటలైనవని ఊహించవచ్చును. రామరాజుగారుదహరించిన రెండో జాజరపాటలో కొన్ని పంక్తులివి:

"మొగ్గగాదురో మోదుగునీడ
నీడగాదురో నిమ్మలబావి
బావిగాదురో బచ్చంతకూర
కూరగాదురో కుమ్మరిమేను"

వీటిలో రెండు ప్రాసలూ లేవు. అదిప్రాసమైనా లేదు! కాని "జాజిరి జాజిరె గాజులపాప" అని 'జాజిరి' మాటతో ప్రారంభించి, 'జాజుల్లగూడున్న సన్నపు చాప' అన్న రెండోపాదములో జాజఱ పాటలయొక్క లక్షణము పాలించి, అటు తర్వాత, పై పదాల చివ్వరిపదము 'చాప'ను పట్టి 'చాప చుట్టరే సందారికోట, కోట కోటకురెండు కొమ్మల జగ్గాల్' అని నడిచి పోతోంది. కనక ప్రక్షిప్తాలేవీ జరిగినట్టు అనుమానించ వీలులేదనుకుంటాను. ఇది జాజర పాటయే. కాని నేటిదీ! ప్రాసలూ, వసంతాలూ లోపించిపోయి కోలాటపు పాట అయి కూర్చుంది!

అదిన్నీ నాగరికత ప్రవేశించని తెలంగాణములో! చాళుక్య సీమవారము మనము నవనాగరికులము! మన వాడుకల్లో 'జాజర' పూర్తిగా దిగిపోయి దిగిపోయి, "కాళ్లాగజ్జీ కంకాళమ్మ, వేగూచుక్క వెలగామొగ్గా, మొగ్గాగాదు మోదుగునీడ, నీడాగాదూ నిమ్మలబావి, బావీగాదూ బావింటికూర, కూరాగాదూ గుమ్మడిపండు, పండూకాదూ పాపాయికాలు, కాలుతీసి గట్టునపెట్టు" అన్న పిల్లల వినోదపుపాటగా మారిపోయింది! గోపాళ్ల వసంతోత్సవపుపాట నేటికి పిల్లల ఆటపాట అయిపోయింది.



# మరల ఎండాకాలము

...ఒళ్లంతా చాలా జిగటుగాను, మలినముతోను యున్నట్లు ఉందా?










# లైఫ్‌బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల నుండి మిమ్ములను కాపాడును




ఇండియాలో తయారుచేయబడినది

L. 247-X52 TL

# * విలయం *

శ్రీ మంథా వెంకటరమణ

## రంగం: 1

నల్లటి రాత్రి: విద్యుద్దీపాల మిణుకు; నిద్రపోతున్న కాలవ; కాలవ మీద వంతెన; వంతెనమీద రోడ్డు; రోడ్డు కిరుప్రక్కలా ఇళ్లు; ఇళ్లలో నిద్రపోయే మనుష్యులు; మనుష్య చలనం లేని వీధి

ఆ శూన్యగర్భంలోనుంచీ చీకటిలోనుంచి పుట్టినట్టుగా వంతెనవైపు ఒక స్త్రీమూర్తి వస్తోంది. వెనుకనుంచి పడే వీధి దీపపు మసక వెలుగులో ఆమె నీడ తాటిచెట్టులా రోడ్డుమీద పడుతోంది. ఆమె కట్టుకున్న చీర రంగేమిటో సరిగ్గా తెలియటం లేదు కాని, ఆ వెలుగులో తెలిమబ్బులా ఉంది. జాకెట్టు నీడలలో కలిసిపోయింది.

మెల్లిగా అడుగులు వేస్తూ, చీమచిటుక్కుమంటే వెనుదిరిగి చూస్తూ నడకసాగిస్తోందామె. ఆమె ఎత్తు ఐదడుగులు ఆమె నడక కాకినడకలా వికారంగా లేదు, సొంపుగా రాయంచ నడకలానూ లేదు. సాధారణంగా నడుస్తోంది. నడుస్తూ మెల్లిగా వంతెనమీదకు వచ్చి, ఆగిపోయింది. ఆగి —నలుదిక్కులా చూసి, వంతెనకున్న ప్రక్క ఊచలు పట్టుకొని, బాగా ముందుకువంగి, క్రింద పారేకాలవలోకి తొంగిచూడసాగింది. ఇప్పుడు ఆమె జడలోని మల్లెలగుత్తి కాస్త పక్కకుపడుతూ వెన్నముద్దలా ఔపిస్తోంది.

ఆ నిశీథంలో చుంచి పరుగెత్తుకొని ఒక పురుషుడు తారా జువ్వలా ముందుకు వస్తాడు, "ఆగు! ఆగు!" అని పెద్దగొంతుతో అరుస్తూ. కొన్ని సెకండ్లలో వంతెన మీదకువచ్చి ఆమె రెండు భుజాలనూ పట్టుకుని రోడ్డుమధ్యకు లాగుతాడు.

ఆమె ఆశ్చర్యంగానూ, విసుగుతోనూ అతనికేసి చూస్తుంది...

అతడు: ఎంత దారుణం! ఎంత దారుణం!

ఆమె: (కోపంగానూ, చిరాకుగానూ) ఏవిటిదంతా?!!

అతడు: (పకపక నవ్వి) ఏమిటో తెలీదా? బ్రతుకు నీకింత చేదుగా ఉందా? చచ్చి ఏం సాధిద్దామనుకుంటున్నావ్?

ఆమె: (వింతగా) చచ్చా!! ఎవళ్లూ చచ్చేది?

అతడు: నువ్వు!

ఆమె: ఏమిటా మాటలు! నేనా?

అతడు: ఔను! నువ్వే. సమయానికి నేను రాకపోతే ఆ గంగమ్మతల్లి గర్భంలో కలిసిపోయుందువు. చూడూ... ం ఎందుకు నీకింత బరువైంది? తినడానికి తిండి, కట్టుకోనేందుకు బట్ట లేని అభాగ్యులకు కూడా బ్రతుకంటే తియ్యగా ఉంటుందే! మాటవరసకి నేను......

ఆమె: (అతని బంధాన్ని విడిపించుకుని) నువ్వేం తాగొచ్చేవేంటి?...బుర్ర పాడయిందా?

అతడు: (వెర్రివాడిలా నవ్వి) నా బుర్రా హుం!...అయితే, మరి చావడానికి కాక ఈ నిశీ

రాత్రి, ఈ నిర్జనప్రదేశంలో, పారే కాలవలోకి అలాగా తొంగిచూస్తున్నావెందుకు?

ఆమె : (కళ్లు పెద్దవిచేసిచూసి, పకపకా నవ్వుతుంది. కడుపు పట్టుకుని మరీ నవ్వుతుంది. రెండు నిముషాలవరకు ఆమెకు నవ్వాగదు)

ఓరి తెలివి!! హా...హా...హా.

అతడు : (పెదవుల క్రింద) ఆఁ! (గట్టిగా) ఏమిటామాటలు! ఆగు! నవ్వకు! నీవైఖరి చూస్తేగా...

ఆమె : (నవ్వునాపుకోవడానికి ప్రయత్నిస్తూ) ఓరి పిచ్చివాడా! అపాటి ధైర్యమే ఉంటే ఇంకేం కావాలి!

అతడు : (నివ్వెరపోయి) నువ్వు చావడానికి రాలేదూ ఇక్కడికి? అయితే మరెందుకొచ్చేవ్?

ఆమె : ఏయ్! చావూ-చావూ అని మరోసారన్నావంటే మర్యాదుండదు, చూస్కో మరి.

అతడు : (కోపంగా) అయితే మరెందుకొచ్చేవ్?

ఆమె : ఏమిటీ జబర్దస్తీ?

అతడు : ఉండు పోలీసుని పిలుస్తాను. అప్పుడు తెలిసొస్తుంది. (ఎలుగెత్తి) పోలీస్! పోలీస్!!

ఆమె : తెలుసున్లేవోయి మనకీనీ. నాకేం భయంలే. నిన్ను పుట్టించిన అసిరమ్మదగ్గరకూడా నాకు భయం లేదు.

అతడు : నువ్వబద్ధమాడినా నీనోరబద్ధమాడదు. చచ్చేదానికి ఎవరిదగ్గిరమాత్రం భయమెందుకుంటుందీ? నిజం ఒప్పుకో. ఏం? పోలీసు కప్పచెప్పేనంటే జెయిలు తప్పదు.

ఆమె : ఇంతకీ నీకెందుకూ మధ్యని ఇదీ? (శాంతంగా) ఇదుగో. ఇలా దగ్గరగా రా!

అతడు : (జంకుతూ దగ్గరగా వెళ్తాడు)

ఆమె : నిజం చెప్తే నువ్వేమన్నా సాయం చేస్తావూ?

అతడు : (ఆమెని అనుమానంగా చూస్తూ తడబడే గొంతుతో) చేతనయినంతమట్టుకు.

ఆమె : అయితే ఇలారా.

అతడు : ఇంకా ఎక్కడికి?

ఆమె : ఇలా వచ్చి ఈ వంతెనకి కులాసాగా చేరబడు!

అతడు : వంతెనకా? ఎందుకు?

ఆమె : ఊఁ! చెప్పింది చెయ్యి.

వంతెనకి చేరబడి నిల్చుంటాడు. ఆమెకూడా అతనిప్రక్కనే చేరబడుతుంది.]

అతడు : ఊఁ—ఇప్పుడు చెప్పు ఏం సాయం కావాలో?

ఆమె: (చేతులు వెనుకకి విరిచి గాలినిపీలుస్తూ) హాయ్!...ఎం...త చల్లటి...గాలి!

అతడు: గాలి? దాని సంగతి ఇప్పుడెందుకు? నీ గొడవేదో ముందు చెప్పు!

ఆమె: ప్రపంచం పడుకుని నిద్రోతోంది. ప్రాణం లేచొస్తోంది. ఓ యాబ్బో!.. ...ఎంతో ఇదిగా, దీనిగా ఉందికదూ? ఏం?

[ఇంతలో బూటు సవ్వడి దూరంగా వినవచ్చి, క్రమేపీ దగ్గరౌతుంది. ఒక పోలీసు జవాను వంతెన మీదకి వచ్చి, ఎదురుగా ఆగి, అనుమానంగా చూస్తాడిద్దరినీ.]

జవాను : (తీక్ష్ణంగా) ఇటు వైపునించే ఎవరో కేకేసేరు. మీరు కాని......?

ఆమె: మేమాఁ? ఛా ఛ! అలాటిదే ఏదో విన్నాం మేం కూడా. అపక్కనించిలా ఉంది.

జవాను : (ఇద్దర్నీ పరకాయించి చూస్తూ) మీరు...కాని...

ఆమె : (తీక్ష్ణంగా) ఈయననూ వారు. అగట్టునే మా ఇల్లు. వేడికి నిద్రపట్టక ఇలా వచ్చేం. అనుమానం తీరిపోయిందా?

జవాను : (తబ్బిబ్బు పడి) ఓ!...ఓ!... నేనశ దది...కాదు ..(వచ్చినవైపే తిరిగిపోతూ బొంగురు గొంతుతో) పాడు నౌఖరీ...అబ్బబ్బబ్బ!... (పోతాడు)

ఆమె : ఎంత చల్లటిగాలి...హాయిగా...

అతడు : (కరకుగా) చాలు. ఆపు. బోధపడింది నీవాలకం! (కొంచెం ఊరుకొని) ఈపాటిదానికేనా ప్రాణాలు తీసేవ్!

ఆమె : (వెకిలిగానవ్వి) ఎవర్తన్నా పడి చచ్చిపోతూ ఉంటే రక్షించి కీర్తి సంపాదిద్దామనుకున్నావా ఏం?

అతడు : ఛీ! ఛీ! అలాటి కీర్తిమీద నాకాశే లేదు!

ఆమె : పోనీ! ఆమె మనస్సును లాగుదామని-ఏం?

అతడు : అదంతకంటే వద్దు!

ఆమె: (మరింత దగ్గరిగా జరిగి) మనలో మన మాట. నీకు పెళ్లయిందా.

అతడు: ఛస్! ఆ బంధంకూడానా? అయినా– అదంతా నీకెందుకు?

ఆమె: సరే. ఆ సంగతంతా తరవాత కాని... (జాకెట్టుకున్న చిన్న జేబులోనుంచి ఒక పెట్టె తీసి, అది తెరిచి, సిగరెట్టు నోట పెట్టుకుని) ఇలా అగ్గిపెట్టె అందుకో.

అతడు: (ఆమెను ఏహ్యభావంతో చూస్తూ) ఊఁ...ఎంత గాబరా ఎత్తించేవ్ !

ఆమె: (వినిపించుకోకుండా) ఇలా అగ్గిపెట్టె అందుకో.

అతడు. అగ్గిపెట్టె కూడానా? నాలుగోజులై బీడీ ముక్కకే మొహం వాచిచస్తే. నువ్వే నయం నాకన్న! ఏదీ ఓ సిగరెట్టిలా పారెయ్. నీకు పుణ్యముంటుంది.

ఆమె. నీకిస్తే మహాపాపం కూడాను!

అతడు: పాపమా!!!

ఆమె: కాదూ మరీ? అన్యాయంగా ఓ ఆప మనిషిని పోలీసుల కప్పచెప్దామనుకున్నావే!

అతడు: ఓస్! దానికేనా మహా! పొరపాట్లు జరుగుతూఉంటాయ్. నువ్వెవరో అనుకున్నాను!

ఆమె: మొగుడు పెట్టేబాధలు పడలేక పారిపోయి వచ్చిన ఓ పెద్ద డబ్బున్నదాని ననుకున్నావ్ కామోసు పాపం!

అతడు: ఛఛ్ఛా!...అదికాదు...ఎవరో ఒక...

ఆమె: ఉన్నమాటంటే ఎవరూ ఒప్పుగోరు. చాల్లే ఊరుకో ఇంక!

[ఒక సిగరెట్టు అందిస్తుంది]

అతడు: నువ్వెవరైతే నేంకాని. రక్షించేవనుకో. నీకు కోటినమస్కారాలు!

ఆమె: నే నెవరైందీ నీ కక్కర్లేకపోయిందీ. ఈ మొగాళ్లెంత నీచులు!

అతడు: అదికాదమ్మో! నువ్వెవరో నాకు తెలీకపోతేగా?

ఆమె: నా పేరో?

అతడు: పేర్లేం శాశ్వతంలే! పేరుల్లో ఏముంది. మనుష్యులు ప్రధానం కాని...ఇంతకీ మననిద్దర్నీ ఎవడు రక్షిస్తాడిప్పుడు! ఒక్క దమ్ము లాగకపోతే ప్రాణం పోతుంది!

[నీరసంగా వంతెన కడ్డీలమీద చెయ్యి రాస్తాడు—మళ్ళా బూట్ల చప్పుడు. ఇందాకటి జవాను మళ్ళా వంతెనమీదకి వచ్చి వారిని లెక్క చెయ్యనట్టు పోబోతాడు. ఆమె సిగరెట్టు దాచేస్తుంది.]

ఇదిగో మిష్టర్!

[జవాను ఆగి విసుగ్గా చూస్తాడు]

అగ్గిపెట్టుందా? నెఫవ తొందర, మతిమరుపోటి మధ్య ఎక్కువైపోయింది—

[జవాను గొణిగి, చిరాకుగా జేబులోనుంచి అగ్గిపెట్టె తీసి ఇస్తాడు. అతను సిగరెట్టు ముట్టిస్తాడు అగ్గిపుల్ల గీసి. అగ్గిపుల్ల కాంతిలో అందరి ముఖాలూ కొన్ని సెకండ్లు కానొస్తాయి. జవాను ముసలివాడైనా దృఢకాయుడు. 'అతని'కి పాతికేళ్ళకన్నా ఎక్కువ వయస్సుండదు. ముఖం నీరసంగా ఉన్నా కళ్లు చురుగ్గా ఉన్నాయి. 'ఆమె'కి ఇరవై యేళ్ళుండొచ్చు. యౌవనమనే కొండశిఖరాన్ని ఈ వయస్సులో అధిష్ఠించవలసి ఉన్నా, ఆమె అధిష్ఠించి, రెండుమూడడుగులు క్రిందికి దిగిందప్పుడే. అతను అగ్గిపెట్టె ఇచ్చేస్తాడు. ఆమె నిరాశగా చూస్తూ ఉంటుంది అతని పెదవుల మధ్య దివ్యంగా వెలిగే సిగరెట్టు వేపు]

వెతుకుతున్న మనిషి దొరికేడా?

జవాను: (అగ్గిపెట్టె జేబులో ఉంచుకొని) నిప్పుతో వేషాలేసేవెవడో! ఎంతదూరం పోగలడు! ఈ మీసాలమీద నిమ్మపళ్లు నిలబెట్టేం! హు! (పోడి దగ్గు దగ్గుతాడు)

అతడు: థాంక్స్!

జవాను: దేనికి?

అతడు: మీ అగ్గిపెట్టెకి.

జవాను: (అనుమానంగా చూసి దగ్గుతూ, మధ్యని సణుగుకుంటూ పోతాడు) పాడు నౌకరీ... ఆఖరికి...(గొంతు మరి వినిపించదు)

ఆమె: (నిట్టూర్పు వదిలి) శని వదిలింది, అబ్బ! ఎప్పుడు పోతాడా రామా అని ఊపిరి బిగపట్టుకు నిల్చున్నాను.

అతడు: దేవుడులా వచ్చేడు. లేకపోతే దమ్ములేక చద్దుం! ఈరాత్రప్పుడు ఎవడు తీసును నీకు దుకాణం?

ఆమె: ఏదీ ఇలా ఇయ్యి సిగరెట్టు. (తన సిగరెట్టు చేతివెనుకనుంచితీసి పెదవులమధ్య ఉంచుకుంటుంది)

అతడు: ఇప్పుడే ముట్టించేనా, ఒక దమ్ములాగనీ మరి. (పూర్తిగా ఒక పీల్పు పీల్చి పొగ గుండెలో ఉంచుకుంటాడు)

ఆమె: హ్హాఁ—(అతని పెదవులమధ్యనున్న సిగరెట్టులాగి, తన సిగరెట్టు ముట్టించుకొని పొగ లాగుతుంది) ప్రాణాలు లేచొస్తున్నాయి! హా...య్!

[సిగరెట్లు కాలుస్తూ ఇద్దరూ కొద్ది క్షణాలు మౌనం.]

ఇప్పుడు చెప్పు—నీ పేరు?

అతడు: (నిర్లక్ష్యంగా) నీ పేరు నేనడిగేనా?

ఆమె: నీకక్కర్లేకపోయింది. నాకు కావాలి. చెప్పు. ఊఁ!

అతడు: పేరెందుక్కాని, మనఇద్దరికీ బంధుత్వముందిసుమా!

ఆమె: (గిరుక్కున తిరిగి) ఉంది, ఉంది, తప్పకుండా. ఇందాక జవాఁనుయుందే స్థిరపడింది. హాహాహా!!

అతడు: అవి పచ్చి అబద్ధాలు. మాట అనీగానే అయిపోలేదు! అదికాదు కాని, మరోవిధంగా ఉంది.

ఆమె: ప్రేమించే నంటావేవిఁటి కొంపతీ

అతడు: ఛీ!

ఆమె: ఏం? నీ కళ్ళకంత కనికిష్టంగా కనిపిస్తున్నానా? (సిగరెట్టు పొగ అతని కళ్ళమీదకు వదులుతుంది)

అతడు: ఒకటం  ఒక టర్ధంచేసుకుంటావ్ కదా!

[ఇద్దరూ మౌనం]

నేనొక చిత్రకారుణ్ణి!

ఆమె: ఏవిఁటి?

అతడు: చిత్రకారుణ్ణి. నేనీ ప్రపంచంలో ఎవర్నన్నా, దేన్నన్నా ప్రేమిస్తున్నానూ అంటే ఆ కళనే. దానికి బానిసగా ఉండికూడా ప్రేమిస్తాను. దానికి వస్నెలుతెచ్చి, అందులో ఆనందం అనుభవిస్తాను. అందుకే నిద్రాహారాలు లేకుండా పాటుపడతాను. అది నా  ం!

ఆమె: అలా చెప్పవేం మరి? బొమ్మలు రాసేవాడివా నువ్వు!

చిత్రకారుడు: ఏం? అంత చులకనగా అనేశావా మాట?

ఆమె: బొమ్మలగురించి మాట్లాడేవాళ్ళనీ, అవి అమ్ముకు బ్రతికేవాళ్ళనీ చాలామందిని చూసేన్లే!

చిత్ర: అయితే ఇంకేం. తెల్సిందా సంబంధం?

ఆమె: చూడగా వెర్రివాడిలా ఉన్నావ్! సంబంధమేవిఁటి? ఎవరిదారి వారిది.

చిత్ర: నువ్వే వెర్రిదాన్లా ఉన్నావ్. మా చిత్రాలకి దోహదమిచ్చే జీవం అంతా మీలో ఉంది. ఒక్కొక్క కంటికి ఒక్కొక్క రకంగా వొప్పిస్తుందా అందం. దాని ప్రతిబింబాన్ని జీవితానికి సాన్నిహ్యమైనంత దగ్గరగా సృష్టించడానికి ప్రయత్నిస్తాం.

ఆమె: మాలో ఉంటే నీకేం మన్య!

చిత్ర: బొమ్మలు రాసేవాళ్ళు తెలుసనన్నావ్. ఎప్పుడూ 'మోడల్'గా ఉపయోగించుకో లేదూ నిన్ను?

ఆమె: (వింతగా చూస్తూ) అంటే?

చిత్ర: నిన్ను నిలబెట్టి నీబొమ్మ రాయలేదూ?

ఆమె: అలాటిదెప్పుడూ లేదే. వాళ్ళకేం పట్టింది నా బొమ్మ రాయటానికి.

చిత్ర: నీ నగ్న సౌందర్యాన్ని చిత్రించటానికి ఏ చిత్రకారుడూ ప్రయత్నించలేదూ?

ఆమె: (ఘుపుక్కున ఉమ్మి) ఛీ! థూ! ఎంత సిగ్గు లేకుండా!

చిత్ర: అదీ కళ! కళాదేవిని ఆరాధించడానికి సిగ్గేవిఁటి?

ఆమె: మీ కళాదేవికి అంతకన్నా సిగ్గులేదు! అదే కనిపిస్తే, దాని మొగంమీద ఘుపుక్కున ఉమ్మ్రుతాను!

చిత్ర: అలా నువ్వెప్పుడూ చెయ్యలేవ్! ఆవిడ మనకు కనుపించదు. ఆవిడ మనకి డబ్బు, అంతకన్నా ఎప్పుడూ ఉండిపోయే కీర్తి, ఆ రెండూ ఇస్తుంది. నీకు డబ్బు కావాలా?

ఆమె: నీకక్కర్లేదూ?

చిత్ర: ఆవిడ కటాక్షం లేకే నాలుగు రోజులై పస్తుంపడం!

ఆమె: ఓరి నీ ఇల్లు తగలడ! నువ్వెక్కడి చిత్రకారుడువి దాపరించేవ్!

చిత్ర: నువ్వు, చూడగా డబ్బూ, దస్కం జాగ్రత పెట్టినట్టుంది!

ఆమె: సరిసరి. బాగా సరిపోయింది. ఇలా కాళ్లు అరిగేటట్టు తిరిగి తిరిగి ఇలా ఈ కాలువలోకి

చూడ్డం ఎందుకో చెప్పవోయ్ మరి? నీకన్న కొంచం నయమేలే! సిగరెట్లున్నాయి. ఓరూపాయిపై చిలుకుంది!

చిత్ర: భోంచేసేవా?

ఆమె: పైగా ఇదొకటా — ఆకో జింకో రాలేదు మీ అందరి దయవల్లా!

చిత్ర: మనిషివి బావున్నావుకదా. మాటలు కొంచం సున్నితమైనవి ఆడరాదూ? ఎంతైనా బావుంటుంది!

ఆమె: నువ్వేం నన్ను పొగడక్కర్లేదు, బుద్ధి చెప్పక్కర్లేదు. నోరు మూసుకో!

చిత్ర: అబ్బా! ఒకటంటే ఒకటి! అవును కానీ... నిజంగా చెప్పు? కాలవలోకి ఎందుకు చూసేవ్?

ఆమె: ఇంకా నీకదే ఆలోచనా? నేనేం చావడానికి రాలేదు. అంత ధైర్యముంటే ఇంకేం కావాలి. నిక్షేపంలా ఉన్నా!

చిత్ర: పోనీ, ఆ ఉద్దేశంతో నేనా ఒచ్చేవ్?

ఆమె: అందరికీ అన్ని ఉద్దేశాలూ ఉంటాయి అవన్నీ ఫలిస్తాయా? అదృష్టం ఉండొద్దూ?

చిత్ర: చావడమూ ఒక అదృష్టమే!?

ఆమె: చద్దామనుకొని చావలేకపోవడం దురదృష్టం అవునా కాదా?

చిత్ర: చద్దామనుకుంటే నిక్షేపంగా చచ్చిపోవచ్చు! దానికింకా ఏం అడ్డుంది?

ఆమె: ఆగాగు! అక్కడే ఉంది. చూసేవా, ఇలా వచ్చి ఈ కాలువలోకి బాగా తొంగిచూస్తాను. అందులో బుర్ర పాడుచేసుకోకుండా నిద్రపోవొచ్చునుకుంటాను. అనుకోగానే ఆవేశం కొస్తా చప్పారుపుంటుంది. అంతే.

చిత్ర: ఇంతకీ నీ కెందుకీ మన స్సన్నది బాగా లేదని? నీతోటివాళ్లంతా నిక్షేపంలా ఉంటారే మరి?

ఆమె: నేనూ నిక్షేపంలా ఉంటాను. కాని...

చిత్ర: డబ్బా?

ఆమె: కొంతవరకు అది కారణం. కాని, అసలు అప్పుడప్పుడు మనస్సులో ఏదోలా అనిపించి ఏడుపొస్తుంది!

చిత్ర: నీకు డబ్బంటే అదంతా పోతుంది. ఏదీ! సిగరెట్టయిపోవస్తోంది. మరోటియ్యి! నీ మేలు మరిచిపోను.

ఆమె: (నిరసనగా నవ్వి) ఒక్కటే ఉంది ముక్కలు చేసుకుందాం? (సిగరెట్టు తీసి, రెండు ముక్కలు చేసి, తనొక టుంచుకొని, అతని కొకటిస్తుంది.)

చిత్ర: (ఆఖరిదశలో వున్న సిగరెట్టుతో ఈ ముక్కని ముట్టించి) అయితే మరి, నువ్వు మొదలుగా నిలబడిలేదన్నమాట.

ఆమె: ఛీ! థూ! అనాటంటే నే నిక్కడ్నించి పోతాను.

చిత్ర: డబ్బు మస్తుగా దొరుకుతుంది. చూస్తో మరి. కష్టం సున్నా! ఎలా నిలబెడితే, అలా నుంచోడమే.

ఆమె: అంతేనా?

చిత్ర: మరి, అప్పుడప్పుడు నగ్నంగా కూడా...

ఆమె: ఛీ! ఛీ!

చిత్ర: ఇంతకీ ఇది నాపనా, నీపనా, ఆ దేవి సేవ? నీ బొమ్మ రాస్తానంతే. రంగు రంగులతో. అది అమ్మితే ఎంత డబ్బొస్తుందో తెల్సా. బాగా ఉండాలి కాని!

ఆమె: ఆ మాట మరి ఎత్తకు. అందరు నన్ను చూస్తారు. ఛీ! ఎంత సిగ్గుమాలిన పని.

చిత్ర: పొరపాటు పడుతున్నావ్! నిన్నెవ్వడూ చూడడే అమ్మీ! వారంతా చూసేది చిత్రంలోవుండే రంగుల్ని! జీవాన్ని! చిత్రకారుడి ప్రతిభని! నిన్నెవడు చూస్తాడందులో? నువ్వొక్కర్తెవీ అందులో కనిపిస్తే గొప్పేమిటి? అందులో నీ నైజం ఉంటుంది. నీలాంటివాళ్లు వేలకి వేలు అందులో కళ్లకి కడతారు. ఆ చిత్తరువు చూసేవాడికి, తను ఎరిగున్న నీలాటిది అందులో అగుపిస్తుంది. అంతా చిత్రకారుడి ప్రతిభ!

ఆమె: అదేమిటి బాబూ ఆ గొడవ!

చిత్ర: జాగ్రత్తగా కూర్చొని వింటే తెలుస్తుంది.

ఆమె: సరి సరి! నా కెక్కడ తీరుబాటు. అయితే మరి...అందులో సిగ్గుపడడాని కేమీ లేదంటావ్!

చిత్ర: అప్పుడే వెయ్యిసార్లనుంటాను.

ఆమె: అయితే చెప్పు! ఎంతిస్తానంటావ్!

చిత్ర: (వెలవెలబోయి) హతోస్మి!!

ఆమె: అకేమిటి! అలా అయిపోయేవ్! ఏం? నువ్వు చిత్రకారుడువి కాదూ?

చిత్ర: (నీరసంగా) ఎందుక్కాను!

ఆమె: మరేం? నీకు మోజు లక్కర్లేదూ? చూడూ—అరగంటే అయినా నీతో నాకు చనువెక్కువైంది. నువ్వే నా బొమ్మేస్తే జంకుండదు. మొదటసారికదూ.

చిత్ర: (వెర్రిగా, ఆ మసక వెలుగులో ఆమె ముఖాన్ని చూసేందుకు ప్రయత్నిస్తూ) నువ్వు తెలిసే నన్నడుగుతున్నావ్ కదూ?

ఆమె: (వింతగా) అంటే?!

చిత్ర: ఒక సిగరెట్టుముక్క నాకిప్పుడెవరిచ్చేరు?

ఆమె: (పకపకనవ్వి) ఓసి! దీనికేనా మహా! నీకు డబ్బు మరెప్పుడూ రాదూ? నువ్వు రాసిన బొమ్మలు ఎవరూ కొనరూ? బాగా రాయాలి కాని—అప్పుడే ఇద్దువుగాని—

చిత్ర: నిజంగా!!!

ఆమె: ముష్టివాడితో నాకెందుకూ పరాచికాలు!

చిత్ర: నీమేలు మరిచిపోలేను! (తడబడుతూ) ఏదీ—నీచేతులు ముద్దు పెట్టుకోనీ.

ఆమె: చాల్లేవోయి. దూరంగా ఉండు!

చిత్ర: అదికాదు. అదికాదు. (ఆమె చేతులు ముద్దు పెట్టుకుని) ఇంక ఫరవాలేదు ఈ ప్రపంచంలో కొత్తకళ ప్రవేశపెడతాను. కళాదేవికి కొత్తవంపులు చేకూరుస్తాను. ఆవిడ కళ్లకి కాటుక పెడతాను. ఇంక నాకు తిండి, నిద్ర అక్కర్లేదు. ఇదిగో నీ కేన్వాసులకి వచ్చినడబ్బంతా నీదే. నాకు కావల్సింది డబ్బు కాదు!

ఆమె: అయిందా లెక్చరు! ఇంకపద—నీఇల్లు చూడనీ!

చిత్ర: నా స్టూడియో చూడ్డానికి అంతసొంపుగా ఉండకపోవచ్చు! కాని అందులోనుంచి ఇకముందు ప్రపంచాన్ని ముంచెత్తే చిత్తరువులు బయల్దేర్తాయి!

[ఇద్దరూ నడుస్తూ ఉంటారు]

ఆమె: అయితే నేనే మొదటి మోడలా నీకు?

చిత్ర: (మెల్లిగా) కాదు.

ఆమె: మరి ఇంత ఉద్రేకం ఎందుకు?

చిత్ర: తరవాత చెప్తా. ముందు నా స్టూడియో, ఇల్లు, ప్రపంచం, సరస్వం అయిన కళాకేంద్రానికి పద!

ఆమె: ఎంతదూరం?

చిత్ర: ఇక్క  నీకింక బాధఉండదు. ఇక్కడా అక్కడా తిరగక్కర్లేదు. నిన్న నొక చిన్న బొమ్మ అమ్ముడుపోతే దాంతో రంగులు మాత్రం కొనేసేను. వారంరోజుల్లో నీ కాన్వాసులు అయిపోయేయంటే. నెలాఖరున 'ఎగ్జిబిషన్.' అందులో అమ్ముడుపోతే డబ్బు!

ఆమె: (కొద్దిపాటి విశ్వాసంతో) ఊఁ...

[ఇద్దరూ ఎటునుండొచ్చారో అటుపోతారు. పోయి చీకట్లో కల్సిపోతారు—విద్యుద్దీపాల మిణుకు—నల్లటి రాత్రి—నిద్రపోతున్న కాలవ—కాలవ మీద వంతెన మిగులుతవి.]

## రంగం: 2

గది—పదిహేనడుగుల పొడవు, పది అడుగుల వెడల్పు; సిమ్మెంటూ డొచ్చిన గచ్చు; నల్లటి గోడలు; చూరునుంచి గదిలో పడే సూర్యకిరణాలు. తూరుపువైపు తలుపులు లేని కిటికీ.

స్టూడియో—గది ఈశాన్యదిక్కున ఒక మూల 'ఈజిలు' దానిక్ సగం పూర్తయిన కాన్వాసు; కాన్వాసులో ఒకమూల ముక్కొక చోట, కాళ్లొక చోట, కళ్ళు పాదాలక్రింద, మొండెం చేతులకు వ్రేలాడుతూ ఒక బొమ్మ.

మరొక మూల: కూలిపోతున్న కట్టడం, దానిక్రింద నలిగిపోతున్న గ్లోబు.

ఇంకొక మూల: ఒగర్చుకుంటూ పోయే మనిషిని తరుముతూ తోకలేని ఎలుక.

ఆ కాన్వాసింకా పూర్తి కాలేదు. ద్వారాని కెదురుగావున్న గోడకి, 'రెంబ్రాంట్'; 'వాన్‌గో'ల చిత్రాలు 'ఆయిల్సు'లో - గోడకి మరేమీ చిత్తరువులు లేవు. ఒకమూల కుక్కిమంచం. దాని

మీద పొడుపడ్డ పీచుపరుపు. దుప్పటి లేనే లేదు. మంచం క్రింద పూర్తయిన కాన్వాసులు కొన్ని. మంచంముందు చిన్న స్టూలు మీద 'బ్రష్‌లు', రంగులు. గదంతా చిందర వందరగా పారవేయబడిన రేఖాచిత్రాలు డ్రాయింగులు, పాతబ్రష్‌లు; రంగు ముద్దలతోవున్న పింగాణీముక్కల మాట వేరే చెప్పనక్కర్లేదు.

'ఆమె' ఇకనుండి 'మోడలు'; ఒక చెయ్యిలేని కుర్చీలో కూర్చుంది. చిత్రకారుడు గదిలో లేడు. ఆమె, ఎదురుగావున్న పూర్తికాని కాన్వాసును చూస్తోంది.

చిత్రకారుడు పెద్దగ్లాసునిండా కాఫీతో వీధిలోనుంచి వస్తాడు. వచ్చి స్టూలుమీది బ్రష్‌లు క్రిందికి తోసి కాఫీ గ్లాసునిమీదుంచి, జేబునుంచొక చవకరకం సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె, ఒక పావలా కాసు తీసి దానిమీద పడేస్తాడు.

చిత్ర: కాఫీ తాగుదాం?

మోడలు: ఉండు. ఆబొమ్మచూడనీ. (కాన్వాసుని చూస్తూ, మెల్లగా) నాకు నిజంగా భయమేస్తోంది!

చిత్ర: భయమా! నేనుండగా నీకేం భయం?

మోడలు: నీదగ్గరే!

చిత్ర: ఆఁ!!

మోడలు: నిన్ను చూసే! చూడగా నువ్వు పిచ్చివాడివేమో ననిపిస్తోంది!

చిత్ర: ఇదప్పుడే నాలుగోసారి నువ్వనడం. ఇంకోసారంటే నేనొప్పుగోను.

మోడలు: నువ్వొప్పుగోపోతే నాకేం మన్న! ఆ బొమ్మే చెప్తోంది. నేనిక్కడ నుండను. దాన్ని చూస్తే నువ్వంటే భయంపుట్టుకొస్తోంది. నీకు నిజంగా పిచ్చిలావుంది.

చిత్ర: ఇదిగో.

మోడలు: (లేస్తూ) ఆ సిగరెట్లు, కాఫీ ఆ డబ్బులూ ఉంచుకోబాబూ కావలిస్తే. నేనేం ముట్టుకోను. నన్ను పోనీ!

చిత్ర: ఇదిగో. అస్తమానం హాస్యమేనా? నా బొమ్మ నెవ్వరన్నా హాస్యమాడితే నాకు [illegible]

[illegible] అదే పిచ్చి! నేను పోతున్నా (వీధిలోకి పోబోతుంది)

చిత్ర: (ఆమె భుజం పట్టుక ఆపి) ఇదిగో! నువ్వు నిజంగా అంటున్నావా ఈ మాటలు?

మోడలు: కాకపోతే? నే నెప్పున్నా అబద్ధమాడేనా? నన్నొదులు.

చిత్ర: రెండు నిమిషాలు నా మాటలు వింటావా?

మోడలు: నేను వినను. నన్నొదులు! నేను పోతాను.

చిత్ర: వినేదాకా కదలనివ్వను.

మోడలు: ఏమిటీ జబర్దస్తీ! పోలీసుని కేకేస్తాను. ఓ పిచ్చివాడు, నిస్సహాయురాల్ని బలవంతం చేస్తున్నాడని.

చిత్ర: (కోపం అణచుకుని, ముఖంమీద చిరునవ్వుతో) కాస్త సున్నితంగా మాట్లాడు, నీ గడ్డం పట్టుకుంటాను. అటు చూడు! కాఫీ చల్లారిపోతోంది. సిగరెట్లు చూడు! నీకోసం కళ్ళుకాయలుగా ఎదురుచూస్తున్నాయి. కొంచం కాఫీ చప్పరించి, ఒక్క సిగరెట్టు కాల్చి వెళ్ళిపో. ఏం?

మోడలు: (స్టూలుమీది వస్తువులని అనుమానంగా చూస్తూ) నీ వాలకం చూస్తే ఎవరన్నా బెదిరి పారిపోతారు—కాఫీ తాగేసిపోతాను ఎందుకన్నా మంచిది. సాయంత్రంవరకూ పూచీ ఉండదు! (కుర్చీ వైపు మెల్లిగావెళ్ళి అందులో కూర్చుంటుంది)

చిత్ర: అదీ! అలా మాటవినాలి మరి. నీ కెవడిదగ్గరా భయంలేదన్నావుగా నిన్న రాత్రి?

మోడలు: అప్పటి సంగతి వేరు. ఆ నిమిషం, ఆ వేశంలో ఎవరిదగ్గరా భయముండదు.

చిత్ర: ఇప్పుడులేదూ ఆ వేశం?

మోడలు: అప్పుడు బ్రతకడం అంటే భయం. ఇప్పుడు చావంటే అసహ్యం!

చిత్ర: అబ్బో! చాలాచాలా ఆలోచిస్తూ ఉంటావే నువ్వు!

[మూలనుంచొక గ్లాసు తీసుకవచ్చి అందులో కాఫీ పోస్తాడు]

మోడలు: మామూలుదాన్ననుకున్నావేం వేషం, చూపులు మినహా బుర్ర లేదనుకున్నావ్! పొరపాటు పడ్డావ్!

చిత్ర: (కాఫీఇస్తూ) ఆలోచిస్తావ్ కదా మరి నువ్వు—అయితే కాస్త నే చెప్పేదికూడా ఆలోచించు. అప్పుడు నీకు బుర్ర ఉందని ఒప్పుకుంటాను.

మోడలు: సిగరెట్టో టిలా ఇయ్యి.

[అతను మారుమాట లేకుండా సిగరెట్టు ఆమెనొకటికందించి, తనొకటి పెదవులమధ్య పెట్టుకొని, ఆమె సిగరెట్టు, తరువాత తనది ముట్టిస్తాడు ఇద్దరూ పొగలాగి వదుల్తారు]

హమ్మయ్యా! (చేతులెత్తి, బొరవిరిచి) హా...య్! ఏమన్నా తిన్నావా లేదా? ఆ డబ్బు లెందుకు మిగిల్చేవ్?

చిత్ర: అవే మిగిలేయి.

మోడలు: నాలుగురోజులై తిండిలేదో అని ఏడవకపోతే ఏదన్నా మేసి రారాదూ?

చిత్ర: అబ్బబ్బ! ఏంమాటలు. కాస్త సున్నితంగా అందూ అనేదేదో. నా తిండిగొడవ నీకెందుకు?...నిజానికి...ఒక సంగతి చెప్పనా?

మోడలు: నీగొడవ నాకెందుకులే.

చిత్ర: ఒకటంటే ఒకటి. (రహస్యంగా) ఒక బొమ్మ మొదలెట్టేనంటే నేను తిండి తినను.

మోడలు: (నిర్లక్ష్యంగా) అలావా?

చిత్ర: ఏం? నీకాశ్చర్యంగాలేదూ?

మోడలు: ఎందుకు?

చిత్ర: అహం. ఎందుకూ లేదులే అసలు సంగతేమంటే—గోడకున్న ఆబొమ్మ చూసేవా?

మోడలు: అదేనా?—ఆ బజ్జిబజ్జీల మొహం అదీనూ?

చిత్ర: ఆయనే నా గురువు. వాంగో! కళకి జీవాన్నర్పించిన మహత్తర పురుషుడు.

మోడలు: నాకివేం తలకెక్కవ్ రామా అంటె ఎందుకీ గోల! నీ గురు వెవడైతే నాకెందుకు?

చిత్ర: చెప్పేది కొంచం వినూ. ఆయన ఇంకా పైకిరాని రోజుల్లో, ఒక స్నేహితుడు ఆయనకొక గొప్ప ఉపదేశం చేశాడు. తిండి లేకుండా ఎంత మాడితే అంత బాగా బొమ్మలు రాస్తావ్ అని.

మోడలు: పస్తులుండి, నువ్వూ పేరు కొట్టేద్దామనే! ఎవరన్నా వింటే నీమీద ఉమ్మేస్తారు.

చిత్ర: మాటమాటకీ నన్నెందుకిలా అవమాన రుస్తావ్?

మోడలు: ఉన్నమాటంటే అవమానమే! కాకపోతే ఆ బొమ్మేమిటి? అక్కడో కాలు, ఇక్కడో ముక్కు, కాళ్లకింద కళ్ళు. నన్ను కూడా ఇలానే రాస్తావా? ఇక అంతకూ కొన్నట్టే!

చిత్ర: నీకు అర్ధంకాదు! అది మోడలు చూసి రాసిన బొమ్మకాదు. అది ఒక మహత్తర కళాఖండం కాబోతుంది. దాన్నుంచే నా పేరు బయటికి రావాలి. కాని...లోకం అర్ధం చేసుకోదు!

మోడలు: నా మొహంలా ఉంది. నిన్నూ నీ బొమ్మల్నీ కాలవలో దొర్లించకపోతే నన్నడుగు!

చిత్ర: ఇదిగో!

మోడలు: మా అందరిదీ తప్పుకూడానూ పైగా–అది బాగుళ్ళేంటే!

చిత్ర: నువ్వన్నను, నా చిత్రాల విలువ నాకు తెలుసు (క్షణం మౌనం)

దాని పేరు 'విలయం' ప్రపంచాన్ని గుప్పిట ఇముడ్చుకున్న మానవుడు ఆ తోక లేని ఎలుకని చూసి భయపడి ఎలా పారిపోతున్నాడో చూడు. ఆ కాలం వస్తుంది. ఆ మనిషి ముఖం రంగు చూడు. అది కొత్త పద్ధతి.

మోడలు: కాళ్ళక్రింద కళ్ళు ఆ ముక్కూ, ముక్కముక్కల ఒళ్లుసంగతి?

చిత్ర: అందులో బ్రహ్మాండమైన అర్థముంది. నీకు బోధపడదు.

మోడలు: అసలు నీకే తెలీదు. (పకపక నవ్వుతుంది)

చిత్ర: (ఆమె వేపు అనుమానంగా చూసి) ఔను! నిజమే! నాకూ తెలీదు సరిగ్గా అంత నిజాన్ని నేనూ సులువుగా గ్రహించలేను. నాకూ సమయం పడుతుంది నే నర్థంచేసుకోలేని శక్తేదో నాలో ఇమిడి ఉండి ఆ చిత్తరువును రూపొందిస్తోంది నేనుత్త కీలుబొమ్మనా శక్తికి! కాని ఆ చిత్తరువులోని అర్థాన్ని తెలుసుకునే మహాజ్ఞానులున్నారు. నేను నిమిత్తమాత్రుణ్ణి ఒకటిమాత్రం నాకు తెలుసు. దాని విలువ!

మోడలు: (కాఫీగ్లాసు క్రింద నుంచి వేస్తూ) అయితే అదెవరన్నా కొంటారంటావా?

చిత్ర: (ఆలోచనగా) ఇప్పుడు కాకపోతే దాని విలువ నేను బూడిదలో కలిసిన కొన్ని ఏళ్ళ తరువాత తెలుస్తుంది. నా చిత్రాలు గొప్పవాళ్ళ ఇళ్ళలో ఉండకపోయినా, అమూల్యమైన వాటినిగా మ్యూజియములలో ఉంచుకుంటారు.

మోడలు: బొమ్మలు గీసే ప్రతివాడూ నీలా నే లొట్టలేస్తూ ఉంటాడు. నువ్వు చచ్చేక జరిగేది చూస్తావా ఏం? బ్రతికున్నప్పుడే డబ్బు కాని, నువ్వు నే కీర్తి కాని సంపాదించుకోవాలి.

చిత్ర: (గోడమన్న తన గురువు బొమ్మని చూస్తాడు)

మోడలు: (నేలమీద కూర్చొని, మంచం క్రింది కాన్వాసులన్నీ, డ్రాయింగులన్నీ బయటకు లాగుతుంది. లాగి, ఒక్కొక్కటే తిరగ వేస్తుంది) అమ్మో! పాము!!

చిత్ర: (ఉలిక్కి పడి) ఎక్కడ! (ఆమె వేపు చూసి) ఓహో...అవన్నీ ఎందుకు తీసేవ్?

మోడల్: చూద్దామని. ఈ పాముకేం గతి పట్టింది! ఇంత పెద్ద బుర్ర!! తోకే లేదు!

చిత్ర: చెప్పేనుకదూ. నీకర్థం కాదు. నేను బోధపరచ లేను.

మోడలు: (ఒక్కొక్క చిత్తరువే తిరగేస్తూ మధ్యమధ్యని) ఈ చేప కెంతకన్నో!.....ఛీ! ఎంత సిగ్గు లేదు! బట్టల్లేకుండా.....(తల ఎత్తి అతడిని చూస్తూ) నన్నూ ఇలా నే! (తిరిగి, బొమ్మని తీక్ష్ణంగా చూస్తూ) ఆఖరికి బాగా నే గీసేవ్.....ఎలా ఉందో! అంత అందంగా కూడా లేదు.....కాని ఎందుకో చూడాలనిపిస్తోంది...(మరొక బొమ్మ తిరగేసి కళ్ళు కప్పుకుని) ఛీ! ఛీ! మొగాడు...ఛీ!!

చిత్ర: (నవ్వుతూ) నిన్ను చూడమన్నానా ఆ బొమ్మలన్నీ?

మోడలు: (కళ్ళు మూసుకొనే వాటిని మంచం క్రిందకి నెట్టి) మీరంతా నిజంగా మనుష్యులేనా. మీకు సిగ్గూ లజ్జా ఉండవ్? (లేస్తుంది)

చిత్ర: మేం బానిసలం.

మోడలు: అదనపం ఒకటి నేర్చుకున్నావ్ నువ్వు వెలగబెడుతున్న కళకి!

చిత్ర: (మౌనం)

మోడలు: ఏమయితేనాకేం మధ్య. మాటిచ్చేను కాబట్టి...నా బొమ్మ లెప్పుడు మొదలు?

చిత్ర: ఇవాళే!

మోడలు: 'విలయాన్ని' ఏంచేస్తావ్?

చిత్ర: అదింత వేగం పూర్తి కాదు. దాన్ని ప్రక్కకుంచేస్తాను. నా జీవితంలో ఎప్పుడన్నా పూర్తి చేసుకోవచ్చు దాన్ని. ముందు నీ బొమ్మలు రాసి, వాటికి చావులేకుండా చేస్తాను.

మోడలు: వెర్రివెర్రి గారాస్తే నేనొప్పుగోను. అవి అమ్ముడుపోవాలి. డబ్బు బాగా రావాలి. అది జ్ఞాపకముంచుకో—ఇంకోమాట. నా మొహం గుర్తు పట్టేలా దాన్లో రాస్తే ఒప్పుకోను.

[కుర్చీలో కూర్చుంటుంది]

చిత్ర: (ఆమె కుర్చీ చేతిమీద కూర్చొని ఆమె భుజాలమీద చెయ్యివేసి) చెప్పేనుగా. అందులో నువ్వు ఫలానా అని తెలీదు. కళతోలూకు ఓనమాలైనా ఎవరికన్నా తెలుస్తే ఇలా నిమిషాలమీద కొని పట్టుకుపోతారు చిరకాలం అవి ఉత్తమ కళాఖండాలుగా ఉండిపోతాయి. ఆ డబ్బంతా నీదే.

మోడలు: (ఆశగా అతని కళ్ళలోకి చూస్తూ) మన ఇద్దరిదీనీ!

[అతని చెయ్యి తన చేతులలోకి తీసుకుంటుందామె. ఆమె తల నిమురుతాడు అతడు.]

## రంగం: 3

గది—ఏమీ మార్పు లేదు.

స్టూడియో—పూర్తి అయిన స్త్రీ నగ్న చిత్రం 'ఈజిలు'మీద ఉంది. క్రింద గోడ కాన్ని వివిధభంగిమలలో అలాంటి చిత్రాలు మూడుంటాయి.

గదంతా మహాభారత యుద్ధరంగంలా ఉంది యుద్ధంలో విజయం సాధించినవి ఆ చిత్తరువులన్నీ.

చిత్రకారుడు నేలమీద కూర్చుని, గోడకి చేరబడి ఉన్నాడు. అతని కన్నులు లోతులకు దించుకుపోయి గడియో నిమిషమో బ్రతికే మనిషలా ఉన్నాడు.

వీధిలోనుంచి, గబగబ ప్రవేశిస్తుంది 'మోడల్'.

మోడలు : (జాకెట్టు జేబులోనుంచి ఒక నోటు తీసి చిత్రకారుడి ముఖంమ్మీద విసిరి, కుర్చీలో ఉస్సురని కూలబడుతుంది. చెమట ధారలుకట్టి ఆమె ముఖంనుంచి కారుతూఉంటుంది; అలసట)

చిత్ర : (మెరుస్తున్న కళ్లతో నోటు అందుకుని లేచి ఆమెను సమీపించి, కుర్చీచేతిమీద కూర్చుంటాడు. జంకుతూ ఆమె తల నిమురుతాడు.)

[ఇద్దరూ క్షణం మౌనం.]

చిత్ర: (జంకుతో) ఎక్కడిది!

మోడల్: (చీదరింపుతో అతన్ని చూస్తుంది)

చిత్ర: (చిన్నబోయి ముఖం దించుకుంటాడు)

మోడలు: యముణ్ణడిగి పట్టుకొచ్చేను. వాటికి కర్రబద్దలన్నా కొట్టించి తగలెట్టు, ఆదివారం నాటికి.

చిత్ర: (మెల్లిగా) ఔను. నిన్ను బాధపెడుతున్నాను. నీకు డబ్బివ్వడం పోగా...

మోడలు: చాలు అధికప్రసంగం...ఇంక నీపని చూడు, అబ్బబ్బ! ప్రాణాలెగిరిపోతున్నాయి.

చిత్ర: (లేస్తూ) కాఫీ, ఫలహారం తేనా?

మోడలు: నాకోసం ఏం తగలెయ్య ఉన్నది ఈ కాస్తా ఊడ్చుకపోతే మరెవ్వరికొల్లూ పట్టుకోలేను! వాటికి కర్రబద్దలు చుట్టూ కొట్టించి, ఆదివారం ఎగ్జిబిషన్‌కి తయారుచేసేవంటే నాకు కాఫీ తెచ్చినంత ఫలం.

చిత్ర: నీకు కోపంగా ఉందికదూ?

మోడలు: అబద్ధమెందుకు? ఉంది.

చిత్ర: నా ః ప్పా!

మోడలు: ఔను! నీదే తప్పు! నేనేం కాదన్లేనే! కొండంతలేసి ఆశలు పెట్టేవ్. లెక్కపెట్టలేనంత డబ్బొచ్చేస్తుందన్నావ్.

చిత్ర: వస్తుంది. తప్పకుండా వస్తుంది. కొన్ని వేలన్నా. ఆదివారంవరకూ ఓపికపట్టు. తయారైన చిత్తరువులు చూడు! నేనే వాటిని సృష్టించేనా అని ఆశ్చర్యం వేస్తుంది. కాదు. నేనుకాదు! నేను రాయలేదు వాటిని! (ఆవేశంతో) నేను నిమిత్త మాత్రుణ్ణి! నాలోని శక్తి ఆపని చేస్తోంది. నాకు తెలీదు ఆ శక్తి యొక్క ప్రభావం! దాని గమ్యం! దానికి లొంగి దాని ఆజ్ఞల్ని పాలించడమే నాపని!

మోడలు : మాటలు కొంచం తగ్గించు. వారం రోజులైంది. సరిగా తిండా నిద్రా! నిల్చొని నిల్చొని చట్టలు సడలిపోయేయి. నీశక్తి తెలిసొచ్చింది బాబూ! ఇంక చాలు! మరి నాబొమ్మలు నువ్వు వెయ్యక్కర్లే!

చిత్ర: నిజమే! మరి వెయ్యక్కరేదు! చెప్పవల్సిందేదో ఆ నాలుగు చిత్రాలల్లోనూ చెప్పి వేశాను. వాటిల్లో నీ స్వభావాన్ని చూడు.

మోడలు: ఎవడి బొమ్మల్ని వాడు పొగుడుకోడం మామూలే.

చిత్ర: నాలోని చిత్రకారుడు సృష్టించిన చిత్రాలని, పై వ్యక్తిగా నేను విమర్శిస్తున్నాను. అదేం ఆత్మస్తుతి కాదే?

మోడలు: (లేచి తువ్వాలుతో ముఖం ఒత్తుకుంటూ) సిగరెట్టుందా?

చిత్ర: ఇదే ఆఖరుది. (జేబులోనుంచి సిగరెట్టు తీస్తూ) అలసిపోయి ఒస్తావని జాగర్తగా నీకోసం ఉంచేను. (సిగరెట్టు ఆప్యాయంగా ఆమె పెదవులకందించి అగ్గిపెట్టె తీస్తాడు)

మోడల్ : ఉండు! ఆగు! (సిగరెట్టు మధ్యకి విరుస్తుంది)

చిత్ర: ఒద్దొద్దు. నువ్వు కాల్చు! నువ్వు కాల్చు! నిన్నిప్పటికే శ్రమపెట్టేను.

మోడలు: ఛప్!

[ఇద్దరూ సిగరెట్టు వెలిగిస్తారు; ఆమె ఛాతీ ముందుకి విరిచి చేతులు మీదకెత్తి పొగ వదుల్తూ)

హా...య్! అబ్బ! ప్రాణం కుదుటబడుతోంది.

చిత్ర: (బెదురుగా) చిన్నమాట అడుగుతాను కోపం రాదుకదూ?

మోడల్ : ఆపెబ్బుగురించేనా...నీకనుమానం...

చిత్ర: అనుమానం కాదు...అహఁ...ఒక వేళ.

మోడల్: నీకిచ్చినమాట తప్పలేదులే. ఒక స్నేహితురాల్ని ముష్టెత్తేను. తప్పినా నాదేం తప్పుకాదు. ఆదివారం ఎబ్బు రాకపోతే తప్పకుండా తప్పాలి.

చిత్ర : నేనంత స్వార్థపరుణ్ణి కానులే. ఈ ఆదివారం వరకే. ఎగ్జిబిషన్‌లో బొమ్మలు పెట్టడానికి అనుజ్ఞ ఒకటి వచ్చేస్తే.

మోడలు : రాకపోతే అంతా నీళ్లధారేనా!

చిత్ర : ముందుగా అంతా ఆలోచించే ఉంచేను. రాకపోతే 'గ్యాలరీ' గేటుముందు బోలెడు స్థలం.

మోడలు : బైట వీధిలోనా!

చిత్ర: అదే మరీ మంచిది. ఎగ్జిబిషన్‌కి వచ్చే వాళ్లు, ముందు నా బొమ్మలు చూశాకే లోపలికి వెళ్తారు...అది కాకుండా, టిక్కెట్ లేకుండా అందరూ చూస్తారు. సామాన్యప్రజ!

మోడలు: సామాన్యప్రజ! ఏం అభిమానం. వాళ్ళెవ్వరూ నీ బొమ్మలు కొనేద.

చిత్ర: కొనేది గ్యాలరీకి వచ్చే లక్షాధికారులు. కాని నిజంగా వాటిలోని విలువని గుర్తించేది సామాన్యులు.

మోడలు: సామాన్యులకి విలువ తెలీదన్నావ్. అర్థమవన్నావ్.

చిత్ర: అర్థం తెలియకపోయినా, వాళ్ళ మనస్సుకొక విధమైన ఆనందం కలుగుతుంది. అది చాలు!

మోడలు: (కుక్కిమంచంమీదనుంచి లేగిలబడుతూ) ఏవో ఆశలు! అలానే తెల్లవారుతున్నాయి నా రోజులు!

చిత్ర: (ఆమె దగ్గరగా కూర్చొని ఆమె తల నిమురుతూ) నిజం చెప్పాలంటే, బొమ్మలు డబ్బుకివ్వడం నా కిష్టంలేదు. వాటి విలువని డబ్బు కొలవలేదు. కాని రంగులెలా ఒస్తాయి. దినం ఎలా గడుస్తుంది. పోనీ...అవి ఎక్కడో ఒకచోట ఉండడం కావాలి...

మోడలు: (కళ్ళు మూసుకుని) అవి అమ్ముడుపోతే నీకీ చికాకులుండవ్.

చిత్ర: మనకి!—డబ్బంతా నీది.

మోడల్: మనది!

చిత్ర: మంచి ఇల్లు అద్దెకి తీసుకుంటాను.

మోడల్: అందులో కొత్త బల్లలు, కుర్చీలు వేసుకుంటే బావుంటుంది!

చిత్ర: పువ్వులు నీకు!

మోడలు: కిటికీలకి కర్టెన్‌లు.

చిత్ర: నీకు కావల్సినన్ని మంచి సిగరెట్లు.

మోడల్: (మగతగా) అన్నట్టు సిగరెట్లు! ఔను! ఎంత బావుంటుంది.

చిత్ర: అప్పుడు మరీ మంచి బొమ్మలు రాయొచ్చు.

మోడల్: (నిద్ర పోతూ పోతూ) ఊఁ...

చిత్ర: చిత్రలేఖనంలో ఒక విప్లవం తేవచ్చు.

మోడల్: ఊఁ...

చిత్ర: ప్రపంచం తన ఆఖరురోజునే వాటిని ...మరుస్తుంది...

['మోడలు' నిద్రపోయింది. చి కిటికీగుండా చూస్తూ ఉంటాడు.]

## రంగం: 4

సాయంసమయం—సూర్యుడు పడమటి సముద్రాన మునుగుతూ మునుగుతూ ఉన్నాడు.

నేషనల్ ఆర్ట్ గ్యాలరీ—దానిముందు 'గేటు'—'గేటు'ముందు విశాలమైన ఖాళీ జాగా—

గేటు కుడివైపు జాగాలో కొన్ని వరసల కారులు నిలిపి వున్నాయి. ఉన్నవాటిలో కొన్ని అరుచుకుంటూ పోతున్నాయి. క్రొత్తవివచ్చి నిలబడుతున్నాయి, వాటి జాగాలో—

ఎడమవైపు జాగాలో - దూరంనుంచి చూస్తే ఒక మూక కనబడుతుంది. మూకలో కనీసం ఏభైమంది ఉండవచ్చు. కారులలోనుంచి దిగిన వివిధరకాలవ్యక్తులు, అనగా యువకులు, యువతులు, మధ్యవయస్కులు, వృద్ధులు ఆ మూకవైపే వెళ్ళి అందులో ఏకమై, కొంచెంసేపు వుండి తిరిగి గ్యాలరీలోకి పోతున్నారు. అక్కడ 'అమ్మకానికి' అని తలకాయలంతేసి అక్షరాలతో ఒక పెద్ద అట్టవుంది—అమ్మబడే వేమిటో నని ప్రక్కకిచూస్తే, ఎడంగా, పాతబడి రెండు కొయ్యలు, వాటిని కలుపుతూ గజం ఎత్తున ఒక వెదురుకర్ర, వాటికి ఆనుకొని ఎనిమిది 'కాన్వాసులు' కానొస్తాయి. అచిత్తరువులవెనుక నిల్చు

న్నాడు చిత్రకారుడు, చేతులు కట్టుకొని. అతనికళ్లు అడకువగా ఉన్నాయి. అవి, ఒక నిమిషం ఆక్రలవైపు, ఒకనిముషం మూక వైపూ చూస్తూన్నాయి. అతనిముఖం "ఏం చెయ్యడమా ఇంక" అన్నట్టుంది.

ఒక అరఫర్లాంగుదూరాన జనసమ్మర్ద మైనవీధి. 'పేవ్ మెంట్లమీద వస్తువు లమ్ము కొనే కుర్రాళ్ల కేకలు ఇక్కడికి వినిపిస్తు న్నాయి.

స్థూలకాయుడైన ఒక తెల్లదొరని, ఒక ఇరవైమంది ముష్టికుర్రాళ్ల మూక, కేక లేస్తూ వెంబడిస్తున్నారు. వీళ్ల బారినుండి తప్పించుకొనేందు కతను పెద్దపెద్ద అంగలేసు కుంటూపోతున్నాడు, 'పేవ్ మెంటు'మీద. ఆ దొరబట్టలుకూడా పట్టుక లాగుతున్నా రా కుర్రాళ్లు.

ఇక, చిత్రకారునివద్దనున్న మూకలో:

ఒకఅమ్మాయి: ఏంబొమ్మలు! ఛీ! సిగ్గు, అసహ్యం పుట్టుకొస్తున్నాయి!

స్నేహితురాలు: అయినా ఏదో ఆకర్షణ ఉంది కదూ వాటిలో?

అమ్మాయి: ఆ విచ్చలవిడితనమా? సిగెయ్యటం లేనీకూ—పద, పోదాం.

స్నేహి: అయితే వాటి సెంగు కలా చూస్తావ్ పోదాం, పోదామంటూ—అంతఓర్చలేకపోతే చూసీ చూడగానే ముఖం కప్పుకొని పరుగెత్తుకుపోరాదూ?

అమ్మాయి: నువ్వ పొరపాటున స్త్రీవైపుట్టేవ్. అట్టే మాటాడకపద!

స్నేహి: పద! నేనొద్దన్నానా?

అమ్మాయి: (బొమ్మల్ని కడసారిగా చూసి) ఏవిఁటో ఇంతమంది మూగేరుకదా అని వచ్చేం. లేక పోతే ఈపాడు...అందుకే లోపల పెట్టనివ్వలేదేమో!

[స్నేహితురాలి చెయ్యి పట్టుకొని నవ్వాపు కుంటూ పోతుందమ్మాయి]

[కారు దిగి మీసాలు మెలివేస్తూ అప్పుడే వచ్చిన ఆసామి :]

ఎవ్వరా సేరండయ్యా యివి?

చిత్ర : (ముందుకు వచ్చి) నే నేనండి!

ఆసామి : లోపల పెట్టలేదేం?

చిత్ర : అది నా దురదృష్టం.

ఆసామి : అమ్మకానికా?

[అట్టని సూచిస్తాడు చిత్రకారుడు]

ఓహో! ఔనౌను! ఎంతేవిఁటి ఒక్కొటి?

చిత్ర : అవి కళాఖండాలు. వాటికి నిర్ణయించి ఒక ధర లేదు. మీరొక మొత్తం చెప్తే, దాని కిష్టముంటే నేనొప్పుకుంటాను.

ఆసామి : అబ్బే! ఇప్పుడు కొండానికి కాదులెండి. సంగతేవిటో కనుక్కుందామని.

చిత్ర : (నిరుత్సాహంగా చిత్తరువులని చూస్తాడు)

ఆసామి : ఆడబొమ్మ లేమో 'రష్ను'గా ఉన్నాయ్. రంగులు పేడపేడగా ఉన్నా ఆడ బొమ్మలు కావటంచేత, బలే చలాకీగా ఉన్నాయ్!

గిరజాల యువకు డొకడు : (చవకరకం చలవ జోడు వేళ్ళతో ఆడిస్తూ) ఏమండీ? ఆ స్త్రానికి తలకి తగ్గట్టుగా ఒళ్లు లేదే. తల చిన్నదేమో అని పిస్తోంది. కాళ్ళంత పొడుగ్గా ఉన్నాయేం?

చిత్ర : నే నందులో చిత్రించింది, స్త్రం యొక్క నైజం.

యువకుడు : భలే! భలే! అదేమిటో కాస్త సెలవిస్తారా?

చిత్ర : (ఉత్సాహం ఎగతాళితో తగ్గిపోయినా తప్పనిసరై) అంటే - మాటవరసకి దాని తల చిన్నది కాబట్టి అది మన అజ్ఞల్ని పాలిస్తోంది. అంత ఒళ్ళు, దాని పెద్దచట్టలు శక్తిని, దాని పొడుగాటి కాళ్లు వేగాన్ని సూచిస్తాయి.

ఒక పెద్దమనిషి: ఎంత వ్యాఖ్యానం! ఎంత వ్యాఖ్యానం! అయ్యో నాబుర్ర తిగలడ! ఇంత అర్థముందన్నమాట ఇందులో.

అతని ప్రక్కాయన: ఇవన్నీ మీరు ప్రతి ఒక్కడికీ ఎంతకని చెప్తూఉంటారు? అంతకన్న ఆ ముక్కలు నాలుగూ ఏవో వాటికింద రాసిపెట్టేస్తే బాగుండి పోదూ?

చిత్ర: (చిన్నబోయి) మీ కందులో సుద్రాని కుండవల్సిన అందం ఉండేదు. దాని ఊహా, శక్తి, వేగం చిత్రించేను.

యువకుడు: నాకు సుద్రంలానే కనిపించటం లేదబ్బా! అదేదో కడుపులోంచి వెలపరం పుట్టుకొస్తోంది. రంగులుకూడా అలికేసినట్టు కళ్ళకి తెలీకుండా ఉన్నాయి.

చిత్ర: రంగులే స్వభావాన్ని వ్యక్తపరుస్తాయి. చిత్రకళ పరివర్తన పొందుతోంది.

యువకుడు: మనుష్యులలోకూడా పరివర్తన కలిగేవరకు మీరు వాటిని బజారులో పెట్టకుండా, మీ ఇంటిలో ఉంచుకోవటే

చిత్ర: మీకు ఈ బొమ్మలు చికాకును కలిగిస్తే క్షమించండి!

యువకుడు: ప్రపంచంలోని సుద్రాల పరువు పోయింది!!

చిత్ర: అయ్యా! ఇష్టముంటేనే చూడండి; సరదాగా ఉంటే కొనండి. కాని ఇలా కళని అవమానపరచకండి!

యువకుడు: కళ! చెత్తకళ!!

చిత్ర: (ముఖం కోపంతో జేవురించగా) నేనూ మిమ్మల్ని అనవసరంగా మాటలనవలసివస్తుంది!

యువకుడు: అబ్బో! అబ్బో!! అనవసరంగా అంటే జరగవల్సింది జరుగుతుంది!

చిత్ర: భయపడతాననుకోండి. అవమానాన్ని మాత్రం నేను సహించలేను. నాకూ దేవుడు మీకిచ్చినట్టే ఒళ్లు ఇచ్చేడు. మీరు చేసేది నేనూ చేయకపోలేను.

యువకుడు: ఏది—రా చూదాం!

[పెద్దమనిషి, అతని ప్రక్కాయన మధ్యకివచ్చి యువకుణ్ణి వెనుకకి లాగుతూ:] ఎందుకయ్యా అతిగాడితో దెబ్బలాట?

యువకుడు: చూడండామాటలు! తిండిలేకపోయినా తిక్కకేం లోటులేదు.

ప్రక్కాయన: శాంతించవోయి—శాంతించు, అలా-అగ్గయిపోతే ఎలా చెప్పు.

పెద్దమనిషి: ఏదో అమ్ముకుంటున్నాడు పొట్టగడవక.

ప్రక్కాయన: పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా!

యువకుడు: అలా దారికి రమ్మనండి! అంతే కాని. అయినా వీడినిలా ఒదిలిపెడతానూ.

[పోతాడు.]

చిత్ర: వదిలిపెట్టొద్దు. వదిలిపెట్టాలన్నా వదిలిపెట్టలేవు. ఇచ్చేవరకు ఒకరికొకరు అండగానే ఉంటాం, నాన్నా!

పెద్దమనిషి: (చిత్రకారుడితో) నీకెందుకయ్యా అతనితో వాదన. (ప్రక్కాయనతో మెల్లిగా) జాలిపడదామనుకున్నాను, ఎంత తలతిక్క వీడికి!

ఒక వృద్ధు: (వెనుకనుండా మాటలు విని) అదే ఆలోచిస్తున్నాను బాబూ! మనం తిన్న అన్నమే అతనూ తినడా అని!

ప్రక్కాయన: మీ తెలివికి సంతోషించేం తాతగారూ!

వృద్ధు: సంతోషమైపోయింది కాబట్టి ఇక మిగిలేది విచారం. ఆ కన్నీళ్ళుకూడా ఏవో రాల్చి బాబూ!

పెద్దమనిషి: రాలుస్తాను తాతగారూ. కాని ఒత్తుకోనేందుకు రుమాలు తెచ్చుకోలేదు.

వృద్ధు: ఈ రుమాళ్ళెందుకు బాబులూ! మీ కాళ్ల దగ్గరుండే పెద్దగాయాలు సంగతి మరిచేరు. ఈ భూమికి మీ కన్నీళ్లొక లెక్కా జమా!

[మూకలో కలవరం. ఒక వలంపటి ఆవిడ, ధనవంతురాలే అయిఉండాలి, బట్టలనుబటి—అందర్నీ తోసుకవచ్చేందుకు ప్రయత్నం చేస్తూఉంటుంది]

వలం॥-ఆవిడ: (ముందుకి తోసుకవస్తూ) దారివ్వండి బాబూ! ఏమిటో చూస్తాను. ఏవో బొమ్మలటగా! ఏదీ చూడనీయండి! కాస్త చోటుచెయ్యండి నాయనా! ఏదీ...కాస్తచోటు! తగలకండి...నన్ను తగలకండి. కాస్త దూరంగా ఉండరూ! మీకు పుణ్యముంటుంది.

ఒక కుర్రాడు: (కీచుగా) సతీ అనసూయగారు వస్తున్నారు! తప్పుకోండి. తప్పుకోండి. తగలకండి. తగుల్తే మండిపోతారు!

[ఆదరా బాదరగా ఆవిడ ముందుకు వచ్చి, బొమ్మల్ని రెండు నిముషాలపాటు విమర్శగా చూసి—కెవ్వున ఒక్క కేక వేసి, ముఖం కప్పుకొని తిరిగి, మూకనుండి, ఈసారి అందర్నీ తోసుకపోతూ]

ఛీ! ఛీ! ఛీ! ఎంత సిగ్గుమాలిన ప్రపంచం తండ్రి! ఎవరిముహం చూసేనో ఇవాళ! ఏ త్రిమూర్తుల పటాలో ఉంటాయనుకున్నాను. ఆయన చెప్పినా వినకుండా...ఛీ! ఛీ! (ఆమె కంఠం దూరమౌతుంది).

కుర్రాడు: (తిరిగి కీచుగొంతుతో) తల్లీ! అనసూయ లున్నారమ్మా ఇక్కడ! త్రిమూర్తుల్లేరు!

ఒక భక్తుడు: ఒరే గుంటడా! ఏమిట్రా ఆ వేళాకోళం! పెద్దా చిన్నా లేదూ?

కుర్రాడు: లేరండి. మా అమ్మకి నేనొక్కణ్ణే కొడుకునండి.

భక్తుడు: నోరుమూసుకొని అవతలకి నడు. పతివ్రతల నవమాన పరుస్తావ్రటా! గుడ్లు పీకి పోగలవ్!

కుర్రాడు: ఏ పతివ్రతలనండీ?

భక్తుడు: అనసూయామ్మవారిని!

కుర్రాడు: ఇప్పుడొచ్చినా విణ్ణాఅండి?

భక్తుడు: కాదురా. సతీ అనసూయా దేవిని!

కుర్రాడు: ఆ బొమ్మలల్లా ఉంటే. నాదేం తప్పు. ఆ అనసూయతల్లి త్రిమూర్తులకి...

భక్తుడు: ఆగాగు! హరిభగవాన్! (చెవులు మూసుకొని) ఎలా తగలడిపోతోంది ప్రపంచం. (చిత్రకారుణ్ణి ఉద్దేశించి) ఏమండోయి! ఇలారండి!

[చిత్రకారుడు దగ్గరగా వస్తాడు]

చూసేరా మీరు రాసిన ఆ బొమ్మలు! ఎంత పని చేస్తున్నాయో!

చిత్ర: నాకేం అర్థం కావటంలేదు!

భక్తుడు: ఇంకేం అర్థం కావాలయ్యా! కుర్రాళ్ళలో ఉన్న భక్తి కాస్తా పోతోంది! ఆ సిగ్గుమాలిన వాళ్ల బొమ్మల్తో పతివ్రతలని పోలుస్తున్నాడండీ ఈ గుంటడు. (కుర్రాణ్ణి ముందుకు తోస్తాడు) దీనికి కారణం మీరు కాదూ? ఇలాంటి చిత్రాలు ఎంత పతనానికి దారితీస్తున్నాయ్! ఒక నీతా, నిష్టా! ప్రపంచం బాగుపడుతుందీ?

చిత్ర: బొమ్మల్ని నిందించకండి! స్థిరంలేని మీ మనస్సులని విమర్శించుకోండి!

భక్తుడు: ఏమిటీ! ఏమిటీ!

చిత్ర: నేనున్నమాట అంటున్నాను. మీకు చిత్రాలలోని అందం ఆకర్షణీయంగా ఉంది. అందుకే గంటపైబడి నిల్చున్నారిక్కడ. పైగా పతివ్రతలకి అవమానం జరుగుతోందంటున్నారు. మీకొక మనస్సుందీ నిజమైనది?

భక్తుడు: (అందర్నీ ఉద్దేశిస్తూ) చూసేరూ! అందరూ! ఎలా అవమానపరుస్తున్నాడో నన్ను. (చెంప లేసుకొని) అనకూడదు కాని. వీడి సిగగొయ్య; నిజానికి మీ అందరికీ తెల్సునో లేదో! ప్రతినిమిషం ఆ ఆంజనేయుణ్ణి తలుచుకోందీ ఏపనీ చెయ్యను. ఎంత అవమానం! నేను, ఈ బొమ్మలు, ఈసిగ్గుమాలిన చిత్తి చూస్తున్నానా! మీరే చెప్పండి!

[భక్తుడు ఎవరితీర్పూ వినకుండా పోతాడు; మూకలో గుసగుసలు—కోపంగా మాటలువినవస్తాయి చిత్రకారుణ్ణి నిందిస్తూ. అవి కొంతసేపటికి చల్లారాయి]

[ఒకసాయిబు మూకలోంచి ముందుకువచ్చి]

ఆ చేపాకీ హంతాకన్లూ హెందుక్కు వుందీ?

ప్రక్కనున్న ఆయన: అది నీటిలోకూడా చూడగలదు కాబట్టి!

సాయిబు: హంతా కన్నా హులంద్దే!

ప్ర. ఆయన: దాని నైజం చిత్రించారాయన!

సాయిబు: హిదేంటి. ఆడా మడుసుల్! బహుత్ అచ్ఛాగా హులందే!

[వెనుకనుండొక బొంగురు గొంతు]

ఒకటి కొని ఉంచుకోరాదు సాయుబూ!

సాయిబు: (వెనుదిరిగి చూసి ఎవరూ కానరాక పోగా) బాగుండీ హన్నాం కానీ, హెందుక్కొంటాం?

మరొక గొంతు: కొంటే బూబు సాయిబు టోపీ ఎగరగొడ్తుంది!

సాయిబు: హెవ్రడామాటల్! దవడా యిరక్కొడతాం.

[ఇంతలో కళ్ళీలాల్చీలో ఉన్న ఒక మధ్య వయస్కుడు చిత్రకారుడ్ని పలకరిస్తాడు.]

మధ్యవయస్కుడు: (బొమ్మల్ని పరికించి చూసి) మీవేనా ఈ బొమ్మలు.

చిత్ర: ఔనండి!

మ॥ వ: లోపల పెట్టలేదేం?

చిత్ర: అది నా దురదృష్టం!

మ॥ వ: అయ్యో పాపం!

చిత్ర: అనుజ్ఞకోసం అర్జీ పెట్టికున్నాను.

మ॥ వ: అయ్యో పాపం!

చిత్ర: కాని - ఒకర్నని ఏం లాభం!

మ॥ వ: నిజమే! కాని అయ్యో రామచంద్రా ఎంత పని! చిత్రకారుడిగతి ఎంతవరకూ వచ్చింది! బొమ్మలైతే—ఆ ఆడబొమ్మ లొకమాదిరిగా ఉన్నా

యనుకోండి. కాని పులి మేసినట్టున్నాయ్. మొత్తం మీ్మద బావున్నాయి.

చిత్ర: చాలా సంతోషం.

మ॥ వ॥ : అయ్యయ్యో! ఎంత పని పాపం! చు! చు! చు! నాకు బొమ్మ లెయ్యడం రాకపోయినా ఇవంటే పిచ్చి! అయ్యో పాపం. ఎంత పని! కాని ఆ గుర్రం, ఆ చేప, పామూ భయమేస్తూ ఉన్నాయి.

చిత్ర : అందులో ప్రత్యేకత ఉంది.

మ॥ వ॥ ఉండాలుండాలి మరి. అయ్యో పాపం.

చిత్ర : (ఆశగా) మీకేవన్నా కావలిస్తే.

మ॥వ॥ : నాకా! హహహ! నే నొంటరి గాణ్ణి పిల్లా పిచికా లేరు. చూసేరుకదూ. మరి నాకెందుకు చెప్పండి. ఏదో ఇలా చూసేస్తూ ఉండడం. అయ్యో! ఎంత పని.

చిత్ర : (నిరసనగా) జాలిపడిమాత్రం మీరేం చేస్తారు. ఇక్కడున్న అందరూ చూస్తూనే ఉన్నారు!

మ॥వ॥ : అలా అనకు, అలా అనకు. కాస్త ముందే తెలుస్తే అందులో జాగా ఇప్పిద్దును. పాపం! ఇలా బయట్లో. అన్నట్టు! మా నాయుడున్నాడు. ఈ బొమ్మల విలువ తనకే మహా తెలుసును, తనకే తప్ప ఎవ్వరికీ ఇంగులో అభిరుచిలేదు అన్నట్టుంటాడు. కనిపించిన బొమ్మలన్నీ కొనేస్తూఉంటాడు. అందులో నేను సిఫారసుచేస్తే మరీనీ.

చిత్ర : (మళ్ళా ఆశగా చూస్తాడు)

మ॥వ॥ : ఒకటే ఇంట్లో గోడకి తగల్చడు. అంతా మాదగ్గర మేర్చానీ. డబ్బు అయిపోతుందన్న భయంలేదు! సరే. వాడ్నిక్కడికి పంపుతాను. (తిరిగి పోతూ) అయ్యో పాపం!

[ఇంతలో ఇందాకటి, చవక చలవజోళ్ల గిరజాల యువకుడు తిరిగి ముందుకు వచ్చి నిల్చుంటాడు. కొత్తవాళ్లు వస్తూఉంటారు]

ఒక కళాభిమాని: ఇప్పటి ఈ చిత్రకారుల విచిత్రభావాలేవిటో నా కర్థంకావు! ఆ నాలుగు స్త్రీ నగ్న చిత్రాలూ చూసేరా?

వేదాంతి స్నేహితుడు: ఆఁ! చూసినట్టే.

కళాభిమాని: మీకేమయినా అర్థమయిందా?

వేదాంతి: ఎదురుగుండా నాలుగు చిత్రాలున్నాయి. అవి స్త్రీ చిత్రాలని ఆ దేహం రూపురేఖలూ చాటుతున్నాయి. అంతకుమించి నాకేం అర్థంకాదు.

కళాభిమాని: అసలు, ఈ చిత్రాలలో చిత్రకారుడినుంచి, ప్రపంచాని కేదో ఒక సందేశం ఉంటుందని తెల్సునా?

వేదాంతి: ఏమిటో వెర్రి. పోనిద్దురూ. ఏదో తాత్కాలికంగా మనస్సు తృప్తిపడడానికని చూస్తాం. ఆనందిస్తాం. అంతే. అసలు ఇవి ఇచ్చే సందేశాలవల్ల మానవ ప్రకృతిలో మార్పుకలగడానికి వ్యవధి లేదు. క్షణిక జీవితాలు.

కళాభిమాని: మాటవరసకి—మీరు వేదాంతే కదా?

వేదాంతి: అలా అని నన్ను వేరుచెయ్యకండి. మనమందరం ఇంతో అంతో వేదాంతులమే.

కళాభిమాని: పోనీ అలానే అనుకుందాం. చిత్రాల్లో కూడా వేదాంతం ఉందని తెల్సునా? ఇప్పుడు—వంగిన నడుముతో కొండనెక్కే ముసలాడున్నాడనుకోండి. అందులో ఎంత వేదాంతముందో గ్రహించేరా? కాలమనే 'పర్వతశిఖరాన్ని అతడు అందుకుందామని చూస్తున్నాడన్నమాట, తన క్షణిక జీవితంలో ఎంత ఆశో చూడండి!!

వేదాంతి: మీరు కళాభిమానులు! మీకు వేదాంతం అందులో కనిపిస్తుంది. కాని నా మానసిక ప్రవృత్తి వేరు.

కళాభిమాని: కాని ఆలోచిద్దాం. ఈ స్త్రీ మూర్తులలో చిత్రకారుడు ఏం చెప్పదలచుకున్నాడో? స్త్రీ ఆకారాలని పోల్చుకోవచ్చును. అది వినా, స్త్రీయొక్క వంపులసొంపు, అందం వాటిలో ఏకోశానా లేవు. ఒకమూల అవి ఆకర్షవంతంగాఉన్నా, సరాసరి చూడగా అవి అసహ్యతను కలిగిస్తున్నాయి. చెదిరినజుత్తు—ఏంముఖాలు!

వేదాంతి: రంగులు చెదిరిపోయి ఉన్నాయి. కొబ్బరిపీచుతో వేశేడేమొ!

కళాభిమాని: రంగులవిషయం వస్తే, ఈ రకం రంగులు, ఏదేశ చిత్రకళా సంప్రదాయాన్నీ పోలవు! ఇదేదన్నా కొత్తపద్ధతనుకోవాలో, లేదా చిత్రకారుడు పిచ్చివాడనుకోవాలో అర్థం కావడం లేదు. ఆరంగులు పేడలికినట్టున్నా ఏదో మోటు దనాన్ని చాటుతున్నాయనుకోవాలేమో మరి.

[చిత్రకారుడి ముఖాన్ని పరీక్షిస్తాడు]

ఇంకో కాయన: ఏమండీ — అశ్వం, చేప, పాము విషయం ఏమంటారు?

కళాభిమాని: ముందీ స్త్రీమూర్తుల విషయం కానీయండి — ఇన్నేళ్లయి చిత్రాలెన్నో చూస్తున్నాను. ఎందరో మహానుభావుల కళాఖండాలని పరీక్ష చేశాను. ప్రతిదానిలోనూ నాకేదో సందేశం, వర్తమానం కనుపించేయి కాని వీటిలో అదిలేదు. ఈమూర్తులు మేమిచ్చే సందేశం ఏమీ లేదు మాకు మేము ఈ జీవితాలు ఇలా గడుపుకపోతూ నశించనీయండి అన్నట్టున్నాయి.

వేదాంతి: అయ్యా! చాలు — పదండింటికి. ఇలా ప్రతిబొమ్మనీ వ్యాఖ్యానిస్తూ కూర్చుంటే ఇంక ఇంటికి చేరినట్టే ఇవాళ!

కళాభిమాని: ఈ ప్రపంచంలో, ఎవరియొక్క ఆదరణ, అభిమానం, ఎవరియొక్క సంబంధం లేకుండా నిరాశ్రయంగా, చేసేందుకు ఉద్యోగం, కాల్చేందుకు కన్నీటిబొట్టు లేకుండా బ్రతికే పతితలు — వాళ్లే ... సారాంశమే ఈ చిత్రాలనుకుంటే! వాళ్లు మనకిచ్చే సందేశం ఉండదు ఇచ్చినా మనం గ్రహించలేం. అదే 'ట్రాజడీ!' ఆ నిజమే, చిత్రకారుడిందులో చెప్తున్నాడేమో!

వేదాంతి: చాలిన్నాళ్లకి! పదండి బాబూ!

కళాభిమాని: నేనిన్ని అనుకుంటున్నాను కాని, చిత్రకారుడి ముఖం చూస్తే, అతడి మనసులో ఈ భావాలు కలిగేయా అని అనుమానం వేస్తోంది. వెర్రివాడిలా అగుపిస్తున్నాడు! అయినా మీరన్నట్టు నావేవో పిచ్చి ఆలోచనలు. (చిత్రకారుడితో) ఏమండీ! మాట!!

చిత్ర: (ముందుకువస్తూ దీనంగా).

కళాభిమాని: నా కీభావాలు కలిగినా, మీ బొమ్మలు అసహ్యంగా ఉన్నాయి!

చిత్ర: (తెల్లబోయి ఏదో అనబోతాడు కాని, కళాభిమానీ, వేదాంతీ మరి కనుపించరు.)

[దూరంగా గోల. పదం: 'ఏం బీడీ కావాలి' జవాబుగా 'కోరస్' 'గుర్రం బీడీ కావాలి—' మూకలో, చిత్రకారుడిమీద నెమ్మదిగా తెరపడుతూ వస్తాయి. దూరపు 'కోరస్' దగ్గరౌతుంది. ఒక కుర్రాళ్ళగుంపు, అట్టకు అగ్రజాతి ఒక అశ్వం బొమ్మతో:]

గిరజాల యువకుడు: ఒరే అబ్బాయిలూ! ఇలా రండి! ఇలా రండి!

[పదం: 'ఏం బీడీ కావాలి'—ముందు కొస్తాడొక కుర్రాడు. కోరస్ 'గుర్రం బీడీ కావాలి' నలుగురు కుర్రాళ్లు ముందుకొస్తారు, 'పోస్టర్'లు పట్టుకొని]

మొ. కుర్రాడు: గుర్రం బీడీ కాల్చండి సార్!

రెం. కు: సిగరెట్టు దేంతో తయారైంది?

మూ. కు: పొగాకువల్ల!

రెం. కు: పొగాకు కాలుస్తే ఏమౌతుంది?

నాల్గ: దగ్గొస్తుంది!

రెం. కు: దగ్గు ముదురితే.

మూ. కు: క్షయ!

రెం. కు: క్షయ ఎక్కువైతే.

నాల్గ. కు: నరకానికి ప్రయాణం!

రెం. కు: మన బీడీ మాటో!

మూ. కు: విస్తరాకులాంటి ఆకుతో.

రెం. కు: విస్తరాకులో భోంచేస్తాం కదూ? దగ్గొస్తుందా?

నాల్గ. కు: రాదు.

రెం. కు: అందుకు?

మూ. కు: మన బీడీ కాలుస్తే క్షయరాదు.

రెం. కు: అందుకు?

నాల్గ. కు: క్షయ పోవాలంటే మా బీడీ కాల్చండి.

మొ. కు: కావలిస్తే చూపెడతాం మచ్చు!

[యువకుడి చేతిలో పెట్టెడు బీడీ)

యువకుడు: సరే నర్రా ఆ గుర్రాన్ని చూపండి.

[గుర్రం కాన్వాసు వేపు చూపిస్తాడు. అందరూ దానివేపు, దాని ప్రక్కనున్న స్త్రీ చిత్రాల వేపూ చూస్తూఉంటారు]

మీ గుర్రంలా ఉందా?

మొ. కు: (అనుమానంగా) లేదే?

రెం. కు: అదెందుకలా ఉంది?

మూ. కు: పెద్ద పిట్టలా ఉందే!

నాల్గ.. కు: ఛీ! ఏం బావులేదు.

యువకుడు: ఆ గుర్రాని కెంతిచ్చియ్యొచ్చురా?

ఒకాయన: ఆయ నేదో అమ్ముకుంటూ ఉంటే నీ కెందుకయ్యా ఆ బాధ.

యువకుడు: దాని విలువకట్టి తీసుకుందామని. ఎం తిరయ్యిచ్చు(నా.

మొ. కు: ఎందుకు?

యువకుడు: కొనుక్కొని ఇంట్లో ఉంచుగో డానికి.

రెం. కు: మంచి గుర్రాన్నే ఉంచుకోరాదూ?

మూ. కు: మా గుర్రాన్ని చూడండి! దాన్ని చూడండి! (వెళ్ళి దానిప్రక్కని 'పోస్టర్' నిలబెడ తాడు. మూకలో కలవరం; నవ్వులు కేకలు. చిత్ర కారుడు వెర్రివాడిలా చూస్తూ ఉంటాడు)

యువకుడు: అయితే ఒకే. ఇలాటి గుర్రాన్ని చూస్తే ఎవరన్నా మీ బీడీలు కాలుస్తారా?

మొ. కు: ఎందుకొనక్కొర్లేదు? మాబీడీ మాకే.

యువకుడు: నేనుమటుకు కాల్చలేను. గుర్రం అంటే అసహ్యం పుట్టుతోందసుమీ.

రెం. కు: (అనుమానంగా) నాకూ అలానే ఉంది.

యువకుడు: అయితే మీబీడీ లెవరూ కాల్చరు.

మూ. కు } ఏం చెయ్యాలం అయితే?
నాల్గ. కు }

యువకుడు: పదం డిక్టేట్ చేస్తా. చెప్తా.

అందరూ: పదండి. పదండి.

పదం: 'ఏంబీడీ కావాలి'—

కోరస్: 'గుర్రంబీడీ కావాలి'—[కుర్రాళ్లు, యువకుడు పోతారు]

[మూకలో గోల మరీ ఎక్కువౌతుంది. ముష్టి కుర్రాళ్ళంతా చుట్టూ చేరతారు.]

[ఇంతలో అందరినోటంటా 'నాయుడుగారు' 'నాయుడుగారు' అన్న మాటలు. అంతా విడిపోతారు. ఖరీదైన 'సూటు'లో ఏభైఏళ్ళ ఒకవ్యక్తి; భారీ అయినఒళ్లు. చామనచాయ. బట్టతల. అతనివెనుక 'ప్లాస్టిక్' సంచీ మోచుతూ అందమైన ఒక అమ్మాయి]

నాయుడుగారు: (ముందుకువచ్చి బొమ్మల్ని చూసి) హుఁ!.........ఈప్రపంచానికి దాపరించేరు వీళ్లు బాగా - అడ్డమైన బొమ్మలూ రాస్తూ—ఏం రత్నం? బొమ్మ లెలాఉన్నాయి.

[చిత్రకారుడు ముందుకొస్తాడు ఆశగా]

రత్నం: (సిగ్గుపడి తల వంచుకుంటుంది.)

నాయుడుగారు: (నిరక్ష్యంగా) హుఁ! సిగ్గు— పడే—నువ్వేనయ్యా చిత్రకారుడివి.

చిత్ర: అవునండి.

నాయుడు: మా సున్నయ్యా ఇప్పుడే చెప్పేడు.

చిత్ర: ఆయ నిప్పుడే వచ్చివెళ్లారండి.

నాయుడు: సరే. దానికేం. అమ్ముదామనే రాసేవ్ ఈబొమ్మలు. హుఁ...కడుపు కక్కుర్తి... హుఁ—ఎలా ఇచ్చేస్తావ్ మొ అవన్నీ కలిపి.

రత్నం: బాబాయ్!

నాయుడు: ఏం? ఏమిటి సం?

రత్నం: ఒక్క మాటుంది.

నాయుడు: చెత్తబొమ్మల్లే! సున్నయ్యా తనకే తెల్సుననుకుంటాడు మహా! మన కంతకన్నా తెల్సు! కొనేసి కొట్లో పారేస్తే తీసిపోతుంది. బొమ్మలు కొనండీ, కొనండీ అని ఈ చిత్రకారులంతా కాళ్లా వేళ్ళా బడితే ఏం చెయ్యడం. ఎంత చెప్పు ధర?

చిత్ర: ఏం ధర చెప్పాలో నాకు తేలీదు. వాటి విలువ చెబ్బ రూపేణా నాకు తెలీదు! మీరే...

నాయుడు: అన్నింటికీ వెయ్యిరూయలు. ఆ ఆడబొమ్మలు బొత్తిగా బావులేవు. ఆ జుత్తు—అంద వికారంగా. ఆ గుర్రం! ఆ చేపకన్ను! ఆ పాము బుర్ర! ఓరి బాబోయ్! ఏం చిత్రకారుడువి. చెప్పు - ఏం?

రత్నం: బాబాయి! నా మాటొకటుంది వినండి, ఒక్క నిమిషం.

నాయుడు: ఉండమ్మా. ఇప్పుడొస్తుంటావ్, ఇంటి కెళ్ళేక బొమ్మలు కొనలేదూ, కొనలేదూ అని ప్రాణం తినేస్తావ్. అయినా ఘనకన్న— కెక్కువ అన్న బొమ్మల సంగతి! దీని విలువ కళ్ళతే పది వేలందురు. నేను వెయ్యికి ఎక్కువ చెయ్యవంటాను.

రత్నం: (చిన్న గొంతుతో) ఇవి గోడలకి తగి లించనిస్తారా?

నాయుడు: ఇవా. నేను బ్రతికుండగా జర గదు. ఏదో బొమ్మల పిచ్చి. గోడలకి తగిల్చేటంత విలువ వేటికీ లేదు. పోనీ మరో వెయ్యి తీసుకో.

రత్నం: (గట్టిగా) బాబాయ్! అత న్నినవస రంగా భ్రమ పెట్టకండి!

నాయుడు: భ్రమెందుకు? డబ్బిచ్చే తీసు కుంటాం.

రత్నం: కాదు. ఆ కొట్లో పారేసిన చిత్రా లన్నీ, చెదబట్టి పాడయేయి. వాటికి నేనంత బాధపడ

లేదు! కాని ఇవి మహత్తర చిత్రాలు బాబాయ్! ఇవి వాటిలా నే పాడవడం నాకిష్టం లేదు.

నాయుడు: అయితే ఎవరో కొనిపట్టుకపోతే చూస్తూ ఊరుకోమంటావ్? నాకాపాటి కళంటే తెల్సునని ఆ వెర్రివాళ్లకంతా ఎలా తెలియడం మరి?

రత్నం: ఇంటిగోడలకి తగిల్చేటట్టయితే నే కొనండి. నే నెప్పుడూ మీతో ఇంత ఇదిగా వాదించ లేదు!

నాయుడు: గోడలకా! అదెప్పుడూ జరగదు. ఈ ఎందుకూ పనికిరాని బొమ్మలు, కడుపుకోసం రాసిన బొమ్మలు గోడకి—ఏం? రెండు వేల కేమంటావ్?

చిత్ర: (ముఖం దించి) ఈ చిత్రాల నమ్మడం నాకూ ఇష్టం లేదు! కడుపుకోసం అమ్ముతున్నాను కాని, కడుపుకోసం నేను వీటని సృష్టించలేదు! అవి చెదపట్టి నశించడం నాకిష్టం లేదు!

నాయుడు: అయితే నువ్వు నేది!

చిత్ర: క్షమించండి! నే నమ్మను!!

[ఆ అమ్మాయి ముఖం వికసిస్తుంది ఆశ్చర్యంగా చిత్రకారుణ్ణి చూస్తుంది]

నాయుడు: (వెంటనే) ఛీ! వెధవబొమ్మలు. (గిరుక్కున తిరిగి మూకలోనుంచిపోతూ) ఎంత తలతిరుగుడు. అమ్మడట. అమ్మడు!! రెండు వేలు! వీడి జన్మలో చూసేడూ... చెత్తబొమ్మలు. అవీ ఒక బొమ్మలే!

[అమ్మాయి చిత్రకారుడి కళ్లలోకి విచారంగా చూసి నాయుడిగారి వెంట వెళ్తుంది. మూకలో మాటలు. 'ఎంత తలతిరుగుడు' 'చెత్తబొమ్మలు' 'అవతల విసిరేయండి.'—ఆ మూకనుండి 'మోడెలు' గబగబా ముందుకు వస్తుంది. ఆమె ముఖం ఎర్రగా కందిఉంది. పెదవులు వణుకుతున్నాయి.]

చిత్ర: (తెల్లబోయి) నువ్వా!!

మోడెలు: (ఆవేశంతో) ఎందుకమ్మ లేదు?

చిత్ర: (ఆశ్చర్యంగా) ఇదిగో నామాట విను. ఇక్కడొద్దు కోపం!

మోడల్: (కళ్లలోపడే ముంగుర్లని ఎగరేసి) ఒద్దు కోపం! హ్హాఁ! ఎందుకమ్మలేదు? నాకు ముందుచెప్పు? రెండు వేలు నీజన్మలో ఎరుగుదువూ?

చిత్ర: (ముఖం చిన్నది చేసుకునే) చెప్పనే చెప్పేను. అవి చెదబట్టి నశించడం నాకిష్టం లేదు!

మోడల్: (ఆవేశంతో ఒగుర్చుస్తూ) నీకు కీర్తి కావాలేం? ఎప్పుడూ ఉండిపోవాలి.

చిత్ర: నిన్ను బతిమాలుకుంటాను. ఇక్కడ నన్నల్లరిపాలు చెయ్యకు. ఇంటికిపద. ఇవాళకి చాలీ అమ్మకం.

మోడల్: ఇంటికి! అమ్మకం! ఛీ! థూ! ఈ బొమ్మలకొచ్చిన డబ్బంతా ఇచ్చేస్తానన్నావ్. మరి ఆ బొమ్మలు నాకిచ్చినట్టే లెఖ్ఖా? ఏమంటావ్?

చిత్ర: కాని...అవి...

మోడల్: నోర్మూయ్యి! నువ్వు దగాకోరువి. నీకు కావల్సింది ' ర్తి. దానికోసం ఎన్ని మంచిమాట ! ఎన్ని కలలు నామనస్సులో కలిగించేవ్.

చిత్ర: నామాట వినవ్. నీ గడ్డం పట్టుకుంటాను.

మోడల్: ఇప్పుడు తెల్సింది. నువ్వు తిక్కిన నాలాంటివాళ్ళకి చేసిన అన్యాయం. బొమ్మలమ్ముతానని ఒక్కటే అమ్మక!

చిత్ర: నువ్వు తప్పర్థం చేసుకుంటున్నావ్.

మోడల్: (మూక వేపు తిరిగి) ఇవన్నీ చెత్త—ఎందుకూ కొరగానివి వీడ్లోపనికిమాలిన చిత్రకారుడు. ఏం చూస్తారీబొమ్మలు? ఉమ్మేయండి వీటిమీద.

చిత్ర: (ఆమె భుజం పట్టుకొని) ఇదిగో!'

[మూకలో "భలే! భలే!" "హద్దిదీ!" "వహ్వా!" గుర్రపు కాన్వాసుమీద వచ్చి పడుతుంది మట్టిముద్ద ఎటునుంచో—దాన్ననుసరిస్తూ, ఇద్దరు కుర్రాళ్ళు కొలవల్లోని ముగ్గి డొక్కులతో తెచ్చి చిత్రాలమీద ఒంపుతారు. వాళ్లు ఇందాకటి బీడీ కుర్రాళ్లు—మూకలో పెద్ద నవ్వులు కేకలు - 'చించేయండి' - 'విసిరేయండి' - 'ఎంత బుర్రతిరుగుడు' - 'చెత్తబొమ్మలు' - ముష్టికుర్రాళ్ళు బొమ్మలమీద పడతారు.]

చిత్ర: అయ్యా! అయ్యా! నామాట వినండి. కావలిస్తే ఊరకనే తీసుకోండి. ఇదుగో బాబూ!

గిరజాల యువకుడు: (ముందుకువచ్చి) ఒరేయి—ఒరేయి - ఏమిటది. తప్పు! తప్పు! కళని అవమాన పరచకండి.

[పెద్దగోల. భర్తుడు', 'పెద్దమనిషి', 'ప్రక్కాయన' వచ్చి పకపక నవ్వుతూ ఉంటారు. కాన్వాసంటినీ చీలికలు చేశారు ముష్టికుర్రాళ్ళు; చిత్రకారుడు ఒక మూల కుప్పగా కూలబడ్డాడు ముఖంలో నెత్తురులేక—మోడల్ వెర్రిదాన్లా నిల్చుం

టుంది కళ్ళని నమ్మలేక-ఇంతలో 'పోలీస్' 'పోలీస్' అన్న అరుపు. మూకంతా చెల్లాచెదరై పోతారు.]

పోలీసు జవాను: (పరిగెత్తుకవచ్చి) ఏమిటయిం దేమిటయింది. ఏమి టిదంతా?

[మూకంతా అప్పుడే మటుమాయమైంది. చిత్ర కారుడు, మోడలు, మిగిలారు. పోలీసు పాడైన కాన్వాసులని చూసి]

ఓ! ఎంత పనైంది! హు! పట్టుకుంటాం ఫర్వా లేదు. ఈ ముష్టి వెధవల అల్లరి. ఇప్పుడే ఒక దొరగా ర్నల్లరి పెట్టేరు. ఏయి 'టూ ట్వంటీ' ఎక్కడున్నావ్? ఉండు. వస్తున్నా...మరేం ఫర వాలేదు. రిపోర్టివ్వండి...

[జవాను వెళ్తాడు. చిత్రకారుడు వెర్రివాడిలా చూస్తూ ఉంటాడు శూన్యంలోకి—'ఎగ్జిబిషన్' అయి పోయింది. కోరులన్నీ ఏనాడెమో పోయేయి. చీకటి పడింది. లైట్లు వెలిగేయి; మోడలు తెల్లబోయిన ముఖంతో దగ్గరగా వచ్చి అతనిప్రక్కని కూర్చుం టుంది. ఇద్దరూ మౌనం కొద్ది క్షణాలు]

మోడల్: (అతని భుజంమ్మీద చెయ్యి వేస్తుంది)

[చిత్ర: (ఇటు తిరిగి ఆమె కళ్లలోకి వెర్రిగా చూసి, తల దించుకుంటాడు—

ఇద్దరూ తిరిగి మౌనం. దూరంగా వినిపిస్తూ ఉంటుంది హోటల్ లౌడ్‌స్పీకర్ లోనుంచి పాట- "అమరావతీ గుహల - అపురూప శిల్పాలు"]

మోడలు: (మెల్లిగా) నువ్వు గొప్ప చిత్రకా రుడువి.

[ఆమె కళ్లలో నీళ్లునిండేయి. మళ్లా మౌనం. కొద్దిసేపు]

చిత్ర: (గద్గదస్వరంతో) దీంతో తెలిసిందా?

[పాడయిన కాన్వాసులకేసి చూస్తాడు.]

మోడల్: (అతనివైపు చూడలేక ముఖం తిప్పు కొని) నేను...తప్పు చేసేను...ఇందాక...క్షమించు!

చిత్ర: (వేదాంతిలా నవ్వి) నీకు నిరాశ కల్గిం చేను. నువ్వు నన్ను క్షమించు!

[ఇద్దరూ మౌనం]

నేను స్వార్థపరుణ్ణి!!!

మోడలు: (వీధిదీపాల వెలుగులో, చాటుగా ఉన్న అతని కళ్ళను చూసేందుకు ప్రయత్నిస్తూ) నేనూను!!

[అతను కళ్లెత్తి ఆమె ముఖంలోకి చూస్తాడు. ఆమె ముఖం త్రిప్పుకుంటుంది, కన్నీళ్లు కొనరా కుండా. ఒక్క నిముషం అలా ఉండి లేచి నిల్చుం టుంది] వెళ్తున్నా.

చిత్ర: (పిచ్చివాడిలా చూస్తూ) ఎక్కడికి?

మోడలు: నీకు తెలుసు!

చిత్ర: (ఆత్రంగా) వద్దు! వద్దు?!

మోడలు: (పెదవులమీద చిరునవ్వుతో) సాగం చేస్తావా?

చిత్రకారుడు చిన్నబోయి ముఖం దించుకుంటాడు. ఆమె పోతోంది! పోయి వీధిలోని జనసమ్మర్దంలో కల్సిపోయింది. ప్రపంచంలోని చీకట్లలో ఏకమయింది!!

ఇతను కూర్చున్నాడు! వీధి దీపాల మిణుకులో! కీర్తి శిథిలాలమధ్య! ఒంట రిగా!! బ్రపాతుకుని!!!

# చిత్రకళలో మొగల్ శైలి

శ్రీ వేలూరి రాధాకృష్ణ



హిందూ వివాహము—16 వ శతాబ్దము

భారతదేశంలో చిత్రకళ ఆయా కాలపు రాజుల పాలనలో, ఆయా రాజుల అభిరుచుల కనుగుణంగా వివిధరీతులలో, శైలులలో సాధన చేయబడుతూ వచ్చింది. ఆయా రాజుల ఆస్థానాలలో అనేకమంది చిత్రకారులు నియోగింపబడి, వారివారి కళాతృష్ణ కనువైన శైలిలో సాధన చేసేవారు. ఆవిధంగా ఏర్పడిన శైలులలో అతిముఖ్యమైన అతి ప్రఖ్యాతి గాంచిన శైలులు రెండు. ఒకటి మొగల్ చిత్రశైలి. రెండవది రాజపుత్ర చిత్రశైలి. ఇంకా అనేకములైన చిల్లర మల్లర సంప్రదాయాలూ, జానపద చిత్రసరళికి చెందినవీ ఉన్నవి. మొగల్ చిత్రశైలికి ఒక ప్రత్యేకత వున్నది.

ఈ శైలిని గూర్చి, చాలా అద్భుతమైన వ్యాఖ్యానాలు, గ్రంథాలు, అనేక చిత్రకళా విమర్శకుల చేత ప్రచురింపబడినవి. ముఖ్యంగా ఈ ప్రశంసాపూర్వక వ్యాఖ్యానాలవల్లనే, ఈ మొగల్ శైలి బాగా ప్రఖ్యాతిలోనికి వచ్చింది. అనేకమంది ధనికులు మొగల్ చిత్రాలను కొని వాటిని అతిగౌరవంతో కాపాడుకుంటూవచ్చారు. ఇప్పటికీ జాగీరుదార్లు, తమ భవనాలను ఆ చిత్రాలతో అలంకరించి ఉంచారు. ఉదాహరణకు హైదరాబాదు సంస్థానంలో అనేక భవనాలు ఆవిధంగా అలంకరింపబడి ఉన్నవి. ఎన్ని విధాలుగా ఆ శైలి చిత్రాలకు గౌరవం రావాలో అన్ని విధాలుగా విమర్శకులు ప్రశంసించి వాటిలో గల గొప్పతనాన్ని వెలుగులోకి తెచ్చారు. కాని పాశ్చాత్య దేశాలలో మాత్రం ముఖ్యంగా ఇంగ్లండులో ఆసియా చిత్రశైలులలో అన్నిటికన్న, ఈ మొగల్ చిత్రశైలిపై అనేక కటువైన విమర్శలు హుటాహుటిగా వెలువడి అందరి విమర్శకుల్ని ఆశ్చర్యచకితులను చేసినవి. ఈ విమర్శలన్నిటి సారాంశ మేమంటే, ఈ చిత్రశైలి కేవలం పాక్షికమైన సంకుచిత స్వభావంతో రచింపబడిన చిత్రశైలి అనీ, దానికీ పర్షియన్ చిత్ర రచనకీ ఏమాత్రం భేదం లేదనీ, ఇది కేవలం మొగలాయీ పాలకుల సంతుష్టికోసం పోషింపబడిన శైలిఅనీ, పశ్చిమ, ప్రాచ్యశైలుల



జహాంగీరు—16-17 శతాబ్దము

అసమంజసమైన మేళవింపుకు ఈ మొగల్ శైలి అధమరూపమనీను. ఈ విమర్శలు బహు పేలవంగా చేసినవి కావటంమూలాన అర్థం లేనివనే చెప్ప వలసివస్తుంది. ముఖ్యంగా నిజమైన కళాతృష్ణ ఉన్న విద్యార్థుల్ని ఇవి తప్పుడు దోవలో పెట్టేవిగా వున్నవి. వాటివల్ల కళోపాసకులకు కలిగిన ప్రయోజనం ఎక్కువగా కనపడదు.

వాటివిషయం అల్లాఉంచి, నిజంగా నిష్పాక్షికంగా మొగల్ శైలిలో ఉన్న ఘనతనే, మనం తీసికొనదగినవారం కాబట్టి, దానినిగురించే సమగ్రంగా చర్చించుకుందాము. మొగలాయీ పరిపాలనలలో ప్రవర్థిల్లిన చిత్రశైలి కావటం మూలాన, ఈ శైలిని మొగల్ చిత్రశైలి అని పేర్కొనవలసి వచ్చింది. ఆ విధంగా చరిత్రకారులు పేర్కొన్నారు. కాబట్టి, అది చర్చకనుగుణంగా కూడా ఉంటుంది. అందులో మతవిషయకమైన అంశమటుంచి, ముఖ్యంగా ఆనాటి చిత్రకారుల్ని ప్రోద్బలంచేసింది మొగలాయీ రాజులమూర్తి చిత్రముల రచన (*Portrait painting*). ఆ రచన ప్రారంభంనుంచీ చిత్రకారుల నిశిత పరిశీలనా శక్తిని చాటుతూ వచ్చింది. నాటి అతి స్వల్పములైన పరికరాలతో అతి చిన్న సైజులో ఆ చిత్రకారులు వేసిన సాధన కలకాలమూ ప్రశంసింపదగినది. సూక్ష్మాకారంలో (*Miniature*) రచించగల శక్తి వారిలోనే మొదటగా ప్రాదుర్భవించిందని చెప్పాలి. ఆ సూక్ష్మాకారంలో రాజుయొక్క గాని, రాణియొక్క గాని, ముఖాన్ని, ఆ వ్యక్తికున్న వ్యక్తిగత విశేషాలతో సహా ప్రతిబింబింపగల ప్రజ్ఞ, ఆ కాలంలోనే ఆ చిత్రకారులకే ఉన్నదని చెప్పటం అతిశయోక్తి కాదు.

మొగల్ చిత్రరచన దాని ప్రారంభంనుంచీ, ఇతర భారత చిత్రశైలులకు భిన్నంగా, ఒక ప్రత్యేకతను పెంపొందజేసుకున్నది. అది కేవలం, మొగలాయీ రాజుల ప్రాపకంలో వారి అభిరుచుల కనుగుణంగా, వారి ఆదేశానుసారం సాధన చేయబడిన

శైలి కాబట్టి, ఆ విభిన్నత కనిపించటంలో ఆశ్చర్యం లేదు. ఈ చిత్రశైలి పదహారవ శతాబ్ది ప్రారంభంలో ప్రాదుర్భవించి, పదిహేడవ శతాబ్ది మధ్యలో అత్యున్నత స్థాయిని పొంది, తరువాత, నెమ్మదిగా పతనాన్ని పొందుతూవచ్చింది. మొట్టమొదటగా సాంస్కృతిక గ్రంథాలను సచిత్రంగా తయారుచేసే ఉద్యమంగా ప్రారంభమయింది. అప్పుడప్పుడే తాటియాకుల స్థానంలో మామూలు కాగితం వాడడం కూడా మొదలైంది. ఆవిధంగా సచిత్రంగా తయారుచేయవలసిన గ్రంథరచనకి, ఎంత సరంజామా, ఎంతమంది కళాకారుల సహాయం కావాలో చెప్పనవసరంలేదు. మొగల్ చిత్రశైలికి తండ్రివంటివాడైన, అక్బరు చక్రవర్తి తను వినియోగించిన చిత్రకారుల రచనలను స్వయంగాపరిశీలిస్తూ ఉండేవాడట. అతని అభిరుచి కనుగుణంగా పర్షియన్ చిత్రశైలిని మార్పించి, ఆ గ్రంథరచన కయ్యే ఖర్చు, అనగా, కాగితం, రంగులు, కుంచలు, చిత్రకారుల వేతనాలు, మొదలైనవన్నీ తనే భరించి, కార్యసాధకుడయ్యేవాడు. సహజంగా, ఆ కాలంలో చిత్రకారులకు, వారిని భరించే దాత కావలసివచ్చాడు. చక్రవర్తికీ వారి అవసరం కావలసివచ్చింది. దానినిబట్టి, చిత్రకారులంతా, ఆ చక్రవర్తినే ఆశ్రయించారు. అందువల్ల వారిలో పూర్వం ఏవిధమైన వ్యక్తిగత విశేషమైన ప్రజ్ఞ ఉన్నా, దానిని చక్రవర్తి అభిరుచికి 'దాసోహం' అనిపించాల్సివచ్చింది. తత్కారణంగా వారి స్వీయ శైలి నశించింది. ఈ ఉదంతం అంతా మనకు చారిత్రికంగా తెలుస్తుంది.



మన్సూర్ రచన
16-17 శతాబ్దము

అయితే, భారత చిత్రకళ అతి పురాతనమైనది. దాని ప్రాదుర్భావం అజ్ఞాతం అనే సంగతి ఒక విధంగా ఒప్పుకొనితీరాలి. విశ్వవిఖ్యాతిని గాంచిన, అజంతా, బాగ్, సిగిరియా కుడ్యచిత్రాల చరిత్రకు పూర్వం, అనగా ఆరేడు శతాబ్దాల వెనుక, పై కుడ్య చిత్ర ప్రాదుర్భావానికి ప్రోత్సాహకమైన కళా చరిత్ర, నిస్సందేహంగా ఉండితీరాలిగదా! మానవుని కళాదర్శములైన రూప లావణ్యాలను కౌశలంతో చిత్రించిన చిత్రకారుని ప్రతిభకు ప్రాచీనమైన ఒక పునాది కలదనేది నిర్వివాదాంశము. లేనిచో అజంతా కుడ్య చిత్రాలలో మానవరూప వాస్తవికతను అంత ఘనంగా చిత్రకారుడు చిత్రించి ఉండగల్గేవాడు కాడుకదా. బోధిసత్త్వుని చిత్రం చూడగానే, మానవునిలో ఉన్న అత్యుత్తమ రూపలావణ్యాలన్నిటినీ, క్రోడీకరించి, దానికి ఒక మహోన్నతమైన భావాన్ని జోడించి, చిత్రకారుడు రచన చేశాడని తెలుస్తుంది. తరువాత తొమ్మిది వందల సంవత్సరాలవరకూ, సాధనచేయబడిన చిత్రరచనకు తార్కాణంగా, కాలక్రమంగా ప్రవర్తిల్లిన సంస్కృతీ స్మారక చిహ్నాలూ మనకు లభ్యమవుతవి. వాటి ద్వారా చిత్రకళకు మతం ప్రోత్సాహం ఇచ్చినట్లేకాక, మతేతరమైన ప్రోత్సాహంకూడా కలదనీ తేటతెల్లమవుతుంది. సూక్ష్మాకారంలో రచించిన చిత్రాలు, భారతదేశంలో పశ్చిమభాగాన, నేపాలు, వంగదేశాలలోనూ చాలా లభ్యమయినవి. ఈ చిత్రాలనుబట్టి రచన, ఒక నిర్దిష్టమైన శైలిద్వారా, మతమూ మతేతరమూ, అయిన భావప్రాబల్యంతో సాధన జరిగిందని తెలుస్తుంది. ఆ చిత్రాలలో ఈ సృష్టిలో ఉన్న జీవాన్నంతా తమ చిత్రాలలో



సంగీత పాఠము—18 వ శతాబ్దము

పోయాలనీ, తద్వారా, ఒక భావ సంచలనాన్ని కలిగించి, చూపరుని ఆనందపరవశుణ్ణి చేయాలనీ, చిత్రకారులు ఏవిధంగా తంటాలుపడ్డారో మనకు విదితమవుతుంది.

మొగలాయీ చక్రవర్తుల పరిపాలన ప్రారంభం అయినతరువాత, భారతదేశం, చారిత్రకంగానూ, సాంస్కృతికంగానూ, ఒక విశిష్టపరిణామం పొందింది...అంతకుముందు ప్రవర్తిల్లిన రెండు విభిన్న నాగరికతల సమ్మేళనమే, మొగలాయీ పరిపాలనలో కలిగిన పరిణామపు సమగ్ర చరిత్ర—.

మొగలాయీ చక్రవర్తుల సంస్కృతికి మాతృక పర్షియన్ సంస్కృతి. ఆ సంస్కృతినే వారి పరిపాలనలో, అన్ని పంథాలలో నడిపించారు. ఆ సమయంలోనే చిత్రకళకూడా ఒక విశిష్ట, పరిణామం పొందింది. పర్షియన్ చిత్రకారుల కౌశలం, వారి శైలి, భారత చిత్రకారులను ఆకర్షించింది. వారిని ఆ శైలిలోకూడా సాధన చేయించింది.

మొగల్ ప్రభుత్వాన్ని నెలకొల్పింది బాబరు—తామర్ లేను వంశీయుడు. పర్షియన్ నాగరికత, అతనిలో అన్నివిధాలా ప్రతిబింబించింది అతడు ఇస్లాం సంస్కృతీ కళారంగాల కాటపట్టైన 'హిరట్' నగరాన్ని సందర్శించినప్పుడు, అత్యుత్తము చిత్రకారుడైన, విశ్వవిఖ్యాతి గాంచిన 'బిహ్జాదు' ను చూచాడు. బాబరు, చిత్రకళలో, మంచి అభిరుచి కలవాడవటంచేత, అతని చిత్రాలను చూసి, అతని కౌశలానికి అచ్చెరువొందాడు. తన కొలువుకు పిలిచాడు. ఏదిఏమైనా బాబరు కానీ, దేశభ్రష్టుడైన, అతని కొడుకు హుమాయూన్ కానీ, ఎక్కువ ప్రశంసనీయమైన చిత్రకళాసేవ చేయలేకపోయారు. అది అల్లా ఉన్నప్పటికీ, హుమాయూను కూడా తండ్రివలెనే, తను పర్షియాలో నున్నప్పుడు, పర్షియన్ చిత్రకారులైన మీర్ సయీద్ అలీ, ఖ్వాజా అబ్దుల్ సమద్, అనువారిద్దరిని చూచి, వారిని భారతదేశానికి తీసికొనివచ్చి, తన ఆస్థానంలో నియమించాడు. వారిద్దరికీ, ఇస్లామిక్ నాయకుడైన అమీర్ హమ్జా—చరిత్రను చిత్రించవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు. వారికి సహాయంగా మరొక యేభై మంది చిత్రకారులను నియమించాడు. వారిలో చాలా మంది హిందూ చిత్రకారులు కూడా ఉన్నారు. ఆ చిత్రరచన అంతా, వస్త్రంమీద చేయవలసివచ్చింది. ఆ సంపుటిలో చిత్రించిన చిత్రాలు రెండువేల పైచిలుకు వున్నాయి. ఆ చిత్రరచన జరుగుతున్న సమయంలో అదొక 'కళాకేంద్రం' గా కొనియాడబడిందట. చాలామంది భారత చిత్రకారులు, పర్షియన్ శైలిని అలవర్చుకొన్నది అప్పుడేనని తెలుస్తుంది. (ఈ చిత్రాలలో కొన్ని ఇంకా ఇప్పటివరకూ దక్షిణ కెన్సింగ్టన్ మ్యూజియమ్‌లోనూ, బ్రిటిష్ మ్యూజియమ్‌లోనూ భద్రపరుపబడినవి).

అసలు పర్షియన్ చిత్రశైలిలో ప్రత్యేక వ్యక్తిగత విశేషమేమంటే, సాంస్కృతిక రచనలలోని వర్ణనలను చిత్రించటం, అందులో, వర్ణనలో ఉన్న ప్రతి ఒక్క అంశం, తుచతప్పకుండా రేఖలలోనూ వర్ణసంకలనంలోనూ అభివర్తించటం; అందులోనూ, ఎక్కువ అలంకారికమైన రచన, అతిప్రకాశవంతమైన రంగులూ, మామూలుగా కానవచ్చే, సాంకేతికమైన దృశ్యపు అంశాలు,—వెనుక ఎత్తైన కొండలు, గుంపు గుంపులుగాఉండే చెట్ల ఆకులూ మొదలైనవి. అందులో మరింకో ప్రత్యేకత, మనుష్య చిత్రాలలో ఒకేమాదిరి భావప్రదర్శన—తినాచీలు చిత్రించటంలోనూ, సందిగ్ధమాదిరి అలంకారాలు చిత్రించటంలోనూ, పర్షియన్ అలంకారికరీతి కనపడుతుంది. ఆకాశంలోని మబ్బులు, చిత్రించటంలో చీనా చిత్రశైలీ—పూలూ, మొక్కలూ చిత్రించటంలో మీదు మిక్కిలియైన అలంకరణ కనుపించుతుంది. ఆ అలంకరణవైచిత్రితో చిత్రకారుడు చూపరుని మామూలు జగత్తునుంచి, ఒక అలంకారిక 'స్వర్గధామానికి' కొనిపోతున్నట్లనిపిస్తుంది.

హమ్జా జీవితచరిత్ర ఆధారంగా రచించిన చిత్రాలను అసలు పర్షియన్ చిత్రశైలితో పోలిస్తే, కొన్ని విషయాలలో—అనగా వస్త్రధారణ మొదలగు ముఖ్యవిషయాలు మినహాయించి, మిగతా తరహాలలో—చాలా భేదాలు కనిపిస్తవి. అనేకమంది మనుష్యుల సమీకరణ ఆ చిత్రాలలో కనిపిస్తుంది ఆ విధమైన చిత్రణ అనేక సంప్రదాయాల కలగాపులగంగా కూడా కనుపించుతుంది. వర్ణసంకలనం కూడా అంత ముదావహంగా ఉండదు. చెట్టూ చేమా, చిత్రించటంలో అదో ప్రత్యేకత కనబరచినా, మామూలు పర్షియన్ శైలికి విభిన్నంగా ఉంటుంది. ఆవిధంగా అక్బరు కాలంలో రచించిన చిత్రాలన్నీ ఒక విభిన్న తత్త్వాన్ని, చూపించినవి. అందులోనూ భారత చిత్రకారులు మరీ స్వేచ్ఛావృత్తిని కనబర్చారు.

అక్బరు మొగల్ చక్రవర్తులలో అగ్రగణ్యుడు తన తండ్రినుంచి రాజ్యపాలన నందుకొన్నది 1556 లో అనగా అతని పదమూడవ యేటనన్నమాట. అతని పరిపాలనాచాతుర్యంవల్ల, అతడు రక్షణ, పరిపాలనా శాఖలను అద్భుతమైన సహిష్ణుతతో నడుపు

కుంటూ ఏభై యేళ్లు నిర్విఘ్నంగా రాజ్యపాలన సాగించాడు.

అక్బరు నియోగించిన చిత్రకారులకు కళా సాధన చేయటానికి, అనేక మహావకాశాలు లభించినవి. అక్బరుకూడా తన యౌవనదశలో మంచి ప్రవీణులైన చిత్రకారులవద్ద కళాసాధన చేశాడు. అతడు పర్షియన్ సారస్వతంలో అనేక వ్రాతప్రతులను సేకరించి సచిత్రం చేయించాడు. అతడు నియమించిన చక్కని వ్రాయసగాళ్ళు, సూక్ష్మరూపంలో చిత్రాలను రచించే నేర్పరులూ ఇతర కళాకారులూ, పర్షియన్ ఉద్గ్రంథాలనూ భారతీయ గ్రంథాలనూ, తిరిగివ్రాసి, వాటిని సచిత్ర సంపుటాలుగా చేసి, మంచి అలంకరణలతో రూపొందించి, ఎంతో సేవచేశారు. అదేకాకుండా చక్రవర్తి తాలూకు ప్రకటనపత్రాలు, — 'అక్బరునామా' మొదలైనవాటిని అలంకరించటం, చక్రవర్తి పూర్వీకుల మూర్తిచిత్రాలను తయారుచేయటంకూడా కొనసాగించారు ఆవిశంగా ఆ కాలంనాటి ప్రసిద్ధవ్యక్తుల మూర్తిచిత్రాల తాలూకు 'ఆల్బములూ,' ఇతర సచిత్ర గ్రంథాలూ, జంతు పక్షిజాతుల చిత్రాలూ సచిత్ర కథా సంపుటాలూ ఇంకా ఎన్నెన్నో కళా చాతుర్యాన్ని చాటి చెప్పేవి లభ్యమవుతవి. అక్బరు పరిపాలన తాలూకు ప్రకటన పత్రికలలో పాలకుని జీవితచరిత్రనూ, అతని దర్బారు, అతని సేనతాలూకు వివరాలు ఎంతో ప్రజ్ఞతో చిత్రీకరింపబడినవి. ఈ రూప చిత్రాలలో చిత్రకారుని విశ్రాంతినెరుగని పనితనం, తద్వారా చక్రవర్తికిగల కళాతృష్ణ మనం గమనించగలం. చక్రవర్తీ, ఆయన దర్బారూ, ఇతర రాచరిక విషయాలే కాకుండా, చిత్రకారులు ప్రకృతిని కూడా, విరివిగా చిత్రించిన వైనం అనేక జంతు చిత్రాలద్వారా, 'పసులకాపరుల' చిత్రాలద్వారా, 'శ్రామికుల' చిత్రాలద్వారా, తెలుస్తుంది. వారు మొత్తంమీద, కేవలం దర్బారు విషయాలకే పనికట్టుకు కూర్చున్నవారు మాత్రం కాదు. ప్రకృతిలో వారికి దృగ్గోచరమైన ప్రతి చిత్రాన్నీ స్వేచ్ఛగా అభివర్ణించి రచించారు. ఆస్థానపు రాణులను చిత్రించటానికి మాత్రం వారికి ఎక్కువ అవకాశం లేకపోయింది.

అక్బరు ఆస్థానంలో పనిచేసిన చిత్రకారులు, నూటయాభైమంది ఉన్నట్లు వారివారి పైనవున్న సంతకాలద్వారా తెలుస్తుంది. వీరిలో హిందువులే అధికసంఖ్యాకులు. దానికి తార్కాణంగా అబుల్ ఫజల్ — 'అక్బరునామా' సంపాదకుడు — వారిని అభినందిస్తూ, వ్రాసిన విషయం ఉంది. ఈ హిందువుల్లో అగ్రకులాలకి చెందినవారు ఎక్కువ లేరు. చాలామంది జీవికకై పశ్చిమభారతంనుంచి వచ్చినట్లు తెలుస్తుంది. ఏమైనా అక్బరు, భారతదేశంలో అతిప్రవీణులైనవారినే ఏరి తన ఆస్థానంలో పనికి నియమించాడనేది సత్యం.

ఇస్లాంమతంలో ఒక అభ్యంతరం ఉందట. అదేమంటే, చిత్రకారులు 'సృష్టికర్తను' తమ చిత్రాలలో వ్యక్తీకరించి న్యూనతపరచకూడదని! కాని అక్బరు ఈ మూఢనమ్మకాన్ని పూర్తిగా విస్మరించి, తన చిత్రకారులకు పూర్తి స్వేచ్ఛ నిచ్చాడు. అంతే కాకుండా తన అభిప్రాయానికి సమర్థనగా చిత్రకారుడు సృష్టికర్తను తన దివ్యాదర్శంగా పెట్టుకొనే, పునఃసృష్టి సాగిస్తున్నాడని వాదించాడు. ఇదే అతని నిశ్చితమైన ఉద్దేశ్యమై యుంటే, మనం ఊహించిన దానికన్న సువిశదమైన మతేతర వ్యక్తిత్వంగల చిత్రాలు, ఎక్కువగా సృష్టింపబడిఉండేవని చెప్పవచ్చును. మొదటినుంచీ, మొగల్ చిత్రరచన, వైవిధ్యంతోనే రచింపబడుతూ వచ్చింది. హిందువులు గాని, ముసల్మానులు గాని క్రైస్తవ మతబద్ధమైన యూరపుదేశంలోవలె కాని లేక ప్రాచీన బౌద్ధకళాకౌశలవలె కాని, ఒక నిశితమైన మతరక్షణ కింద, తాము పనిచేస్తున్నామనే ఊహలో ఉండేవారు కాదు. ఉభయులూ వారి ఇచ్ఛప్రకారం వర్ణన కొనసాగించవచ్చును కదా. అనగా దృశ్య వర్ణనలో అభిరుచియున్నవాడు దృశ్యవర్ణనలోనే సాధనచేయగల్గేవాడు. లేక సామాజిక వర్ణనలో అభిరుచియున్నవాడు అందులోనే సాధన చేయగల్గేవాడు. చాలా కాలంవరకూ, పర్షియన్ చిత్రశైలిలోనున్న కొన్ని సంప్రదాయ సూత్రాలు, జహంగీర్ పరిపాలనా సమయంలో చాలా భాగంవరకూ కొనసాగింపబడినా క్రమంగా ఆ పద్ధతి అదృశ్యమయింది. ఎల్లాగయినా అక్బరు కాలంలోని ప్రతి చిత్రాన్ని 'పర్షియన్' సంప్రదాయంక్రింద జమచేయటానికి వీల్లేదు...... పర్షియన్ నమూనా చిత్రాలు భారత చిత్రకారులకు మార్గదర్శకాలయినవి. దానివల్ల వారి పనితనంలో మరింత పదును వచ్చింది. అంతేకాని పూర్తిగా పర్షియన్ శైలి అనరాదు.

'అక్బరునామా' సంపాదకుడు చక్రవర్తి వినియోగించిన చిత్రకారుల కళాప్రతిభను ఉగ్గడిస్తూ, "వీరి చిత్రాలు ప్రపంచంలో ప్రఖ్యాతి చెందిన తదితర ఏ పాశ్చాత్య చిత్రకారుల చిత్రాలతోనైనా సరితూచదగినవి" అని పేర్కొన్నాడు.

ఆ విధంగా పాశ్చాత్య కళా ప్రాబల్యం నెమ్మదిగా చక్రవర్తి సంస్థానంలోకి ప్రాకింది. అంతకు పూర్వం లేని మూర్తి చిత్రాలలో, సరియైన 'కొలత,' ప్రకృతి చిత్రాలలో దృష్టి శాస్త్ర ప్రకారం (*Perspective*) సరియైన వర్ణన మొదలైనవి, ఆ తరువాత సంస్థానపు చిత్రకారుల పనిలో కనిపింపసాగినవి. ఆకాశం మేఘావృతమై యున్నప్పుడు ఆ విధంగా నే చిత్రించగల్గటం, ఉషస్సూ, సాయం సంధ్యారాగాలను తుచ తప్పకుండా ప్రతిబింబించటం క్రమక్రమంగా వారు నేర్చుకున్నారు. వారు గీచిన ప్రతి చిత్రంలోనూ జీవం తొణికిసలాడజేశారు. ఇదివరలో కేవలం ఒకేరకమైన ముఖాలను చిత్రించిన వారు, పాశ్చాత్య చిత్రశైలి ప్రాబల్యంవల్ల, వివిధ రూపాలను వ్యక్తిగత విశేషాలతో సహా, ముచ్చటైన రేఖలలో అభివర్ణించగల్గారు. ఏది ఎల్లాఉన్నా భారతీయమైన, దేశీయమైన, సంప్రదాయ చైతన్యాన్ని మాత్రం వారు కోల్పోలేదు. మామూలుగా, స్త్రీ చిత్రం వారు గీచినప్పుడు, లావుగా, పొట్టిగా గుమ్మటం లాగానే చిత్రిస్తూ వాటిలోకూడా ఒక సంచలనాన్ని సృష్టించగల్గారు!

అక్బరు చక్రవర్తికి, పాశ్చాత్యశైలితో ఎల్లా సంపర్కం కల్గిందంటే, 'పోర్చుగీసు' 'జెసూటులు' భారతదేశానికి మతప్రచారానికి వచ్చి, వారితో పాటు, కొన్ని సచిత్ర గ్రంథాలనూ, మంచిమంచి చెక్కడుపని చేసిన ప్రతిమలనూ తెచ్చారు. వారిని అక్బరు తన ఆస్థానానికి ఆహ్వానించి ఆదరించి, ఆ చిత్రాలనీ, ఆ ప్రతిమలనీ చూచి, వాటిలోని పనితనాన్ని ఎంతో మెచ్చుకున్నాడు. వెంటనే ఆ పద్ధతిలో తన చిత్రకారులను పనిచేయమన్నాడు. వాటినే త్రిప్పి వ్రాయమన్నాడు. అక్బరూ, అతని కొడుకు జహంగీరూ, ఇద్దరూకూడా చిత్రకళ యందు నిష్పాక్షికమైన అభిరుచికలవారు. ఇతర మత సంబంధమైన చిత్రాలను తమకు బహూకరించినప్పుడు, ఆనందంతో స్వీకరించారు. వాటితో వారి సౌధాలను అలంకరించారు. తరువాత, జహంగీరు హయాములో, మొదటి జేమ్సు రాయబారియైన సర్ థామస్ రో, జహంగీరు అభిరుచిని గమనించి, యూరపులోని ప్రఖ్యాత చిత్రకారుల రచనలనేకం సేకరించి, జహంగీరుకి వాటిని బహూకరించి, తన పరిచయాన్ని చనువుగా మార్చుకున్నాడు! ఈ పద్ధతిని మిగతా సంస్థానాధిపతులు కూడా అనుసరించారు! ఏమైనా ఆ కాలంలో పాశ్చాత్యుల చిత్రాలు మనవారిని బాగా ఆకర్షించినవి. ఆ చిత్రాలకు మరింకా ఘనమైన ప్రాపకం సంస్థానంనుంచే లభించింది. ఈ ఉదంతాన్ని గూర్చి, పోర్చుగీసు ఫాదిరి అయిన గరీరో తన రచనలో ముఖ్యంగా పేర్కొన్నాడు.

జెసూటులు, ఆగ్రానగరానికి, రోమునగరపు 'మడోనా' చిత్రం తాలూకు నకలును తెచ్చి, తమ చర్చిలో దానిని ఆకర్షవంతంగా ప్రదర్శించారు. ఆ చిత్రం అశేషజనాన్ని ఆకర్షించింది. ధనవంతులేమి, దరిద్రులేమి, రోజూ, మిక్కుటంగా వచ్చి దానివైపు మాటలేక వినమ్రులై తదేకంగా చూచారట. దుఃఖముగ్ధులయ్యారట! చివరికి ఆ చిత్రాన్ని, అక్బరు ఎదుటకు తీసికొనిపోగా, ఆయన నిర్విణ్ణుడై దాని యెదుట మోకరిల్లి, ఆవేశపూరితుడయ్యాడట? ఈ వర్ణనవల్ల, మనకు అది అతిశయోక్తి అనే సంగతి వెంటనే తట్టకమానదు. అతిశయోక్తి మినహాయింపు చేస్తే, కొంతైనా ఇందులో సత్యం లేకపోలేదు. మెడోనాలో ఉన్న భావశబలత, అంత సజీవంగా వర్ణింపబడటం, మనవారిలో కూడా నిజమైన సంచలనాన్ని కలిగించియుంటుంది. ఆ మాటకొస్తే, మన అజంతాచిత్రాలలో జీవం భావం ఉట్టిపడేట్లు లేవూ? మిగతా చిత్రాలలో, శిల్పప్రతిమలలో దివ్యజ్యోతి వెలుగలేదూ?...దీనిని బట్టే మన భారతీయులలోని సహిష్ణుత, నిష్పాక్షికమైన అభిరుచి కొనియాడదగియున్నది.

అక్బరు హయాములో తయారయిన చిత్రాలన్నీ దాదాపు ఆయా చిత్రకారుల సంతకాలతోనే యున్నవి. కాకపోతే, కొన్ని చిత్రాలపుట్టుక మాత్రం ఇంతవరకూ తెలియరాలేదు. బహుశః ఆ చిత్రకారులు తమ వ్యక్తిత్వాన్ని తెలుపదలుచుకొనియుండకపోవచ్చును. ఒక్కొక్కప్పుడు, కొందరు చిత్రకారులు కలిసి, ఒకే చిత్రాన్ని రచించటం కూడా కద్దు...

జహంగీరు పరిపాలనలో, మొగల్ చిత్రశైలి, దాని అత్యున్నతస్థాయి నందుకొన్నది. ఇతని హయాములో చిత్రించిన చిత్రాలలో అక్బరు హయాములో చిత్రించిన చిత్రాలలో నున్న ఆ హడావుడి, తొందర, సరిగా చెప్పాలంటే, విద్యుత్తువంటి ఒక సంచలనం, కనిపించకపోయినా, మరోవిధమైన సాఫల్యరూపం గమనార్హం. ఆ చిత్రాలలోని అలంకారంలో ఒక ప్రత్యేకమైన విశేషం గోచరమవుతుంది. చిత్రకారులలో ఒక నిశిత విమర్శనా శక్తి, సంశోధనా శక్తి, పరిశీలనా శక్తి, అభివర్ణనా శక్తి ఇనుమడించి, జహంగీరు అభిరుచుల కనుకూలంగా అద్భుతమైన సృష్టి చేయించినవి.

జహాంగీరుకు ప్రకృతిదృశ్యాలంటే ఎంతో ప్రీతి. జంతువులూ, పక్షులూ, అన్నా అలాగే. అందువల్ల వీటిని, ప్రజ్ఞతో చిత్రించిన చిత్రకారుని ఆదరించి, వానికి బిరుదునొసగి, అతనిని మంచి ఉచ్ఛస్థితిలోకి తీసికుపోయాడు. అందులో అల్లాంటి మన్ననల నందుకొన్న చిత్రకారుడు, మన్సూరు. ఇతడు అనేక పక్షుల చిత్రాలనూ, జంతువుల చిత్రాలనూ, రచించాడు. ఆ చిత్రాలలో దాదాపు అన్నీ, భద్రంగా ఉన్నట్లే, తెలుస్తుంది. అదేకాకుండా మూర్తి చిత్ర రచనకూడా ఎంతో ఉచ్ఛస్థితిని పొందింది. వ్రాత ప్రతులను సచిత్రం చేయటమనే పనినుంచి, చిత్రకారులను మూర్తి చిత్రరచనవరకు నియోగించిన చక్రవర్తి అభిరుచియే, వేరువేరు విధంగా మారి, చిత్రకారులను ప్రోత్సహించిందనేదానికి తార్కాణము. ప్రతి చిత్రానికీ చుట్టూ ఎంతో అలంకరణ; లతానికుంజాలు కానీ జంతుచిత్రాలు కానీ, పక్షి చిత్రాలు కానీ, ఎంతో ముదావహంగా చిత్రించబడినవి. దాదాపు జహాంగీరు జీవిత విశేషాలన్నీ ఎంతో వాస్తవంగా చిత్రించబడినవి—ఆయన పయనమై గుఱ్ఱంమీద పరివారసహితంగా, ఎక్కడికో వెడుతున్నట్లూ, తన మతగురువువద్దకు ఆశీర్వాదానికి పోతున్నట్లూ, రాణివాసంలోకి వెడుతున్నట్లూ, ఆయన దర్బారూ, తదితర దృశ్యాలూ ఎన్నోఉన్నవి. ఈ చిత్రణలో పాశ్చాత్య శైలిప్రాబల్యం కొంచెంగా లేకపోలేదు కాని, భారతీయ శైలివిశిష్టతమాత్రం పోలేదు...

షాజహానుపరిపాలనలో, చిత్రరచన అంత చురుకుగా జరుగకపోయినా, అక్బరు, జహాంగీరుల కాలంనాటికన్న మరింకోవిధమైన విశేషం శిల్పంలో చూడవగినది. అతడు సృష్టింపజేసిన 'తాజమహల్' దీనికి తార్కాణం. ఆ సమయంలో చాలా రేఖాచిత్రాలు రచింపబడినవనిన్నీ అవి పాశ్చాత్య చిత్రకారుల ప్రావీణ్యం కంటే, మించిన ప్రావీణ్యాన్ని చాటుతవనీ చెబుతారు.

తరువాత, కాలానుగతంగా రాజాదరణ తగ్గుతూ రాగానే చిత్రకారుల దృక్పథంకూడా క్రమంగా మారుతూవచ్చింది. ఇదివరలో రాజసౌధాలలో దృశ్యాలు, రాజుకు ప్రీతియైన చిత్రాలు గీచినవారు, తరువాత, సామాన్య మానవుల కష్టనిష్ఠురాలకు కూడా సానుభూతి చూపిస్తూ, ఆ భావాలనే, చిత్రిస్తూ శైలిని అభివృద్ధిపరుస్తూవచ్చారు. ఈ శైలికి రాజపోషణ ఔరంగజేబుతో సరి. ఔరంగజేబే చిత్రకారులనందరినీ పనినుంచి తొలగించాడు. ఆ తరువాత కూడా చిత్రరచన జరుగుతూ వచ్చినా, క్రమక్రమంగా ఈ శైలికి పతనమే తథ్యమైంది...

---

ఇందలి రేఖాచిత్రాలు, త్రివర్ణ చిత్రాలకు అనుకరణలు.

కథానిక

# మచ్చల శంఖం

"హితశ్రీ"

సిమెంటు చప్టాలా ఉన్న ఇసుక నేలమీద నడుస్తున్నాడు వల్లభరావు, అడుగులో అడుగు వేసుకొంటూ. సముద్రపు నీరు అతని కాళ్ళని తడపటానికి మాటిమాటికి ప్రయత్నించి కవ్విస్తోంది. బీచ్‌లో జనం ఎక్కువమందిలేరు. అక్కడక్కడ విడివిడిగా కొంతమంది కూచున్నారు. ఎదురుగా ఎవరో వొస్తున్నారు, కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ. ఎక్కడికో అర్జంటుగా పోతున్నట్టు గాలి రంయిమని వీస్తోంది. ఆ వాతావరణంలో వల్లభరావు తనకు తెలియకుండానే తన జీవితంలో ఓ పది పదిహేనేళ్ళ కాలం తగ్గించేసుకొ   డు.

రకరకాల నత్తగుల్లల్ని ఒడ్డుమీద పడేసి పోతున్నాయి అలలు. అవన్నీ పరిశీలిస్తూ పరధ్యానంగా నడుస్తున్న వల్లభరావుని ఓ పెద్దఅల చుట్టు ముట్టేసింది. చిరునవ్వు నవ్వుతో అలాగే నుంచున్నాడతను. కాళ్ళక్రింద ఇసుక జారిపోతుంటే తమాషాగా ఉంది. నీళ్ళు వెనక్కిపోతూ అతనికో బహుమానం ఇచ్చాయి. ముచ్చటపడి చేతిలోకి తీసుకొన్నాడు. చిన్న శంఖం. తెల్లగా మెరుస్తోంది. అక్కడక్కడ నల్లటి మచ్చలు అందంగా ఉన్నాయి.

ముందుకు సాగి ప్రక్కకి చూశాడు వల్లభరావు. ఎవరో చిన్న కుర్రాడు తన చేతిలోని శంఖంవైపు చూస్తూ నుంచున్నాడు. కొంచెం దూరంలో వాళ్ళమ్మ కాబోలు కూచుని సముద్రంవైపు చూస్తోంది. వల్లభరావు దగ్గరగా వొచ్చాడు. ఆ కుర్రాడు అతనివైపు కళ్ళెత్తి చూచాడు. మిలమిలా మెరిసే ఆ కళ్ళని చూసి ముచ్చటపడ్డాడు వల్లభరావు. ఆరేళ్ళుకంటే ఉండవేమో. ఎంతో బావున్నాడు. వల్లభరావుకి ఆ కుర్రాడేంచేస్తాడో చూడాలనిపించింది. బహుశ, ఆ శంఖం కావాలని వాళ్ళమ్మతో మారాం చేస్తాడు. ఆ మారాం చూడాలనిపించిందతనికి. కాని అలాంటి పనేమి వాడు చేయలేదు. అలాగే శంఖంవైపూ, వల్లభరావువైపూ చూడసాగాడు. వల్లభరావుకి జాలివేసింది. హృదయంలో ఏదో అనురాగంలాంటి భావం మెరిసింది. దగ్గరగావెళ్ళి శంఖం వాడిచేతికందించాడు. కొంచెంసేపు బెరుకుగా వల్లభరావువైపు చూశాడు వాడు.

"ఫరవాలేదులే, తీసుకో."

ఈ మాటలకి ఆమె తల పక్కకితిప్పి వల్లభరావువైపు చూసింది. కాని అతనామెవైపు చూడలేదు. ఆ కుర్రాడు శంఖం తీసుకున్నాడు. అటూ ఇటూ తిప్పి చూడసాగాడు.

"నీ పేరేమిటోయ్!"

వాడు తలెత్తి వల్లభరావువైపు చూశాడు. ఏదో చెప్పాలని కాబోలు పెదవులు ప్రయత్నించాయి. కాని వల్లభరావుకి ఏ సమాధానమూ వినిపించలేదు. ఆ కుర్రాడిమీద మరికొంచెం ఆదరం కలిగిందతనికి. తను కొత్తవాడాయె!

కొంచెం బుజ్జగిస్తూ అన్నాడు:

"చెప్పు, బాబూ!"

వాడు మళ్ళీ పెదవులు కదిలించాడు. ముఖంలో ఏదో బాధ ప్రస్ఫుటమైంది. కళ్ళలో ఏదో దీనత్వం గోచరించింది.

"చెప్పలేడు-

వేదనాభరితమైన ఆ స్వరం వల్లభరావు హృదయంలో ఇంతవరకూ మృదుమధుర సంగీతం వినిపిస్తున్న తంత్రుల్ని నిర్దయగా తెగ్గొట్టింది. ఆమెవైపు మొదటిసారిగా రెప్పవాల్చకుండా చూశాడు. మూర్తీభవించిన నిరాశలా, నిస్పృహలా, అచేతనంగా ఆమె తలదించుకొని అలాగే కూచునిఉంది. ఆమె మనసులో తుఫాను రేగిందని తెలుసుకోటానికి ఎంతోసేపు పట్టలేదు అతనికి. జాలిగా చూశాడు. వెంటనే అతనికి మరోవిషయం స్ఫురించింది. ఆమె వితంతువు. అతని హృదయం గతుక్కుమంది. ఆవెను వెంటనే మరో సంగతి—బాధాకరమైన మరో కొత్తవిషయం తెలిసింది—ఆమె కట్టుకున్న తెల్లటిచీరకి అక్కడక్కడ అతుకులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇహ ఆమెకేం మిగిలింది. అతని హృదయంలో చెయ్యిపెట్టి కలచినట్టయింది. ఆ చుట్టుప్రక్కల ఆవరించిఉన్న ఆనంద

మయ వాతావరణంతో ఆమె కేమీ సంబంధంలేదు. ఓ నిట్టూర్పు విడిచాడు వల్లభరావు. చూపులు ఆ పసివాడిమీదికి మరలించాడు. మూగజీవి !

అతని హృదయంలో కరుణ కట్టలు తెంచుకొని ప్రవహిస్తోంది. ఆ ఇద్దరు అభాగ్యులవైపూ జాలిగా, సానుభూతితో చూస్తూ ఉండిపోయాడు. అక్కడి నించి కదలిపోటానికి అతనికి మనస్కరించటంలేదు. నిమిషాలు ఒకటివెంట ఒకటి గడిచిపోయాయి.

"ఎవరైనా చూస్తే బావుండదు..."

ఆ హీనస్వరం అతన్ని మేల్కొల్పింది. వెంటనే చిన్నబుచ్చుకొన్నాడు. తను చేసింది పొరపాటే. ఇందాకనే వెళ్ళిపోవాలిసింది. కాని...

వల్లభరావు ఆ పసివాడివైపు మరోసారి జాలిగా చూసి నెమ్మదిగా అడుగు ముందుకేశాడు. అతని మనసులో ఆలోచనల దుమారం రేగింది. అంత చక్కటి కుర్రాడికి ఈ లోపమేమిటి! వాడి చూపులు జ్ఞాపకం వొచ్చాయి. ఆ అమాయిక జీవి భావాలన్నీ అలాగే లోలోపల అణిగిపోవాలి. తన ఉద్రేకాలు, భావాలు మాటల్లో వెలిబుచ్చలేడు. మనసులోనే ఆపుకోవాలి. వల్లభరావు ముఖంలో విషాదం ఆవరించింది ఏ పెద్ద హాస్పిటల్‌లోనైనా చూపిస్తే ప్రయోజనముంటుందేమో! చూపించారో, లేదో! చూపించటానికి డబ్బెక్కడినించి వొస్తుంది? ఆమెని చూస్తే పరిస్థితంతా అర్థమైపోంతుంది. ఎలా మరి? తనేమైనా సహాయంచేస్తే! ఏం సహాయం? ఏ విధంగా చేయటం? హుం—తనకి ఇతరులకు సహాయం చెయ్యగల పటిమ ఎక్కడుంది? తనేమైనా ధనవంతుడా? పరపతి కలవాడా? ఒక సామాన్య మానవుడు. ఏమీ చెయ్యలేని సామాన్యమానవుడు. కాని ..కాని... ఏమైనా చెయ్యాలి.

వల్లభరావు మనసంతా పాడయిపోయింది. కాళ్ళీడ్చుకు పోయినంతవరకూ పోయాడు. చీకటి పడ్డది. అస్పష్టంగా వెన్నెల పడుతోంది. వెనక్కి తిరిగాడు. అవే ఆలోచనలు.

అలా ఆలోచిస్తూ నడుస్తున్న వల్లభరావుకి వెన్నెల్లో మెరుస్తూ కనిపించింది—అదే, ఆశంఖమే. తెల్లగా, నల్లటి మచ్చలతో అందంగా కనిపించేది ఆశంఖమే. వల్లభరావు శంఖం చేతిలోకి తీసుకొన్నాడు. నిస్సందేహంగా ఆశంఖమే. ఇక్కడెందుకుంది? మర్చిపోయి వెళ్ళారా? అతను ముందుకి చూశాడు. కొంచెందూరంలో కనిపించాయి ఆకృతులు—తెల్లటి చీరతో నెమ్మదిగా నడుస్తున్న స్త్రీ—ప్రక్కన చిన్నకుర్రాడు. వాళ్ళే—అనుమానం లేదు. అయితే ఈ శంఖం ఇక్కడే ఎందుకు పడేసి వెళ్ళిపోయారు. మర్చిపోయారా? మర్చిపోటానికి అదేమీ కనిపించనంత చిన్నదికాదు. కావాలనే బుద్ధిపూర్వకంగా ఆమె వొదిలేసి వెళ్ళిపోయింది. ఎందుకు? ఇష్టంలేదా తీసుకోటం? వెంటనే అతనికామె మాటలు జ్ఞాపకం వొచ్చాయి.

"ఎవరైనా చూస్తే బావుండదు—"

ఇందాక ఆ మాటల్ని గురించి తను ఎక్కువగా ఆలోచించలేదు. ఆమె అలా ఎందుకంది? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఆమె అలా ఎందుకనుకోవాలి? తనని అపార్థం చేసుకొందా? మనసులో తను భయపడకపోతే అసలలా అనగలిగిఉండేది కాదు. అవును, ఆమె తనని అపార్థం చేసుకొంది. తన పరిచయంకోసం అలా చేశాడని అనుకొందా?

మనుషులు ఇంత త్వరగా ఎందుకు ఇతరులని గురించి అపోహ పడతారు? అంత అనాలోచితంగా ఎందుకు ప్రవర్తిస్తారు?

వల్లభరావుకి ఓ క్షణం ఏహ్యభావం కలిగింది, ఆమెమీద. కాని మళ్లీ ఆలోచించాడు. తను అనవసరంగా ఆమెను గురించి అపోహపడుతున్నాడేమో ! అదే క్షణాన అతనికి తట్టింది అకస్మాత్తుగా. ఆమెని ఏ విషయంలో ఆక్షేపించటానికి ప్రయత్నించాడో, అదే విషయంలో తనని తను ఆక్షేపించుకున్నట్టయింది.

వల్లభరావు వెంటనే సమాధానం చెప్పుకున్నాడు. తననిగురించి తను వేసుకొన్న ప్రశ్న సమంజసంగా లేదు. ఆ కుర్రాడు ముచ్చటపడితే ఆ శంఖం ఇచ్చాడు. ఆమె తొందరపడి ఉండకపోతే, బహుశ తనింకేమైనా చేతనైన సహాయం చేయగల్గి ఉండేవాడేమో. కాని అలాంటివాళ్లకి సహాయం చెయ్యాలని ముందుకి దూకితే మిగిలేది శ్రమమాత్రమే. ఇతరులు చేసిన ప్రతిపనినీ మరో దృక్పథంలోనుంచి అపార్థం చేసుకొంటే ఎవరూ ఏమీ చెయ్యలేరు. తన సహాయం ఏమీ ఆమె కక్కర్లేదు. మంచిది.

ఆ సమయంలో వల్లభరావుకి చిరుకోపం వచ్చింది. చిరాకు పుట్టింది. ఆ శంఖం ఇవాళ మనసంతా పాడుచేసింది. ఛీ! మొదట ముచ్చటపడ్డాడు కాని చివరకి దానివల్ల జరిగిందిదీ. అతనికి కొంచెం ఆవేశం కలిగింది. బలంకొద్దీ సముద్రంలోకి విసిరేశాడు శంఖం. అతని మనసు కొంచెం తేలికపడ్డది. మళ్ళీ తను సాయంత్రం పొందిన ప్రశాంతత వొచ్చే సూచన కనిపించింది. సముద్రంవైపు అలాగే చూస్తూ

నుంచున్నాడు. వెన్నెల్లో సముద్రం పొంగుతూ కొత్తసౌందర్యం ప్రకటిస్తోంది.

కాని అతనా అవస్థలో ఎక్కువసేపు ఉండ లేకపోయాడు. ఆ పసివాడూ ఆమె, మళ్ళీ అతని స్మృతిపథంలో మెదిలారు. తన కెటువంటి దురుద్దేశమూ లేదని ఆమెకి తెలిసేట్టు చెయ్యాలి. ఆమె పశ్చాత్తాపపడుతుంది. వెంటనే వల్లభరావు చకచక నడిచిపోయాడు. వాళ్ళని నిర్లక్ష్యంగా దాటిపోయాడు.

అలా దాటిపోయిన వల్లభరావుకి ఆమె ఏం చేస్తుందో చూడాలని బుద్ధిపుట్టింది. తన వెనుక వొస్తోందా? తనతో మాట్లాడాలని త్వరత్వరగా వొస్తోందా? ఓరగా చూశాడు. ఆమె కనిపించలేదు. ఆసముద్రపు హోరులో అలికిడికూడా వినిపించలేదు. వెనక్కి తిరిగాడు. ఆమె తనవైపు నడవటం లేదు! ఆశ్చర్యం వేసింది అతనికి. ఆమె వెనక్కి వెడుతోందేం? ఓ క్షణం అతని మతిపోయింది! ఆమె ఏమిటో వెతుకుతోంది. కొంపతీసి, శంఖంకోసమా? అలాగే వుంది. అయితే, ఆమె నిజంగానే మర్చిపోయిందా? తనని చూసి జ్ఞాపకం తెచ్చుకొందికాబోలు.

వల్లభరావులో మళ్ళీ జాలి ప్రవేశించింది. తనకి తెలిసివుండీ, ఆమెనలా వెదకనియ్యటం క్రూరమనిపించింది. గబగబ నడిచాడు ఆమెఉన్న స్థలంవైపు.

"ఏమిటి వెతుకుతున్నారు?"

ఆమె ఉలిక్కిపడ్డది. తలెత్తి అతనివైపు చూసింది. ఆమె ముఖంలోని విస్మయం ఆ అస్పష్ట కాంతిలో కూడా స్పష్టంగా కనిపించిం దతనికి. ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా అతనే అన్నాడు

"శంఖం కోసమేనా?"

ఓ క్షణం ఆమె ఏమీ అనలేదు. కాని వెంటనే తేరుకుని ఏదో అర్థంచేసుకొన్నట్టుగా అతనివైపు చూసి తలతిప్పి అంది—"కాదు."

"మరి దేనికోసం?"

ఆమె సమాధానం ఏమి యివ్వలేదు. ఆమె తటపటాయించటం చూసి వల్లభరావు తను అక్కడికి మళ్ళీ రావటం, ఆమెని ప్రశ్నించటం పొరపాటని ఓక్షణం చింతించాడు.

"ఏదైనా వస్తువు పోయిందా?" అడగకూడదని అనుకుంటూనే అడిగాడు. ఆమె అవునన్నట్టు తల తిప్పింది.

"ఏవిటిది?"

ఆమె సందిగ్ధావస్థలో పడ్డది. ఈసారి వల్లభరావుకి పూర్తిగా తెలిసిపోయింది. ఆమె తననించి ఏదో దాస్తోంది. దాచాలనే ఆమె ప్రయత్నం; కొన్ని క్షణాలు అలాగే గడిచిపోయాయి. ఆమె కుర్రవాడిని దగ్గిరగా తీసుకొని ముందుకు రెండడుగులు వేసింది. వల్లభరావుకి కొంచెం చిరాకూ, కోపమూ కలిగాయి. అసలు సంగతి అతనికి తెలిసింది. తనిచ్చిన ఆ శంఖం అలా అక్కడ వొదిలేసి మళ్ళీ తను వెళ్ళిపోగానే ఇలా ప్రవర్తించటం కేవలం సంకుచితంగా కనిపించకతప్పదు. ఇలాంటి చిన్నవిషయాల్లోకూడ మనుషు లిలా ఎందుకు ప్రవర్తిస్తారు?

"మీరు వెదికేది శంఖంకోసమే అయితే, అది సముద్రంలోకి విసిరేశానని చెప్పటానికి చింతిస్తున్నాను కొంచెం — అసహనంగా అన్నాడు.

ఆమె ఏమీ జవాబివ్వలేదు. అలాగే వెళ్ళిపోతోంది. ఆమె మౌనం అతనికి కొంచెం ఆశ్చర్యం కలిగించింది. మాట్లాడితేనే నోటిముత్యాలు రాలేట్టు ప్రవర్తిస్తోందామె. తన దారిని తను పోదామని ఓక్షణం అనుకున్నాడు. కాని ఆమెని మాట్లాడించాలనే పట్టుదల అకస్మాత్తుగా కలిగిం దతనికి.

"మీ రిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో నా కర్థం కావటంలేదు."

ఆమె ఆగింది.

"ఏంచేశాను." నెమ్మదిగా అంది.

"శంఖంకోసం వెతకటం కాదన్నారు. కాని శంఖం పారేశా ననగానే వెళ్ళిపోతున్నారు. అసలు సంగతి నా దగ్గిర దాచటమెందుకు? నేను మీకేమి అపకారం తలపెట్టే దురుద్దేశంతో లేనని గ్రహిస్తే బావుండును."

ఆమె ఇలాంటి ప్రశ్న ఎదుర్కొనే స్థితిలో లేదు. ఇంత కుండ బద్దలుకొట్టినట్టుగా అతను మాట్లాడుతాడనీ అనుకోలేదు. మాట్లడకుండా అలాగే నుంచుంది.

"మీరు సమాధానం చెప్పగలితే చెప్పండి. ఇష్టంలేకపోతే వెళ్ళండి. కాని, ఈ సమాధానం కోసం రాత్రిం బగళ్ళు ఒకప్రాణి తలబద్దలు కొట్టుకునే పరిస్థితి తప్పించ దలుచుకుంటే ఉన్నది ఉన్నట్టు చెబితే సంతోషం. జీవితంలో మళ్ళీ యిలాంటి సమస్యలు రాకుండా చేసుకొంటాను."

ఆమె నిట్టూర్పు విడిచింది.

"పొరపాటు చేశాను. మీ రిలా మళ్ళీ వస్తారనుకోలేదు." అని మాత్రం అని ఊరుకుంది.

"అయితే ఆ శంఖం బుద్ధిపూర్వకంగానే అలా వొదిలేశా రన్నమాట."

"అవును."

"ఎందుకు?"

"ఈ ప్రశ్నకి సమాధానం చెప్పాలిసి ఉంటుందనుకోలేదు. అలా అనుకొంటే అలా చెయ్యకపోయే ఉందును. కాని మీరు నిర్బంధిస్తున్నారు కనుక చెప్పక తప్పలేదు. కేవలం మీకోసమే అలా చేశాను."

వల్లభరావు తెల్లబోయాడు. అనుకోని పరిణామం ఎదురౌతోంది.

"నా కోసమే."

"అవును. చిట్టిబాబు మాట్లాడలేడని తెలుసుకున్నప్పుడు మీ మనస్సు చివుక్కుమనటం నేను గ్రహించాను. ఆ బాధ నాకంటే ఎవరికి తెలుస్తుంది. నిరంతరం ఇది మీ మనస్సులో ముల్లులా మెసులుందని ఆ క్షణంలో మిమ్మల్ని చూసిన ప్రతివాళ్లూ గ్రహించగలరు. చాలామంది అలాగే బాధపడ్డారు. కాని తరవాత ఎక్కువకాలం వాళ్ళ నా విషయం బాధించలేదు. కాని మీరు బాగా దెబ్బతిన్నారు. ప్రశాంతంగావున్న మనసుకి అకస్మాత్తుగా గట్టిదెబ్బ తగిలింది. ఏమీ మాట్లాడలేకపోయారు. ఏమీ తోచక మిమ్మల్ని మీరే మర్చిపోయారు. అందుకే అలా ప్రవర్తించాను. ముమ్ముందు మానసికంగా చాలా బాధపడతారని భయపడ్డాను. ఏం చేయగలను? మనుషులు కొన్ని విషయాల్లో పూర్తిగా నిస్సహాయులు. ఎంతోసేపు ఆలోచించాను. మళ్ళీ మీరు తిరిగివొస్తే బావుండుననుకొన్నాను. అలాగే వొచ్చారు. దూరంలో చూశాను. ఆ శంఖం అలా వొదిలి వెళ్ళిపోయాను."

ఆమె ఆగింది. వల్లభరావులో పూర్వపు కాఠిన్యం మంచులా కరిగిపోయింది. ఆమె మళ్ళీ చెప్పటం ప్రారంభిస్తుందని కాసేపు ఎదురుచూశాడు. తరవాత నెమ్మదిగా అందుకొన్నాడు.

"ఎందుకు?"

"ఆ శంఖం అలా పడిఉండటం చూస్తే మీరు మూడు పనులు చెయ్యవచ్చు. నా చేతి కివ్వటమో, లేక అలా దాన్ని వొదిలేసి వెళ్లటమో, లేకపోతే సముద్రంలోకి విసిరి పారెయ్యటమో. మూడో పని చేస్తే నా ప్రయత్నం సఫలమైనట్టే."

వల్లభరావు విస్తుపోయాడు. ఆమెమీద అతని కౌతుకంలో ఎంతో గౌరవం కలిగింది. సరిగా ఆమె అనుకొన్నట్టే తను ప్రవర్తించాడు. కాని అతనికో సందేహం కలిగింది.

"అలా ప్రవర్తిస్తే లాభం?"

"వాడి కేదైనా సహాయం చెయ్యకలిగితేగాని మీకు మనసుకి శాంతి ఉండదు. కాని ఏం చెయ్యగలరు? అది మీకు తలకుమించినవిషయం. ఊరికే మథనపడటం తప్ప జరిగేదేమీ ఉండదు. అశాంతికి అంతుండదు. అశాంతి పొందుతున్న మనసు అది తప్పించుకోటానికి ఎంత చిన్న అవకాశం దొరికినా ఉపయోగించుకొంటుంది."

వల్లభరావుకి విషయం పూర్తిగా బోధపడ్డది. ఆమె ఇంకేవో చెప్పబోతోంది. వల్లభరావు సిగ్గుపడ్డాడు. తలవంచుకొని అన్నాడు. "ఇహ చెప్పక్కర్లేదులెండి, తెలిసింది."

ఆమె ఇంకేమీ అనలేదు. అతనూ ఏమీ అనలేదు కొద్ది క్షణాలు అలాగే గడిచిపోయాయి. ఎవరి మనసులో ఏ ఆలోచనలు మెదుల్తున్నాయో ఇద్దరికీ తెలుసు.

వెన్నెల స్పష్టమౌతోంది క్రమంగా. ఆమె సెలవు తీసుకొంది. దూరమైపోతున్న ఆ ఆకృతుల వైపు చూస్తూ అక్కడే నిలబడిపోయాడు వల్లభరావు, హృదయంలోని బరువుతో.

ఆ పసివాడితో సహా ఆమె అదృశ్యమైంది. వల్లభరావు సముద్రంవైపు చూచాడు. వెన్నెల్లో సముద్రం పొంగిపోతోంది. ఓ పెద్ద అల...అతని సమీపంలో నల్లటి మచ్చలుగల తెల్లటి శంఖం— ఆ అపురూప శంఖం వెన్నెల్లో మెరిసింది. అతను సముద్రంవైపు రెండడుగులు వేశాడు. కాని మళ్ళీ ఆగిపోయాడు. మరి కొంచెంసేపట్లో ఆ శంఖం క్రమక్రమంగా నీళ్ళలోకి దొర్లిపోయింది.

వల్లభరావు సముద్రపుటంచునే నడుస్తున్నాడు. ఆమె కోరికప్రకారం జరిగిన సంగతి తను మర్చిపోటానికే ప్రయత్నిస్తాడు. మర్చిపోగలడు కూడా.

# సాతవాహనుల క్రొత్త నాణెములు

## శ్రీ మారేమండ రామారావు

ఆంధ్ర సాతవాహనవంశము దక్షిణాపథమును పాలించిన స్థానిక రాజవంశములలో మొట్టమొదటిది. ఈ వంశముయొక్క చరిత్రము బహు సమస్యలతో కూడి యున్నది. ఈ సమస్యలను పరిష్కరించుట కుపకరించు శాసనములు, నాణెములు మున్నగు చారిత్రక సామగ్రి క్రొత్తది లభించుటలేదు. అందువలన చరిత్రకారు లెవరికి దోచిన సిద్ధాంతములను వారు ప్రతిపాదించుచున్నారు. ఇటీవల కొన్ని క్రొత్తనాణెములు ప్రకటింపబడినవి.[1] వానినుండి కొన్ని విశేషాంశములు తెలియవచ్చుచున్నవి. ఇటీవల నేను కొన్ని వేల సాతవాహన రాజుల నాణెములను పరిశీలించితిని.[2] వానియందు ఎన్నియో క్రొత్తరకముల నాణెములుగలవు ఈ నాణెముల సహాయమున పెక్కు సమస్యలను పరిష్కరింపవచ్చును. వీనిలో పదికమానుల చైత్యముగల 16 నాణెముల నీ వ్యాసమున వర్ణించి వాని ప్రాముఖ్యమును చర్చించుచున్నాను.

సాతవాహనుల నాణెములలో చైత్యముగల నాణెము లొక ముఖ్యవిభాగమునకు చెందినవి. వీనిలో కమానులయొక్క సంఖ్యనుబట్టి భేదములు గలవు. మూడు, ఆరు కమానులుగల చైత్యముండు నాణెము లింతకు బూర్వము ప్రకటింపబడినవి. పదికమానుల చైత్యముగల నాణెముల నింతవరకు నెవరును ప్రకటించి యుండలేదు.

ఈ వ్యాసమున కనుబంధముగ 16 నాణెముల పట్టిక యొకటి చేర్చబడినది. అందు నం 3, 15 ర్లు గల నాణెములు డా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యము గారివి. నం. 6, 7, 8, 12, 13, ర్లు గలవి శ్రీ ప్రయాగ శేషాద్రిశాస్త్రి గారివి. నం. 1, 2, 4, 5, 9, 10, 11, ర్లు గల నాణెములు నావి. నం. 14, 16 ర్లు గల నాణెములు స్థానికులవద్ద నేను చూచి ప్రతికృతులు తీసికొనినవి. ఈ నాణెములన్నియు గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో సుప్రసిద్ధ బౌద్ధ శిథిలములుగల ప్రదేశములలో దొరికినవి. వీనిలో 8 గౌతమీ పుత్రసాతకర్ణివి, 5 వాసిష్ఠీపుత్ర పులోమావివి, 3 గౌతమీ పుత్రయజ్ఞశ్రీవి.[3]

గౌతమీపుత్ర సాతకర్ణి నాణెములలో నం. 1, 2, 3 ర్లు గలవి ఒక తరహాకు చెందినవి. వీనిపై గాంచనగు శాసనముయొక్క పూర్తిపాఠము "రఞో గోతమి పుతస సిరి సతకణస" అని యుండును. ఈ పాఠమీ రాజుయొక్క శాసనములయందును,[4] ఇతర నాణెములపైనను కలదు. నం. 4. రు. నాణెముపైగల శాసనమును "సిరి సతకణస" అని ఏర్పరుపవచ్చును. ఈ పాఠమీ రాజు నాణెములలో గజచిహ్నముగల వానిపై తరచుగ గన్పించును. నం. 5. రు నాణెముపైగల "తస స" అను పాఠమును "గోతమి పుతస సిరి సతకణస" లేక "గోతమిపుతస సతకణస" అని పూర్తి చేయవచ్చును. నం. 7, 8. ర్లు గల నాణెములమీది శాసనము పూర్తిశాసనమునకు హ్రస్వరూపము. వాసిష్ఠీ పుత్రపుళుమావియొక్క నాణెములలో నం. 12, 13, ర్లు గల వానిపైగల శాసనపాఠమును "రఞో వసిఠిపుతస సిరి పుళుమావిస" అని పూర్తి చేయవచ్చును. "సిరి" ముందుండినచో "రఞో సిరి వసిఠిపుతస" అను రూప మూహ్యమగును. నం, 9, 10, 11 ర్లు గల మూడు నాణెములపైనను "సమిస" అను బిరుదము గలదు. ఈ బిరుదముగల నాణెములలో ఒడచిహ్నముగల నాణె మొక్కటి మాత్ర మింతవరకును ప్రకటింపబడినది.[5] ఈ "సమి" లేక "స్వామి" యను బిరుదము పుళుమావి శాసనములలో కొన్నిటి

---

1. వీనిలో చాల భాగము *Journal of the Numismatic Society of India* లో ప్రకటింపబడినవి.

2. ఇవి మదరాసు, హైదరాబాదు, బొంబాయి మ్యూజియములలోనివి. ఈ నాణెముల పట్టికలు త్వరలో ప్రకటింపబడును.

3. ఈ వ్యాసమునం దీనాణెములను ప్రకటింప ననుమతించిన పై మిత్రులకు నా కృతజ్ఞత.

4. *Ep. Ind. vol VIII. Nasik ins. Nos. 4 & 5,*

5. *J. N. S. I. vol III. P. 43.*

యందు కనిపించుచున్నది.[6] యజ్ఞశ్రీ నాణెములలో నం. 14, 15 ల్లు గలవి శాసనముయొక్క పూర్తి పాఠములోని భాగములుగలవి. నం. 16 రు గల నాణెము పైగల శాసనము పైదానికి హ్రస్వరూపము.

ఈ నాణెములు సాతవాహన వంశచరిత్రమునకు మిక్కిలి ముఖ్యములైనవి. లండను బ్రిటిష్ మ్యూజియమునందు చైత్యముగల సాతవాహన నాణెములు కొన్ని గలవు. వీనిలో కొన్ని గౌతమీపుత్ర సాతకర్ణివి, మరికొన్ని గౌతమీపుత్ర యజ్ఞశ్రీవి. అయినను ఈ నాణెముల పట్టికను ప్రకటించుచు రాప్సన్ అను పండితుడీ నాణెముల నన్నిటిని యజ్ఞశ్రీవిగనే పరిగణించెను.[7] అందువలన నా పట్టికలో గౌతమీపుత్ర సాతకర్ణివి అని నిస్సందేహముగ చెప్పదగిన నాణె మొక్కటియు లేదు. ఈ రాజు శాసన మొక్కటికూడ నాంధ్రదేశమున లభింపలేదు. ఈ కారణమునుబట్టి చాలమంది పండితులు గౌతమీపుత్ర సాతకర్ణి యాంధ్రదేశమును పరిపాలింప నేలేదని యొక విపరీతసిద్ధాంతమును ప్రతిపాదించి యున్నారు. ఈ రాజు నహపానుడను క్షహరాటవంశపురాజు యొక్క వేలకొలది వెండినాణెములను తన నామ చిహ్నములతో పునర్ముద్రించెను. ఈ చిహ్నము చైత్యము. ఇందు మూడు, ఆరు, పది కమానుల చైత్యము లున్నవి.[8] క్షహరాటుల నీరాజు తన 18 వ రాజ్యసంవత్సరమున జయించెను. అంతవరకు నీతడు దక్షిణాపథ ప్రాజ్మధ్య భాగములను, అనగా ఆంధ్ర దేశమును పరిపాలించెనని శాసనములు తెలుపుచున్నవి.[9] అటుచో నితడు పునర్ముద్రణమున నుపయోగించిన చిహ్నము లంతవరకును తాను వేయించిన నాణెములమీదివి కావలెను కదా! దీనినిబట్టి మూడు, ఆరు, పదికమానుల చైత్యముగల గౌతమీపుత్ర సాతకర్ణి నాణెము లెన్నియో ఆంధ్రదేశమున వ్యాప్తియందుండి యుండవలెనుకదా! ఈ సాతకర్ణి యొక్క మూడు, ఆరు కమానుల చైత్యముల నెన్నిటినో నేనిటీవల పరిశీలించితిని. ఈ వ్యాసముయొక్క అనుబంధములోని పట్టికలో కి పదికమానుల చైత్యముగల నాణెములు గలవు. ఇందువలన నీ సాతవాహన చక్రవర్తి యాంధ్రదేశమును పాలింపలేదను వాదము సత్యదూరమగుచున్నది.

డా॥ డి. సి. సర్కారు అను పండితుడు సాతకర్ణి యాంధ్రదేశమును పాలింపలేదనుటతో నాగక నతని కుమారుడును, వెనువెంటనే రాజ్యమునకు వచ్చినవాడునగు పులుమావి యాంధ్రదేశమును జయించెనను విస్మయజనకమగు సిద్ధాంతమును ప్రతిపాదించెను.[10] ఈ వాదమున నీయన చూపిన యాధారములివి—(1) సాతకర్ణి శాసనములు గాని, నాణెములు గాని యాంధ్రదేశమున లభింపకపోవుట (2) పులుమావి శాసనములు లభించుట (3) ఓడ చిహ్నముగల పులుమావి నాణెములు మదరాసు కడలూరులమధ్య సముద్రతీరమున దొరకుట. ప్రాగాంధ్రమునను, తెలంగాణాయందును లభించిన సాతకర్ణి యొక్క కొన్ని వేల నాణెములను నేను చూచితిని. ఆ నాణెములు దొరకిన స్థలములయందే, వానితో కూడియే పులుమావి నాణెములును లభించినవి. ఈ వ్యాసముయొక్క అనుబంధమున 1, 10, 4, 12, 2, 9, నంబర్లుగల నాణెము లిట్టివే. వీని మూలమున డా॥ సర్కారు వాదము ఖండింపబడుచున్నది.

ఇట్లు సాతకర్ణి యాంధ్రదేశము నేలలేదనియు, పులుమావి యాంధ్రదేశమును జయించెననియు ప్రతిపాదించు రెండు విపరీత సిద్ధాంతములు సరియైనవి కావనియు, గౌతమీపుత్ర సాతకర్ణియు నతనితరువాత వచ్చిన రాజులందరు నాంధ్రదేశము నేలిరనియు ఈ నాణెములు నిరూపించుచున్నవి.

---

6. *Ep. Ind; vol VII. Karla ins. no. 14; Burgess—Buddhist stupas of Amaravati and Jaggayyapeta. ch. XII. p. 100.*

7. *Rapson - Cat. of Indian Coins pl. V & VI.*

8, *JBBRAS. vol. XXII p. 241.*

9. *Cf. Ep. Ind. vol. VIII. Nasik ins. no. 4 and no. 2.*

10. *New Imperial History of India vol. II. Ch. 34.*

# సాతవాహనుల కొత నాణెములు - అనుబంధపట్టిక

| నెం. | లోహము | ఆకారము | దొరకిన స్థలం | ఒక వైపు | రెండవ వైపు |
|---|---|---|---|---|---|
| 1 | సీసము | గుండ్రని | చేబ్రోలు | పైన చంద్రవంకగల పది కమానుల చైత్యము—సతకణస రజ్ఞో గో. | ఉజ్జయినీ చిహ్నము |
| 2 | ,, | ,, | అమరావతి | దళసరి కమానులుగల పైవిధమగు చైత్యము—పుతసరజ్ఞో గో. | ,, |
| 3 | ,, | ,, | ,, | దిమ్మవంటి పైవిధమగు చైత్యము—రజ్ఞో గోతమిపుతస | ,, |
| 4 | ,, | ,, | ధరణికోట | ముద్దలవంటి కమానులు గల పైవిధమగు చైత్యము—సిరిసతక. | ,, |
| 5 | ,, | ,, | ,, | ముద్దలవంటి కమానులుగల చైత్యపు క్రింది భాగము.—తసస. | ,, |
| 6 | ,, | ,, | మాడుగుల | ఎడమవైపు కమలము, కుడివైపు శంఖము, పైన చంద్రవంక గల చైత్యము—రజ్ఞో సతకణస | ,, |
| 7 | ,, | ,, | గుడివాడ | పైవిధమగు చైత్యము—రజ్ఞో సతకణస | ,, |
| 8 | ,, | ,, | ,, | చిహ్నములు లేని చంద్రవంక గల చైత్యము--సతకణస | ,, |
| 9 | ,, | ,, | అమరావతి | దళసరి కమానుల చైత్యము—పుతస సమిస వసతి. | ,, |
| 10 | ,, | ,, | చేబ్రోలు | పై విధమగు చైత్యము—తస సమిస వసతి. | ,, |
| 11 | ,, | ,, | మాడుగుల | పై విధమగు చైత్యము—(మిస) వసతి పు. | ,, |
| 12 | ,, | ,, | ధరణికోట | సాధారణమగు చైత్యము—సితిపుతస సిరి | ,, |
| 13 | ,, | ,, | అమరావతి | పై విధమగు చైత్యము—సితిపుతస. సిరి. | ,, |
| 14 | ,, | ,, | బుద్ధాం | కమానులు గీయబడిన దిమ్మవంటి చైత్యము, ఎడమవైపు శంఖము, కుడివైపు కమలము—సతకణస రజ్ఞో గోతమిపుతస సిరి యజ్ఞ. | ,, |
| 15 | ,, | ,, | అమరావతి | పైవిధమగు చైత్యము—తస సిరి యజ్ఞ స. | ,, |
| 16 | ,, | ,, | ఆగుర్రు | పైవిధమగు చైత్యము—యజ్ఞ సతకణస రజ్ఞో | ,, |

కథానిక

# పరిష్కారం

శ్రీ కె. వి. రమణ

సూర్యుడు చచ్చిపోయినట్లు లోకమంతా చీకట్లు క్రమ్మాయి. తరుముబడే దొంగల్లా పక్షులన్నీ గూళ్లను జేరుకుంటున్నాయి. స్వాధీనం తప్పిన కండరాలను కూడకట్టుకొని గుమ్మంలో కూలబడ్డాడు రామం. ఆ చీకటి జుట్టు విరజిమ్ముకొన్న రాక్షసిలా కనుపించింది. ఆమె వెనుక కృష్ణయ్యలు చప్పట్లు చరుస్తున్నట్లు భావించాడు. అసలు తనీరోజున కృష్ణయ్యదగ్గరికి పోకపోయినా బాగుండునని బాధపడ్డాడు. దూరంగా క్షణమాత్రంలోనే ఎర్రటి మంటలు లేచాయి. ఏదో పల్లె తగలబడుతోంది. వూళ్లో జనమంతా తండోపతండాలుగా వీధుల్లోకి వచ్చి ఆ దృశ్యం చూస్తున్నారు. కొంతమంది కర్రలు ముంతలు పుచ్చుకొని ఆ దెసకు పరుగులు దీస్తున్నారు. అన్నీ తాటాకు కొంపలు. ఏమీ చప్పుడు కాకుండా కాలిపోయాక ఆకాశం క్రమంగా ఎరుపుతగ్గి నల్లటి పొగతో నిండిపోయింది. కాలిన దూడల అర్పులు మనుష్యుల రోదన, మంటల నార్పే యోధుల అట్టహాసాలు అన్నీ పొగతో కలసి ప్రయాణం చేస్తున్నాయి.

పదిరోజులక్రితం మాణిక్యం చితిమీదినుంచి పొగ యిల్లాగే వచ్చింది. పొగలోనుంచి తనని 'ఒక్కసారి చూసిపొమ్మని' మాణిక్యం బ్రతిమాలుతున్నట్లనిపించింది. తనకీ ఆమెకీ మధ్య మంచుపొగ అడ్డు. ఆ తెర తొలగించి ముందుకుపోయే ధైర్యం, ఆమె బ్రతికిఉండగా తనకి కలుగలేదు. ఆమె ముందుకు వచ్చి ఈ పొగలో కలసిపోయింది. పోతూ, ఈలోకంలోని కాకులమేతకు తన కూతుర్ని విడచిపోయింది. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూచాడు రామం. ప్రక్కయింటి సుబ్బయ్య మీసం మెలేస్తూ కళ్లు తిప్పుతూ అన్నాడు. "యింకా ఇక్కడే వున్నావేం. మాణిక్యం కూతురు ఒకర్తెగా అయింట్లో వుంట." రామానికి ఆమాటల్లో పోటు అర్థమవకపోలేదు. మాణిక్యం జబ్బులో వుండగా, సుబ్బయ్య ఆమెను చూడ్డానికని వంకపెట్టుకొని యింటికి వెళ్ళి ఆ అమ్మాయిచేయి పట్టుకొని, చీవాట్లు తిని బయటికి వచ్చిన సంగతి రామం మరచిపోలేదు. కాని సమాధానం చెప్పే ఓపిక లేదు. వెకిలిగా నవ్వుకొంటూ కండలు ఝళిపించుకొని మంటలు ఆరిన దెసకి నడిచాడు సుబ్బయ్య. ఈ సుబ్బయ్యలు కృష్ణయ్యలు, వాళ్ల మేడలుమాత్రం శాశ్వతంగా వుండిపోతాయి. ఎన్ని భూకంపాలు వచ్చినా, ఆకాశం మంటలు మండినా వాళ్లలోకాని కేమీ ప్రమాదం రాదు. కడుపులో ఆకలిమంటల వేడి హెచ్చుతోంది. హృదయంలో ద్వేషాగ్ని; పాలిపోయిన మొహంలో కళ్లు నిప్పు వున్నాయి. ఈ మంటలు మనిషిని బూడిద చెయ్యవు. చావకుండా, బ్రతకలేకుండా మాత్రం చేస్తాయనుకొన్నాడు. బడబాగ్ని యింతే. చుట్టూ నీరువున్నా అది వెలుగుతూనే వుంటుంది. తను ఈరోజున కృష్ణయ్యయింటికి వెళ్ళకపోయినా, కృష్ణయ్యే మరోరోజున తనదగ్గరకివచ్చి తనపని కాస్తా నెరవేర్చుకుపోయేవాడే!

మధ్యాహ్నం రోహిణీ కార్తె ఎండలో కృష్ణయ్యదగ్గరకి ప్రయాణం కట్టాడు. పాటిమన్ను, మెత్తగానే వుంటుంది. లోపలికి పాదాలు దించుకుపోగానే, కౌగలించుకొని పీక నులిమినట్లుగా, మాడ్చేస్తుంది. పాదాలు బొబ్బలు కడుతున్నాయి. దూరంగా, 'జగమంతా మాయే...' అని పాడుతూ ఆడుతూ పోయే పశువుల కుర్రాడిని చూచి, తనకా మాత్రం ఓపిక లేదా అని అభిమానపడి అడుగులవేగం హెచ్చించాడు. మొహంమీద లంకలు వేస్తూ ప్రవహించే స్వేదనదుల గతులగురించి ఆలోచించాడు. ఈ నదులు ఎవరికీ వుపయోగకారి కావు—తన బ్రతుకు అంతే. కాలంలో గుర్తులేకుండా కలిసిపోతాయి. ఈ ఆలోచన చాలాసార్లు వచ్చింది రామానికి. క్రిందటి వేసంకాలంలో తనతో నిత్యమూ కలిసి తిరిగే సుబ్బారావుగారు గుర్తుకువచ్చారు. 'విజ్ఞానఖని' అని అధికారులు అనేవారు. ఇంట్లో పెళ్ళికాని కూతురు, చదువు చెప్పించలేని కొడుకు మంచంపట్టిన భార్య, పుస్త

కాల్లో మునిగిపొయ్యే అతనూ చాలామందికి తెలియరు. కాలేజీలు తెరచిన రోజు—10 గంటలకు అందరూ హాస్పిటలుకి పరుగెత్తుతున్నారు. క్రిందటి రాత్రి, గుండెనొప్పి వచ్చి ఆయన హాస్పిటల్లో జేరిన సంగతి భార్యకి, గేటుదగ్గర గుమాస్తాకి, వార్డులో నర్సుకి మాత్రం తెలుసు. ఉదయం అందరికీ తెలిసిపోయింది చచ్చిపోయాడని... దీనికోసమేనా ఆయన యింతకాలం కష్టపడ్డది. ఈ ప్రశ్నే చాలా సారు రామాన్ని యెదుర్కొంది. ఇప్పటికీ సమాధానం దొరకలేదు. క్రమంగా తను 'నిరాశావాది'గా తయారవుతున్నానేమో నని అనుమానపడ్డాడు. నవ్వుకొన్నాడు... కృష్ణయ్య యీ ఎం.ఏ.లో ఎక్కడికీ పోడులే అనుకొన్నాడు. అతనితో స్నేహం ఒక విచిత్ర సంఘటన.

యూనివర్సిటీ పరీక్షలు. కృష్ణయ్య ఏమీ చదవలేదు. వూళ్ళో తలపెట్టుకు తిరగలేడని తెలుసు. పరీక్ష ప్యాసుగాకపోతే ఇంట్లో మంచినీళ్ళు దొరకవని రామం ముందు విలపించాడు. ఈ జ్ఞానం యింతకుముందేనా రాలేదని వాపోయాడు. రేపటి పేపరొక్కటీ వ్రాయగలిగితే తక్కినవన్నీ తను చూసుకోగలనని ప్రాధేయపడ్డాడు. పుస్తకాల్లో విషయాలు నూరి అతని మెదడులో ఎక్కించగల సాధనం వుంటే బాగుండు ననిపించింది రామానికి. అయినా, అతని బుర్ర దేన్నీ జీర్ణం చేసికోలేదని గుర్తుకువచ్చి ఆ ఆలోచన వదలిపెట్టాడు. కృష్ణయ్య ఏడుపు మొహం చూసి జాలివేసింది. తనకే యీ యిక్కట్టు వచ్చినట్లుగా బాధపడ్డాడు. 'సరే! వెళ్లు' అన్నాడు. కృష్ణయ్య రాత్రంతా నిద్రపొయ్యాడు. మర్నాడు తన పేపరుమీద కృష్ణయ్య నెంబరు వేసినట్లు, కృష్ణయ్యకి పరీక్ష అయినతర్వాత గాని తెలియదు. దొంగ నెంబరు వేసి, సిల్కు చీర కట్టుకొచ్చిన వాచరుకి పేపరు యివ్వబోతూ రామం అనుభవించిన బాధకి, యింక యమలోకానికి వెళ్ళనవసరం వుండదని పించింది. ఫలితాలు వూహించివుంటే త నాపని చెయ్యలేకపోయేవాడు. కృష్ణయ్య ఏడుపుమొహం గుర్తుకు రాకపోయినా తను పరీక్ష పూర్తిచేయగలిగేవాడు. వణకే తన చేతులు చూసి తను చేసినపని పోలుస్తుందేమోనని బిక్క మొహంతో ఆమెకేసి చూస్తూ నిలుచోవటం, ఆమె జారిపోయే తన సిల్కుచీరని పరీక్షిస్తున్నాడని భ్రమించి చీర సర్దుకొంటూ హడావడిగా పేపర్లు తీసికొని వెళ్ళిపోవటం—అంతా ఒక వింతగా తోచింది రామానికి. తన ఆవేదన, ఆమె కంగారు తలపుకువచ్చి నవ్వుకొన్నాడు. నెలరోజుల క్రితం కృష్ణయ్య పెళ్ళి శుభలేఖ పంపుతూ 'నీ సహాయం జీవితంలో ఎప్పుడూ మరువలేను... అందువల్లనే యాభైవేలు కట్నం వస్తుంది ప్రస్తుతం నాకు' అని తగిలించాడు తాజాకలం. 'పోనీ తను ఆధారంగా ఒకడైనా బాగుపడ్డాడు' అని తృప్తిపొందాడు.

మాణిక్యం యింటి సమీపానికి వచ్చాడు. తలుపులు వేసివున్నాయి. కిటికీ తలుపు ఓరగా వేసివుంది. ఆ అమ్మాయి ఆ సందులోనుంచి చూసి పిలుస్తుందేమో నని అడుగులు వేగంగా వేస్తున్నాడు. ఆమె అంటే తన కెందుకో అంత భయం. చాలా కాలంవరకూ నాన్న మాణిక్యం యింటికి వెళుతూంటాడని తనకూ తెలియదు. సుబ్బయ్య 'మీ సవతి తల్లికి నిన్ను చూడాలని వుందట' అనేవాడు తనతో. అప్పుడు కూడా వాటిని తనేమీ పట్టించుకోలేదు. ఓ రోజున సిల్కు లాల్చీ జరీకండువాలతో ఓ పెద్దమనిషి, తన భుజంమీద చెయ్యి వేసుకొని ఈ మార్గాన్నే తీసుకుని వచ్చాడు, పెళ్ళి సంబంధం వుందని...అమ్మాయికి చదువుకొన్న వాడు కావాలంటోందట.

ఆమె తల్లిదండ్రులు పరువు ఆస్తి ముఖ్యమంటున్నారుట. ఈ రెండూ వున్నాయని తెలసి తన ఇష్టం కనుక్కోటానికి వచ్చాడని తేల్చాడు మెల్లిగా. రామం ఈ మాటలు విని లోలోపల సంతోషించాడు. అధమం పెళ్ళికూతురు దృష్టిలో తన చదువుకైనా విలువ వుందని. సమాధానం యివ్వటానికి ఏమీ తోచలేదు. దిక్కులు చూస్తున్నాడు మాటలకు తబ్బిబ్బుపడుతూ. ఒక్కసారి మొహం తెల్లబడింది—నెత్తురు అంతా ఆవిరి అయిపోయినట్లు. నాన్న మాణిక్యం యింటిలోకి వెళ్ళటం చూశాడు. ప్రాణాలు ఎవరో బలవంతంగా లాక్కెడుతున్నట్లనిపించింది. తనీ విధంగానే ఈ పాటిమట్టిలో కప్పడిపోతే బాగుండుననుకున్నాడు. తనకి పరువు ఎక్కడిది. ఆస్తి అసలే లేదు. గుట్టుగా నాన్న సంసారం నెట్టుకొస్తున్నాడు. అమ్మ అనేది 'నాన్న చదువు చెప్పించి,నీ ఆస్తంతా వెచ్చించారు.' తను అందుకూ బాధపడలేదు. అమ్మకి ఎప్పుడూ బెంగే తను బ్రతకటం చాతకాని వాడని. చచ్చిపోయేముందు తనకి యిచ్చిపోయిన సందేశం యిదేను. రామం కళ్లలో నీళ్ళు తిరిగేయి. కంఠం మూగపోయింది. ఈ పెద్దమనిషి తన్నింత వరకూ తీసికొస్త ఈ దృశ్యం చూపించడానికేమో అని అనుమానపడ్డాడు. నరాలు కూడదీసుకొని ఆ పెద్దమనిషితో అన్నాడు. "నాకు పరువూ లేదు, ఆస్తీలేదు

మా నాన్న వ్యభిచారి. నా సంగతి నాకే తెలీదు... యిష్టమయితే మీ అమ్మాయిని యివ్వండి." ముందు అతను ఉద్రేకంలో అంటున్నాడనుకొన్నా ఆ మాటలు ఆయనకి అసందర్భంగా తోచలేదు. ఒక్క చదువు చూసి మాత్రం వాళ్లు యిష్టపడక పోవచ్చు" అని కండువా దులుపుకొని వెళ్ళిపోయాడు.

రామానికి అడుగు పడలేదు. ఇంటికి వెళ్లాలనిపించలేదు. మంచం పట్టిన అమ్మ, డాక్టరుకి మందులకి డబ్బులేక నిస్సహాయంగా యింటి చిల్లులు లెక్క పెట్టే నాన్న... ఆనాడు జరిగిన మాణిక్యం సంఘటన కళ్ళముందు తిరిగాయి. అమ్మ మూలుగుతోంది. చెల్లాయి భయంతో అమ్మకాళ్లదగ్గర పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. తను అక్కడ ఉండలేక గదిలోకిపోయి ఏడుస్తున్నాడు, యింతలో మాణిక్యం మాటలు పూర్తి అయ్యాయి. నాన్న కసురుతున్నాడు అమ్మను. "ఆ డబ్బుతో కొన్న మందుమాత్రం నేను పుచ్చుకోనని" అమ్మ నీరసంగా అంటోంది. ఆ మాటల్లో నిశ్చయం మాత్రం కనపడుతోంది. మాణిక్యానికి మొదట్లో డబ్బున్నవాళ్ళంతా మొగుళ్ళను. అందరూ బికారులయి పోయారు, ఆమెవల్లనే—అనే వదంతి అప్పుళ్ళో. "నిష్కారణంగా ఆమెని చంపెయ్యకండి బాబూ! మెల్లిగా వొప్పించి ఈ డబ్బుతో మందు తెప్పించండి." మాణిక్యం నాన్నకాళ్ళ వేళ్ళపడి ప్రాధేయపడుతోంది. అమ్మ అంటోంది: 'ఈ ఆఖరి క్షణంలోనైనా నన్ను శాంతంగా వెళ్ళిపోనీండి'. అమ్మగొంతుకలో దీనత్వం రామాన్ని కలచివేసింది. ఆమె చివరికి మనశ్శాంతికూడా లేకుండా, చచ్చిపోతుందేమో నని భయం పుట్టింది. తను చివరి ఘడియల్లోకూడ ఏమీ చెయ్యలేనా అనుకొన్నాడు. గదిలోనుంచి ఉద్రేకంగా వచ్చి మాణిక్యం చేతులోని నోట్లని వీధిలోకి గిరవాటు పెట్టి, ఆమెను బయటికినెట్టి తలుపు వేశాడు. చెమరుకొన్న కళ్ళను చీరకొంగుతో తుడుచుకొని మాణిక్యం వెళ్ళిపోయింది. శని విరగడయిందనుకొన్నాడు అప్పుడు... అమ్మపోయి నెల తిరగలేదు. తిరిగి ఆ శనిదేవత గృహంలో నాన్నని చూడగానే అవమానపు ఊబిల్లో మునిగిపోతున్నట్లనిపించింది...

నాన్నపోయి ఏడాది అవలేదు. మాణిక్యం మంచానపట్టి, తనని చూడాలని వుందని, ఒక్కసారి వచ్చిపొమ్మని బ్రతిమాలుతూ కబురంపింది యీ అమ్మాయిచేత. అమాయకపు దీనత్వాన్ని తెలిపే ఆమె కళ్లు, చూసి రామం జాలిపడ్డాడు. "పోనీ ఒకసారి చూసివస్తే, ఏమవుతుందీ" అనుకొని ఆమెతో 'సరే' అన్నాడు. ఆమె సంతోషం పట్టలేకపోయింది. అమ్మ చేయలేకపోయిన కార్యం తను సాధించుకొని వెళుతోంది. ఆమె వెళ్ళగానే సుబ్బయ్య ప్రత్యక్షమయ్యాడు. 'వాళ్ళ యింటికి వెళుతున్నావా?' అన్నాడు. 'ఎవరింటికి?' రామం ఆలోచించకుండానే. 'అదే—ఆ పిల్ల—అది మాణిక్యం కూతురు కాదులే...ఎవరిపిల్లనో పెంచుకొంది ... అందుకనే నీవు సరసాలాడినా ఫర్వాలేదు" సుబ్బయ్య నుక్క తిప్పుకోకుండా తన అక్కసు వెళ్ళబోసుకొని సమాధానానికి ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు. చిత్రవశ ఈ పరిహాసంకంటె బాధగా వుండదేమో. ఈ సుబ్బయ్యలు పుట్టడం సంఘంలో ఎవరి బాధ్యతలు వాళ్ళకి జ్ఞాపకం చెయ్యడానికా ఊళ్ళోవాళ్లెవరూ నాన్న పోయినప్పటినుంచీ తనతో మాట్లాడకపోవటానికి కారణం ఈ అనుమానమే అయుంటుంది. దీనికంతకీ నాన్న కారణం. "మీఅమ్మ చచ్చిపోత సగం ఈ బెంగతోనే" అని సుబ్బయ్యభార్య చెల్లాయితో అందిట. అవమానం అభిమానం ముంచెత్తాయి. మాణిక్యంనుమ్మం త్రొక్కకూడదని తీర్మానించుకొన్నాడు...మాణిక్యం చితిమీది పొగని దూరంగా, ఎవరికీ కనపడకుండా, ఆ అమ్మాయిదృష్టినుంచి తప్పించుకొంటూ చూశాడు. చీకటిపడిందన్న సంగతి నక్కల అలజడితో గుర్తువచ్చి, యింటికి తిరిగివచ్చాడు. ఆ అమ్మాయికంట పడటానికి ధైర్యం లేదు. ఆమె తననిచూసి చీదరించుకొని తలుపు వేసుకొంటుందని ఊహించాడు...

అందుకనే రామం కంగారుగా వేగంగా అడుగులు వేసికొంటూ ఆ యింటిదారినుండి ఎంత త్వరగా తప్పుకొంటామా అనుకొంటూ కృష్ణయ్య యింటి సమీపానికి వచ్చాడు. అదటుగా గుండెలు యింకా కొట్టుకొంటూనే వున్నాయి. "ఈ ఎండలో యిల్లా పరుగెత్తుకొంటూ వచ్చావేమిటి" అని సావకాశంగా కుర్చీలో భార్య అందించే తమలపాకులు నములుతున్న కృష్ణయ్య పలకరించే వరకూ తను పరుగెడుతున్నట్లు తెలియలేదు. మంచం దగ్గరకు లాగి కూర్చొన్నాడు రామాన్ని. విసనకర్రయిస్తూ, రామం మొహంలోకి తేరిపారచూస్తున్న భార్యని 'మంచినీళ్లు తే' అని ఆజ్ఞాపించాడు. రామానికి ఈ మొహం పరిచయంగా తోచింది. పెళ్ళికి రాలేదేం? "ఊరక రారు మహానుభావులు..." అని ఆపదం సాగతీస్తూ రామంకేసి ప్రశ్నార్థకంగా చూచాడు.

రామానికి అన్నీ గుర్తుకొస్తున్నాయ్. ఈమెనా, కృష్ణయ్య చేసికొన్నది. కాకినాడలో ఆమె ప్రక్క యింటిలోనే తను గది అద్దెకు తీసికొని వుండేవాడు. ఆమె నిత్యమూ కిటికీదగ్గర కూర్చుని సంగీతసాధకం చేసేది. మొదట్లో ఆడవాళ్లకి విర్రపీగటం ఎక్కువ, కాలేజీలో చదువుతున్నానని టెక్కు అయుంటుంది అని సర్దుకొన్నాడు. కాని చదువుకి నిత్యం అంతరాయం కలగడం భరించలేక ఓరోజున కొంటెగా ఆమెకేసి చెయ్యి వూపాడు. ఆమె కిటికీ ఖళ్లున వేసి చప్పుడు చేసుకొంటూ వెళ్లి పోయింది. రామానికి ప్రాణాలుపోయాయి. శరీరం చెమటతో తడిసిపోయింది. వాళ్ళ నాన్న పోలీసు ఇన్‌స్పెక్టరు కూడాను. ఆమె తండ్రితో ఫిర్యాదు చేయవచ్చు అతను తుపాకీతో తన్ను కాల్చివేస్తే... అసలు తుపాకీవరకు · ఎందుకు...లాఠీకర్రతో వీపు బద్దలుకొట్టి ప్రక్కనే వున్న ఉప్పుటేరులోకి త్రోసివేస్తే చాలు... మెల్లిగా కిటికీ ప్రక్కన నక్కి వాళ్లయింటిలో ఏదైనా గొడవ జరుగుతుందేమో నని వింటున్నాడు. వాళ్లఅమ్మ బొంగురు గొంతుక విని పించింది. ఆమె చీపురుకట్ట పుచ్చుకొని వస్తుందేమో నని భయం. తనని వీధిలోకి జుట్టుపట్టుకులాగి రోడ్డు మీద పోయే అందరిముందూ 'ఈ జంతువుని చూడండి మీరంతా' అని అంటుంది. అందరూ విరగబడి నవ్వుతారు. తన స్నేహితులంతా మందలించటానికి ముందుకు వస్తారు. తను చదువుకి తిలోదకాలిచ్చి పారి పోవాలి. ఈ ఫలితాలన్నీ · వూహించి, ఈ గండం గట్టెక్కితే, యింకెప్పుడూ యిల్లాంటి తెలివితక్కువ పని చెయ్యకూడదని నిశ్చయించుకొన్నాడు. వాళ్ళ యింటిలో గొడవ సర్దుమణిగింది. వీధితలుపులు వేసిన చప్పుడు. మెల్లిగా క్రమంగా తన గదిముందు పిల్లి అడుగుల అలికిడి అయింది. భయపడుతూ రామం వెనక్కి తిరిగి చూచాడు కిటికీలోంచి. ఎవరూ లేరు. తలుపు తెరచి చూచాడు. గుమ్మంముందు ఆమె... రామం నిశ్చేష్టుడయ్యాడు. ఏదో అనబోయాడు. అవి గొంతుకలోనే వుండిపోయాయి. ఆమె గొడవ చెయ్యకన్నట్లు తన చేతిని తన నోటికడ్డంగా పెట్టి "అమ్మతో సినిమాకని చెప్పా"నంది మెల్లిగా. శరీరం మంచుగడ్డలా అయింది. ఏమి చెయ్యటానికీ ఆలోచించే శక్తి లేదు. అప్పు, తన గది ప్రక్కన యింటి ఆవిడ మాటలు వినిపించబట్టి రామానికి ఏంచెయ్యాలనే ప్రశ్నకి సమాధానం వెతకాలసిన అవసరం కలుగలేదు. తన అదృష్టానికి అభినందించుకొని మర్నాడు ఉదయమే గది మార్చేశాడు.

'మంచినీళ్లు తీసికోవోయ్ ముందు' కృష్ణయ్య గొంతుకలోని ఆజ్ఞాపన వినిపించింది. మంచినీళ్లగ్లాసు పట్టుకొని ఆమె నిలబడివుంది. తల ఎత్తకుండానే గ్లాసు అందుకొని నీళ్ళన్నీ, అనుకోకుండా ఒక గుక్కలో త్రాగేశాడు. 'ఎండనపడ్డావు బాగా' అన్నాడు కృష్ణయ్య సానుభూతి చూపిస్తూ. ఈ యింటిదగ్గరనుండి ఎంత త్వరగా వెళ్ళిపోతానా అని పించింది.

చెల్లాయిని పురుటికి తీసుకొనిరావాలి. చేతిలో కానీ లేదు. వుద్యోగం ఖాళీ. నాలుగు రోజులయి యింటిలో తిండి లేదు. మిగిలివున్న అటుకులు నాన వేసుకొని తిని బ్రతుకుతున్నాడు. అభిమానం చంపుకొని ఎవరినీ చేబదులు అడిగే ధైర్యం లేదు. ఈ రోజున ఆకలిబాధకి తట్టుకోలేకపోయాడు. చచ్చి పోవటానికి ధైర్యం లేక బ్రతికటం చాతకాక సిగ్గు విడచి నిర్మొహమాటంగా డబ్బుకై కృష్ణయ్య దర్శనం చేసికోటానికి వచ్చానని—ఉన్నదంతా ఒక్క గుక్కలో చెప్పేయాలి అని తాను బయలు దేరేముందు అనుకొన్నాడు.

కృష్ణయ్యప్రశ్నలు సగం ధైర్యాన్ని చంపాయి. అతని భార్య తన వుద్దేశ్యాన్ని నిలువు గోతిలో పూడ్చిపెట్టింది. "పెళ్ళికి రాలేదేం? ఊరక రారు..." ఈ ప్రశ్నల తర్వాత కృష్ణయ్యని తను డబ్బు అడుగుతే, 'ఏడి స్నేహం అంతా డబ్బుతోనే' వుంది అనుకోవచ్చు. శుభలేఖలో కృష్ణయ్య తాను చేసిన సహాయాన్ని త్రవ్వి జ్ఞాపకంచేశాడు. అది ఆధారంగా తీసికొని డబ్బు అడుగుతున్నాననైనా అనుకోవచ్చు. తన స్నేహానికి డబ్బుతో విలువకట్టే అవకాశం కృష్ణయ్యకి ఎప్పుడూ యివ్వకూడదని నిశ్చయించాడు. పైగా ఆమె...అతని భార్యముందు అతన్ని యాచించడం.. రామం నిశ్చయం మంచులా కరగిపోయింది. ఉదయంనుంచీ పడ్డ ఆకలిబాధలకన్న అభిమానం పైచెయ్యి తీసికొంది.

"ఏమీలేదు—చూసిపోదామని బయలుదేరా" నన్నాడు. తన సమాధానం తనకే నచ్చలేదు. కృష్ణయ్య ... పడ్డాడు. కట్నం డబ్బుతో ఓ సినిమాహాలు కట్టించానని, అది ఈ జిల్లాలోకి మంచి అందమైనదని, ఈమధ్యనే ధాన్యం గిరాకిలో అమ్మి మిల్లు కట్టించానని, భార్య ఓ అదృష్ట దేవత అని, యింకా తన తెలివితేటలన్నీ ఉపయోగించి డబ్బు చేసుకోటానికి, కనిపెట్టి అమలులో పెడుతున్న నూతనమార్గాలన్నిటినీ రామం ముందు

వల్లె వేస్తున్నాడు. ఈ వాగ్దాటిలో రాముం, తన్నొక మురికికాలవలోనుంచి లాగు పోస్తున్నట్లుగా బాధ పడ్డాడు. ఇదంతా డబ్బు సంస్కృతి దీనికి సురణం వుండదు. కృష్ణయ్య ఆగాడు రాముం తనమాటలేమీ అర్ధం చేసుకొంటున్నట్లు లేదు. "ఏమోయ్ దారిలో ఏదైనా కరిచిందేమిటి" అన్నాడు. రామానికి ఆప్రశ్న అర్థం కాలేదు. 'ఏమిటి' అన్నాడు

'ఆ...ఏమీ లేదు. ఆ మాణిక్యంకూతురుంది కదూ! అదేమైనా నిన్ను పలకరించిందేమిటి... ఈమధ్య ఏదో విన్నానులే' అని ఓ పొడిదగ్గు దగ్గాడు. రామానికి సమాధానం యివ్వటానికి అసహ్యం వేసింది. కృష్ణయ్యమాటలు తన్నిప్పుడు సహారా ఎడారిలోకి తీసికెళ్లి అక్కడ మండేయిసుకలో పూడ్చివేశాయి. కుర్చీ సర్దుకొని కృష్ణయ్య అన్నాడు. "ఆ పతివ్రతకి మే మెవ్వరం పనికిరామట. పోనీ నిన్నైనా ఎన్నుకుంది" వికిలిగా నవ్వాడు. పీకనులిమి కృష్ణయ్యని అల్లాగునే కుర్చీలో పాతివేస్తే బాగుండుననిపించింది. ఈ లోకంలోకి పొరపాటున పడ్డ జంతువు తను. కాటుబాధ భరించలేడు. తిరిగి కాటు వెయ్యలేడు. ధనంతో కండబట్టిన కృష్ణయ్యకి మాణిక్యం కూతురు పతివ్రత అయినందుకు బాధ కలిగింది. ఆ అక్కసు, తనమీద పెట్టి తీర్చుకొన్నాడు. తను మొదటినుంచీ, మాణిక్యాన్ని, ఆమెను ద్వేషించి, చివరకు తనూ ద్వేషింపబడుతున్నాడు. ఆమెకి తనకీ యేదో అవినాభావసంబంధం వుండాలనుకొన్నాడు. లేకపోతే వీళ్ళందరూ బలిపశువుగా తనని ఎన్నుకోవటం ఎందుకు? కృష్ణయ్యలు ఆమెని ఎంతోకాలం అల్లా బ్రతకనివ్వరేమో. అతని హేళనలో ఈ క్రూరత్వం స్పష్టంగా కనిపించింది రామానికి. ఆమెమీద ఏదో అభిమానం మమకారం పుట్టుకొచ్చాయి. అసలు తనెందుకు ఆమెను ద్వేషించాలో తెలియదు. ఏదో మబ్బుతెర...మంచుపొగ యిద్దరిమధ్య అడ్డుగావుంది. తను ఎప్పుడూ ఈ తెర తొలిగించి చూడవలసిన అవసరం కలుగుతుందనుకోలేదు.

రాముం కృష్ణయ్యదగ్గర సెలవు తీసికొన్నాడు. ఇంటిముఖం పట్టాడు. ఆకలి అసలు వెయ్యటంలేదు. ఇల్లాగేవుంటే డబ్బు అవసరం వుండదు...కాళ్లీడ్చుకొంటూ కాలేకడుపుకి రగిలే ఆలోచనలని మేత వేస్తూ యింటి గుమ్మంలో కూలబడ్డాడు. దూరంగా ఆర్పబడ్డ యిళ్ళలోని జనం ఆక్రందనాలు...కడుపులో రగిలిన చితులు...పగిలిన హృదయావేదన. కదలిన మానవత్వపు శ్వాసలు...తనెందుకు మాణిక్యాన్ని ఆఖరిసారైనా చూడ్డానికి వెళ్ళలేదా అని వాపోయాడు. అసలు ఆ రోజున ఆమెను తన యింటినుండి వెళ్ళగొట్టకపోతే, నాన్న ఆమెదగ్గర డబ్బు తీసికొనేవాడేమో. అమ్మని డాక్టరుకి చూపించి జబ్బు నయం చేయించ గలిగేవాడు. నాన్న, మాణిక్యాలు చచ్చిపోయేవారు కాదేమో అనిపించింది. ఇంతమందిని హత్యచేసింది తనేనని నిందించుకొన్నాడు. తన దురభిమానం...యిదే మాణిక్యాన్ని చంపింది— అప్పుడు. ఇప్పుడు తిరిగి ఆ అమ్మాయిని బలి తీసుకోవచ్చు కృష్ణయ్యలు ఎంతోకాలం ఆమె నల్లా బ్రతకనివ్వకపోవచ్చు. ఈ ఆలోచన రాగానే రాముం భయపడాడు. తన దేవో, తన ఆత్మీయమైన వస్తువుని వాళ్ళందరూ దొంగిలించుకుపోతున్నట్లు బాధపడ్డాడు. అమాయకంగా జాలిగొలుపుతూ ఆమె తనని బ్రతిమాలుతున్నట్లు ఊహించాడు. నీరసించిన ఆమె ఆకారం, పొగలోనుండి తనని బ్రతిమాలుతున్న మాణిక్యంహస్తాలు చీకట్లో స్పష్టంగా కనుపించాయ్...

రామానికి ఒకే మార్గం...ఆమె యింటివైపు దారితీశాడు. ఇంటిముందు నిలుచుండి మాణిక్యం అని పిలిచాడు. మాటలు పెదవులు దాటలేదు. ఇంట్లో అలికిడి వినిపించలేదు. తలుపు తట్టుతూ 'మాణిక్యం' అని గట్టిగా అరిచాడు. నాలిక కొరుక్కొన్నాడు, 'మాణిక్యం' అని పిలచినందుకు. మళ్లీ ఈమెకి చచ్చిపోయిన మాణిక్యాన్ని గుర్తుచేస్తున్నందుకు విచారించాడు. మాణిక్యాన్ని తనే చంపాడేమో నిజంగా. ఆఖరిసారి ఆమె కోర్కెను మన్నించలేకపోయాడు. కృష్ణయ్యలు తనవల్ల డబ్బుచేసుకో గలిగారు. మాణిక్యాలు కృశించి చచ్చిపోతారు. తనుమాత్రం కృష్ణయ్యల ఆటలు సాగనివ్వకూడదు అని నిశ్చయించుకొన్నాడు. కళ్లలో యేదో సంతృప్తి వెలిగింది. తలుపు తీయబడింది. ఆ సన్నని దీపపుకాంతి గదిలో సగం చీకటిని వదిలేస్తోంది. ఆ మసక కాంతిలో పాలిపోయిన ఆమె మొహం కొడిగట్టబోయే దీపంలా కనిపించింది. ఈమె జీవితాన్ని కొడికట్టనివ్వకూడదనిపించింది.

"నిన్ను కృష్ణయ్యలకి అప్పగించను..ఎప్పుడూ యింక నే నిక్కడే" ఏదో అనబోయాడు. ఆమె అస్పష్టపు మాటలు రాముం పెదవుల్లో కలసిపోయాయ్.

# హరవిలాస కిరాతార్జునీయము వీరశైవ సంప్రదాయము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

శ్రీనాథ మహాకవి హరవిలాసమున సప్తమాశ్వాసమున మొదటి నూటమూడు గద్యపద్యములలో నీ కిరాతార్జునీయ కథను రచియించి యున్నాడు — దీనికి మూలము నన్నయభట్టారక రచిత భారతారణ్య పర్వమునగల కిరాతార్జునీయ కథ. అందేబది గద్యపద్యములలో నున్న నీకథను, రచనావిధానము చేతను, వీరశైవ సంప్రదాయసంధానము చేతను ద్విగుణీకృతము గావించి, శ్రీనాథు డొక ప్రత్యేకవిశిష్టత దీని కాపాదించియున్నాడు. ఈ కథయే ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యమున, తిన్నని కథయందు గలదు. కొన్ని ప్రత్యేక కృతుల యందును నీ యితివృత్తము కలదు. కాని వేనియందున శ్రీనాథమహాకవి రచనయందలి విశిష్టత కానరాదు— ప్రస్తుతము నన్నయ శ్రీనాథుల రచనలను మాత్రమే గ్రహింతుము.

## శబ్దానుసరణము

నన్నయ రచనయే మూలముగావున నీ కథ యందు రెండుచోట్ల నన్నయ రచనలే పొందుపడినవి.

ఆరణ్యపర్వ ద్వితీయాశ్వాసాది నున్న :

శ్రీ రమ్యధర్మ నిత్య
ప్రారంభ విభాసిరాజపరమేశ్వర ఘో
రారి మదకుంభికుంభవి
దారణ దారుణ కృపాణ దక్షిణహస్తా.

అను పద్యము చివరి రెండుపాదములును నిట్లు 18 వ పద్యమున హత్తుకొన్నవి.

వైరి మదకుంభి కుంభవి
దారణ దారుణ కృపాణ ధారలు పరిఘాకారములు కందమూలో
ద్ధారములకుఁ బాలుపడెగదా నీకరముల్.

అరణ్యపర్వము 1-315 వచనమునందుగల యీ క్రిందివాక్యములు హరవిలాసమున పద్యరూపమున వెలయుచున్నవి.

"అగ్నిదేవుండు నాకిచ్చిన యక్షయశరధు లిప్పుడు యుగాంత్యకాలరిక్తంబులైన శరధులుంబోలె నున్నయవి."

శరధులు యుగాంత్యవేళా
శరధులునుం బోలెనయ్యె శరశూన్యంబుల్
సురపతి సూతికి పరమే
శ్వర మాయాశక్తినపుడు సమరాగ్రమునన్
[74 పద్యము.]

---

1. 'హరవిలాసము' అను పేర నొక సంస్కృత కావ్యమును శ్రీనాథునకు నైదు శతాబ్దులకు పూర్వమే రాజశేఖర మహాకవి రచియించి యున్నాడు. ప్రసిద్ధ జైన సమయాచార్యుడు హేమచంద్రుఁడు తన కావ్యానుశాసనములో దానిని పేర్కొన్నాడు. రాజశేఖరుని రచనలను కొన్నింటిని గ్రహించిన శ్రీనాథుని కీ గ్రంథము పరిచితమై యుండనగును. 'హరవిలాసము' అను పేరు దాని ననుసరించియే తన గ్రంథమునకు బెట్టియుండవచ్చును. దీనిని గూర్చి 'రాజశేఖరుని హరవిలాసము' అను వ్యాసమును చూడుఁడు. (ఆంధ్ర పత్రిక ప్రమోదూత సంవత్సరాది సంచిక (1930). వ్యాసకర్త శ్రీ యీయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు. ఎమ్. ఏ. పుటలు 78–80.

## కథానుసరణము—ప్రత్యేకత

వీరశైవమత వాఙ్మయములో శివుని లీలలో కిరాత రూపధారణ లీలయొకటి. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున వాదప్రకరణమున సాంఖ్య మతానుసారముగ శివుని పంచవింశతి లీలలను చెప్పుచు నీ లీలను:

రసికత వెలయఁ గిరాతావతార
మెసగ దాల్చుట పదియేనవలీల.

అని చెప్పియున్నాడు. నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమున శైవమత తత్త్వానుసారముగఁ జెప్పిన 36 లీలలలోను నీ లీలను 34, 35 వ లీలలుగా చెప్పియున్నాడు.

నన్నయ మూలములో కిరాత వేషవర్ణనలో కేవలము 'కిరాత బలంబుల'తోడ యని యున్నదిగాని ప్రత్యేకముగా కుక్కురము లున్నట్లు లేదు. వేటకు జాగిలము లుండవలయునుగదా! దీనిని పురస్కరించుకొని శ్రీనాథుడు వీరశైవ సంప్రదాయానుసారముగ నీ కుక్కురబలమును, 4 పద్యములలో వర్ణించియున్నాడు. ఆ సంప్రదాయము ననుసరించి యివి వేదమయ మూర్తులు:

ప్రకటలీల నుదాత్తంపు ఫణితిఁ గొన్ని
క్రమముతో ననుదాత్తస్వరమున గొన్ని
స్వరితములఁ బ్రచయంబుల వరుసగొన్ని
ఘోషణము సేయ దొడఁగె నా కుర్కురములు.

కనకపు శృంఖలలఁ ద్రయీ
శునకంబులఁ బట్టుకొనఁగ సూరెలఁ బ్రమ
తను నిరుచక్కియ లీలా [ధుల్
వనచరులై గొలువఁ గపటవైహారికుఁడై.

బసవపురాణములో సప్తమాశ్వాసమున కల్లిదేవయ్యగారి కథలో నాభకుడు కుక్కలచే వేదములు చదివించినట్లు వర్ణితమై యున్నది. మఱియు పండితారాధ్య చరిత్రము వాదప్రకరణములో నిట్లు గలదు.

తప్పని వేదంబు దైవమేనియును
చెప్పమా కుక్కలై శివు వెన్క జనునె.

వేదములు శివునకు త్రిపురాసుర సంహారకాలమున రథమునకు గుఱ్ఱములు; తాండవ నృత్యకాలమున పాదమునకు నందియలు; కిరాతావతారమున శునకములు; ఈ విషయ మీ క్రిందిపద్యమున దెలుపబడినది.

పాదములకు నందియలై
మోదమున కిరాత వేషమున శునకములై
నాదట తేరికి హరులా
వేదములకు నెపుడొనర్తు వినతులు శర్వా!
[పందిరిమహాదేవుడు గారి శర్వశతకము - (1873)]

## అర్జునుని తపస్సు - పాశుపతదీక్ష

భారతమున నర్జునుని తపశ్చర్య మునిజనసామాన్యము తపోదీక్షగా వర్ణితమైనది. శ్రీనాథుడు దీనిని పాశుపతదీక్షగా వర్ణించియున్నాడు.

భసితోద్ధూళిత నిర్మలావయవుడు
  న్బంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తి పరాయణుండును శివ
  ధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరత్వక్చర్మమయకం
  థాభద్రపీఠుండునై
యసమస్థేమఁ గిరీటి పాశుపత దీ
  క్షారంభమున్ గైకొనెన్.

ఈ పాశుపతదీక్షా సంప్రదాయ మాంధ్రదేశమున వెలసిన ఆరాధ్యశైవమునకు సంబంధించినది. ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకులగు మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రమును శ్రీనాథుఁడు పద్యకావ్యముగా ననువదించియుండుటచే నాతడు వీనినన్నిటిని చక్కగ గ్రహించియే యున్నాడు. కిరాతార్జునీయ కథయందు శ్రీనాథునికీ సంప్రదాయము నెలకొల్పుటకు చక్కని యవకాశ మేర్పడినది. అర్జునునకు కావల పాశుపతాస్త్రము. ఆ యస్త్రసంపాదనకు కావలసినది పాశుపతవ్రతదీక్ష. శ్రీనాథుడు నెలకొల్పదలచినదియు పాశుపతదీక్షయే అనగా పశుపతి సంబంధమైన దీక్ష. ఇట్లే చతుర్థాశ్వాసమున కుమారసంభవకథలో మూలములో లేని పాశుపతదీక్ష నుదహరించియున్నాడు.

"పాశుపతమంత్రదీక్షా విభాసమాన
దివ్యతేజోవిశేష సందీప్తమూర్తి"

ఈ పాశుపతసంప్రదాయమునకు మూలము అథర్వశిరోపనిషత్తునందు గలదు. మాధవ విద్యారణ్య కృత సర్వదర్శన సంగ్రహమున నీ సంప్రదాయమునకు సంబంధించిన సూత్రములు వివరింపబడియున్నవి.

## షట్కాల శివపూజావిధానము

అర్జునుడు "అరుణోదయ, తపనోదయ, సంగవ, మధ్యాహ్న, సాయాహ్న, అర్ధనిశా," సమయముల యంటియందును శివపూజ సలిపిన ట్లాఱుపద్యములు రచించినాడు. ఈ కాలముల వివరణ మిది: ఇది శైవులకు నియతమైనది.

అరుణోదయము—సూర్యోదయమునకు నాలుగు ఘడియలు ముందు.

| | | | | |
|---|---|---|---|---|
| తపనోదయము | – 6 ఘడియలకు. | | | |
| సంగవకాలము | – 6 ఘ॥ | మొ॥ | 12 ఘ॥ | వరకు: |
| మధ్యాహ్నకాలము | – 12 | ,, | 18 | ,, |
| అపరాహ్ణము | – 18 | ,, | 24 | ,, |
| సాయాహ్నము | – 24 | ,, | 30 | ,, |
| అర్ధనిశ | – మధ్యరాత్రమున 2 ఘడియలు. | | | |

హరవిలాసమున నీ షట్కాల శివపూజా విధానమును విపులముగ వర్ణించుటచే శ్రీనాథుడు భీమఖండమున మూడు పద్యములలో దీని నిట్లు వివరించినాడు.

త్రిపురావాసులతోడఁ గూడి కడిమిన్
దేవాహితుల్ లోకముల్
దపియింపంగఁ దపంబు చేసిరి దృఢ
స్థైర్యంబు పాటించి పా
శుపతాచారనిరూఢి నందఱును సం
శుద్ధాంతరంగంబులం
దుపమాతీతుని భీమనాయకుని నా
ద్యుం శంభు సేవించుచున్.

అరుణోదయంబున నాకాశవాహినీ
హేమాంబుజంబుల నిందుధరుని
మిహిరోదయంబున మహిసాక్షిగుగ్గుల
ధూపధూమంబుల దురితహరుని
సంగవంబున గంధసార కుంకుమచంద్ర
జంబాలమునఁ బుష్పచాప మథను
మధ్యాహ్నమున బక్వమధురాన్న పాయసా
పూపాజ్యదధి ఫలంబులఁ ద్రినేత్రుఁ
బరమ సంధ్యాగమంబున బటహశంఖ
ఝల్లరీమడ్డుడమరు ఝర్ఝరులమ్రోత
నర్ధరాత్రంబులందు వీణారవముల
హరునిఁ బూజింతురతి భక్తి నసురవరులు.

హరవిలాసమున మధ్యాహ్నకాలపూజను వర్ణించు నీ క్రిందిపద్యము గలదు:

పంచబ్రహ్మ షడంగ బీజముఖర
ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరాపరమని
ష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకు
న్మధ్యాహ్నకాలంబు సే
వించున్ నిర్జర రాజ సూనుఁడు మనో
వీథీ సదాధ్యాసితన్.

ఇది భీమఖండములో క్రింది విధముగా రూపాంతరము నందినది.

పంచబ్రహ్మషడంగ మంత్రములనుం
బ్రాసాద పంచాక్షరిం
బంచాస్యున్ బహు బిల్వపత్రముల న
భ్యర్చింతు రవ్యగ్రత
న్మంచుంగొండయనుంగుఁ బెండ్లికొడుకు
న్వర్ణింతు రేకాగ్రతం
జంచద్వేద పురాణమంత్రముల ని
ష్ఠాయుక్తి నక్తంచరుల్.

పై పద్యములలోని విషయములకు వివరణ:—
పంచబ్రహ్మ: అనగా పంచబ్రహ్మ సూక్తులు. ఇవి యైదు మంత్రములు—ఈశాన, అఘోర, వామదేవ, తత్పురుష, సద్యోజాతములను శివుని పంచరూపములకు సంబంధించినవి.

ఈశాన=ఈశాన స్సర్వవిద్యానామ్-అని మొదలు
అఘోర=అఘోరే భ్యోదఘోరేభ్యః- ,,
వామదేవ=వామదేవాయ నమః - అని మొదలు
తత్పురుష=తత్పురుషాయ విద్మహే- ,,

'షడంగములు'1 హసిత, గీత, నృత్య వాద్య హుడుక్కార నమస్కారములు. 'నమశ్శివాయ' అనునది పంచాక్షరి. శక్తి బీజాక్షరముతో కూడిన పంచాక్షరికి ప్రాసాద పంచాక్షరి యని పేరు. ఓంకారముతో కూడిన పంచాక్షరికి ప్రణవ పంచాక్షరి యని పేరు. దీనికే షడక్షరి యని పేరు. ప్రణవ పంచాక్షరిని శ్రీనాథుడు పెక్కుతావుల స్మరించియే యున్నాడు. దీనిని శివుడు స్వయముగా నగస్త్యున కుపదేశించెనని: "ప్రణవ పంచాక్షరోపనిషత్ప్రపంచంబు లెవ్వాడు శివునిచే నెఱిఁగికొనియె" అని భీమఖండమున శ్రీనాథుడు చెప్పియున్నాడు.

పై హారవిలాస పద్యములోని ప్రథమపాదము.

"పంచబ్రహ్మ షడంగ బీజముఖర ప్రాసాద పంచాక్షరీ" అనునది బిల్హణకవిరచితమైన బిల్హణమను శివస్తుతియందలి యీ క్రింది శ్లోకమునుండి గ్రహింపబడినది.

పంచ బ్రహ్మ షడంగ బీజముఖర
ప్రాసాద పంచాక్షరీ
వ్యోమవ్యాపి పురస్సరేషు మనుషు
ప్రౌఢిః కుతో మాదృశాం.
—3 వ శ్లోకము.

దీనికి శివపంచస్తవి2—భక్తరంజనీ వ్యాఖ్యానమున నిట్లు వివరణకలదు "పంచాక్షరీమంత్రము కూడ శాఖాభేదములను బట్టి వేలు వేలు బీజాక్షరములను పొంది 'ప్రసాద పంచాక్షరి' మున్నగు విధమున వ్యవహరింపబడును. ఇది మంత్రశాస్త్ర నిపుణులకు మాత్రమే తెలియును. పుట 262. ఈ బిల్హణస్తుతిని పాల్కురికి సోమనాథుడు పేర్కొనకపోయినను, శ్రీనాథుని కాలమున ప్రచారములో నున్నట్లు పై యుదాహృతి వలన తెలియుచున్నది.

1. షడంగయోగము శివతత్త్వసారము 270 వ పద్యములో నుదాహృతమైనది.

'ఎడపక యష్టాంగంబై, షడంగమై యొండె బరగు శంకరయోగంబు'

ఇది పాశుపతులకు విశేషణము. చూ. శివతత్త్వసారము పుట 43 ప్రసిద్ధ శైవాచార్యులు.

2. పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారి ప్రచురణము.

జర్మన్ కథ

# నా జీవిత గాథ

## ఎర్నెస్ట్ యుంగర్

★★ ఆధునిక జర్మన్ సాహిత్యవాహిని లోకశాంతికీ లోకకళ్యాణానికీ దోహదకారి కావాలని వాంఛించి, రచయితగా తనకున్న ప్రతిభాసంపదనంతా ఆవిధంగా వినియోగించిన మహామహుడు ఎర్నెస్ట్ యుంగర్. జననం 1895. 'స్టారమ్ ఆఫ్ స్టీల్' అనే శుద్గ్రంథం ఆయన ప్రథమ రచన. 1922-33 సంవత్సరాలమధ్య నిరంకుశాధికారుల చేతుల్లో జర్మన్ ప్రజఅనుభవించిన యమబాధలను వ్యక్తీకరించుతూ ఎన్నోనవలలను కథలనూ వ్రాశాడు.

1933 సం॥లో జర్మనుదేశంమీద తుపానువీచింది. అగ్నివర్షించింది. ఈదారుణ వాతావరణం 1948 వరకూ దేశాన్ని హతమార్చివేసింది. హిట్లరు వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ఉక్కునాడాల బూట్లపాదాల క్రింద నలిబిలిగా త్రొక్కించివేశాడు. దీన్ని యుంగరు సహించలేక పోయాడు. హిట్లరుప్రభుత్వం ఆయన గ్రంథాలను బహిష్కరించింది. ఆయన్ను ఖైదుచేసింది. కాని యుంగర్ మాత్రం తన ధర్మాన్ని విడనాడలేదు. 1942 వరకూ ఆయన రచనలు జర్మనీలోనే రహస్యంగా ముద్రింపబడుతూ వుండేవి. తర్వాత లండన్, పారిస్, జ్యూరిచ్, ఓస్లో నగరాలలో ప్రచురింపబడుతూ వచ్చినై.

హిట్లరు శకం మారిపోయింది. 1948 నుంచీ జర్మన్ప్రజల విషాదగాథలో మహో నూతనాధ్యాయం ప్రారంభమైంది. కాని యీదశలోకూడా జర్మన్ప్రజల ఆత్మచైతన్యం నశించి పోకుండా కాపాడటానికి యుంగర్ తన రచనావైదగ్ధ్యాన్నంతా వినియోగించుతున్నాడు. అధునాతన జర్మన్ సాహిత్యంలో యుంగర్ స్థానం అగ్రగణ్యమైనది. ★★

ఆ కాలమే వేరు, ఆ సంగతే వేరు—నాటి నా స్థితిగతులను గురించి చెప్పదలచుకుంటే సవాలక్ష గ్రంథ మౌతుంది. ఇక నా పేరు మాత్రం యెందుకు చెప్పకోవాలి—నా పేరువింటే మీకు ఏవగింపుకూడా పుట్టవచ్చు; కుటుంబ గౌరవాన్ని మట్టిపాలుచేసిన భ్రష్టుడనని తిడతారేమో కూడా. గత కళ్మలాన్నంతా కమ్ముకోవాలంటే అలాంటి విషయాల్లో మౌనమే శరణ్యం.

దురదృష్టమంటే నాదే—చింపిరమ్మవారు నన్నే వరించి ఎటూ తప్పకోకుండా ఆలింగనంలో అలుముకుని ఊపిరిసలపకుండా చేసివేసింది. దీలో నా తలిదండ్రుల త ్రమీ లేదు. వాళ విధ్యు. ధర్మాన్ని వాళ్లు చక్కగా నిర్వర్తించుకున్నారు. చదువుకు బోలెడు డబ్బు ఖర్చుచేశారు—ఇంత ఖర్చేమని మందలించిందే లేదు. విశ్వవిద్యాలయంలో చదివాను; పరీక్షలన్నీ ప్యాసయ్యాను; కావలసినంత

**అనువాదం: శ్రీ వి. యన్. శర్మ**

డబ్బు కరారావుడిచేసి దేశదేశాలూ పర్యటించి వచ్చాను; ఆయా దేశాలలో గ్రహించవలసిన విజ్ఞానాన్నంతా గ్రహించాను.

చూచిన వస్తువల్లా కొనేవాణ్ణి: ఉన్న రొఖ్ఖమంతా ఉఫ్న ఎగిరిపోయింది: అప్పులు చేయటం ప్రారంభించాను తలకు మించిన అప్పులయిపోయాయి. అప్పులవాళ్ళ బాధ చుట్టుకుంది. ముఖం చాటేసి వాళ్లనుంచి తప్పుకు తిరగటానికి అడ్డమైన అగచాట్లూ పడేవాణ్ణి. క్రమేణా యిల్లూ వాకిలీ పోయింది—వాటితో మిత్రులూ పోయారు. దాంతో నాకు మానవజాతిలో విశ్వాసం పోయింది. విశ్వాసం పోవటమే గాదు, ప్రతి ఒక్కడిమీదా ద్వేషం పుట్టుకొచ్చింది. ఎందు కుండాలి ఆ దిక్కుమాలిన వూళ్లో?

వెళ్ళాను కొత్తచోట్లకి; అవలంబించాను కొత్త దోవలు; చేరారు నాచుట్టూ కొత్త మనుషులు—అన్నివిధాలా నాలాటి రకమే. చేతిలో డబ్బు లేదు. పైసా లేకుండా పరాయిచోట బండి నడవట మెలా? నిర్భాగ్యుడి చేతిలోకి నిరాఘాటమైన రాజమార్గాన డబ్బు చేరుతుందా? అడ్డదోవలు వెతికాను. అదిమాత్రం సులభమా? అయినా ప్రయత్నించాను. పేకాటలో డబ్బు రావచ్చు; దాల్లో వుండే మెలుకువలు నేర్చుకున్నాను. తతిమ్మా ఆటగాళ్ల మానసికతత్వాలను కూడా పూర్తిగా గ్రహించాను. పగలల్లా నిద్ర—ప్రొద్దు గర్భాన పడగానే నిద్రలేవటం. తిన్నగా సోమరిపోతులూ తాగుబోతులు చేరే స్థలాలకు చేరటం. వారితో కాలక్షేపం; రాత్రంతా పేకాట. పేకాట సంగతి చెప్పాలంటే అదో పెద్దగ్రంథమౌతుంది. చేతినిండా డబ్బు—దాంతో అన్నిరకాల పానీయాలనూ చవిమాశాను. తెల్లవారేసరికి ఈ నాటకం పూర్తిఅవుతుంది. ఆటతోపాటు ఆటలో గెల్చిన డబ్బు కూడా ఫైసలైపోతుంది. అనంతరం తగూలూ, తరవాత నెత్తిన గుడ్డ వేసుకుని కాళ్ళీడ్చుకుంటూ యింటిదోవా.

ఇలాగే గడిచిపోతోంది కాలం—ఇలాగే గడిస్తే జీవితమంతా వ్యర్థమే. పేకాట మంచిదే—కాని, దానిద్వారా డబ్బు సంపాదించాలంటే, అడ్డమైన మోసకృత్యాలలో ఆరితేరిన ఘటమై వుండాలి. ఆటకు వచ్చే యితరులు మాత్రం సామాన్యులా? తలలు దీసి తలలు మార్చేరకం? ఇదికూడ ఒక రకమైన గారడీ, ఇంద్రజాలం. అబద్ధాలు చెప్పాలి—అడ్డమైన అప్రమాణాలూ చేసి తోటి ఆటగాళ్లను డొంకదోవను పెడుతూ వుండాలి. ఆటగాడికి కావలసింది అది ఒక్కటే; ఇతర విషయా లాలోచించాల్సిన పని యీషణ్మాత్రమూ లేదు. నీతీ అవినీతీ, పుణ్యం పాపం, ఇలాంటివి పెట్టుకుంటే ఇట్టే పట్టీగొట్టి నాశనమౌతాడు.

ఈ ఆటలో మనకు కావలసింది గెలుపు—గెలుపు—అంతే. గెలవటానికి ఏ అబద్ధాలన్నా ఆడు—పుష్కలంగా డబ్బు గెలవాలి—అంతే మన ఆశయం. ఇతర విషయాలను తలపెడితే అంతా చేతిలోనుంచి చలిమిడిలా జారిపోతుంది. ఆనక తల గోక్కోవాలి. తరవాత మనకు సాయపడేవాడు యే ఒక్కడూ వుండడు. పూర్వకాలంలో ఎందరో మనుషులు జూదాలాడారనీ కోటానుకోట్లు సంపాదించారనీ వింటున్నాం. వాళ్ళంతా మనుష్యులా రాక్షసులా? ఇవ్వాళ కోటీశ్వరులు రేపు బిచ్చాపకీరులు. డబ్బున్నంతకాలం లోకం వారిని శ్లాఘించింది. బికారులుగా తిరగటానికి మొదలు పెట్టేసరికి చెడామడా తిట్టిపోసింది. అందుకే చెప్పారు పెద్దలు—ఈ లోకం ఒక చక్రమనీ, అది ఎప్పుడూ తిరుగుతూ వుంటుందనీ దాన్ని తిప్పేవాడు రాక్షసుడనీ. మనం ఏమంటే నేమి, పతివాడికీ వుంది ఆశ; డబ్బు సంపాదించాలనీ, మేడలు కట్టాలనీ, భార్యా బిడ్డలతో నౌకర్లతో పటాటోపంగా బ్రతకాలనీ ప్రతివాడూ కలలుగంటాడు. క్రొత్తవూళ్ళో వుండి డబ్బు పోగొట్టుకుంటున్నా యిట్టి ఆశే నన్నూ వేదించసాగింది. డబ్బు చేతికివచ్చింది. అది నిలుస్తుందా? దాంతో తాగి తసమిస లాడాను.

అది ఒక హోటలు—నేను ప్రతిరాత్రీ కాలక్షేపంచేసే హోటలు — అక్కడికి అనేకమంది చేర్తారు. వాళ్లు ఉన్నంతసేపూ పెద్ద రణగుణధ్వని; తెల్లవారేసరికి ఎక్కడివా రక్కడ అదృశ్యమైపోతారు. ఎంత అద్భుతమైన నాటకరంగ మిది! సంతోషం, హాస్యం, విషాదం, బీభత్సం—నానా రసాలను అభినయిస్తారు. సమస్తావేశాలనూ వెలిగ్రక్కుతారు. ఈ నాటకంలో అనేక పాత్రలు; ఈనాటకాన్ని చూస్తుంటే నా బుర్ర తిరిగిపోయేది ఒకోనాడు. మైమరచిపోయేవాణ్ణి; నే నెక్కడున్నాను? స్వర్గంలోనా? నరకంలోనా? బల్లమీద కట్టెదుట గ్లాసులో కనుపించుతున్న పానీయమే అమృతం. అమృతం, అనుభవించమని ఆహ్వానిస్తుంటే, అనవసరమైన యితరవిషయాలనుగురించి ఆలోచించవలసిన పనేముంది. అమృతాన్ని సేవించి, అలా

మైమరచిపోతే చాలదా? నేను ఎలాటి మురికిగుడ్డలు కట్టుకుంటే నేం? ఏ పాత చెప్పులు తొడుక్కుంటే నేం... హేళన చేస్తారా?—చేసుకోనీ—నాకు సిగ్గూబిడియా లేవిటి? నాకు కావలసింది అమృతం—నేను పేదవాణ్ణి, అన్నం లేదు, నిద్ర లేదు, విశ్రాంతి లేదు—కాని నాకు కావలసిన అమృతం మాత్రం వుంది. నేను నేర్చిన విద్యద్వారా దాన్ని సంపాదిస్తాను. దారిద్ర్యబాధల అంధకూపంనుంచి, నన్ను స్వర్గధామానికి లేవదీస్తావుండేది ఈ అమృతమే.

## 2

'బ్లాక్ విస్కీ!—ఇది బలతేజాలనిస్తుంది'—నా ప్రక్కనున్న ఒకాయన అతి ఉదాత్తంగా అన్నాడు.

తలెత్తి చూచాను. ఎవరో కొత్తమనిషి—యింతకుముందెన్నడూ ఆయన్ను చూడలేదు. నాతోనే అంటున్నాడా మాట. ఊదారంగు దుసులు వేసుకున్నాడు. ఆ చేతులవంక చూడగానే గ్రహించాను, మామూలు నాటురకం మనిషి కాదని. నాబోటి దేశదిమ్మరులు చేరే యీ హోటలుకు యీయన ఎందుకు వచ్చాడో—ఆయన బహుశా యే మంత్రో అయి వుండాలి, లేదా యే యూనివర్సిటీ ప్రొఫెసరో అయివుండాలి. కనీసం యే ఫ్యాక్టరీ యజమానో అయివుండాలి వాళ్లు చిత్రమైన మనుషులు. తమ పేరూ వూరూ దాచుకుని అప్పుడప్పుడు ఇలాంటి స్థావరాలకు చేరుతూవుంటారు. మావంటివాళ్ల వింత వేషాలనూ, వింత చేష్టలనూ పరిశీలన చేస్తూవుంటారు. మా ముఖాలవంక అదేపనిగా చూస్తూవుంటారు మా భావాలను అవగతం చేసుకుంటూవుంటారు. అలాగే యీయన నావంకకూడా తదేకదృష్టిగా చూస్తున్నాడు — వైద్యుడు రోగిలక్షణాలను పరిశీలించుతున్నట్టు. మళ్ళీ అన్నాడు:

'ఆ బలమే మీకు కావలసింది — ఆ బలం కావాలి' — చేతిలోవున్న గ్లాసు అమాంతం పైకెత్తి గటగటా త్రాగేశాను. ఎంతో రుచిగా వుంది. నరనరాలలోకి విద్యుత్తులా కొత్తశక్తి ప్రవహించింది. ఈ లోకంలోనే ఇంకా వున్నానా! పాతరోజులు జ్ఞాపకమొచ్చాయి. వున్నారా యింకా ఈ లోకంలో కొందరు మంచివాళ్లు! నాలో విజృంభించిన ఈ నూత్న చైతన్యంలో నా యిప్పటి జీవితాన్నే మరచిపోయాను. మళ్ళీ తలెత్తి చూచాను. ఆయన నావైపే చూస్తూ మందహాసం చేస్తున్నాడు:

"ఏవిటలా కళవళపడుతున్నారు—మీ మనస్సులోవున్న రహస్యాలను గ్రహించుతున్నాననా? నేను గ్రహించినా మీరు ఇందులో భయపడాలిసిందేమీ లేదు. ఇదికూడా ఒక గారడీవిద్య—ఒక కళ—గ్రహించగలను — అయినా మీరు భయపడవలసిందేమీ లేదు. నాకు మీ సంగతంతా తెలుసు.—మీబోటివాళ్ళు గ్లాసు ముందరెట్టుకొని ఏమేమి ఆలోచిస్తారో నాకు తెలుసు. పాపం మీ మనసులో ఎన్నో కోరిక లున్నాయ్. అవి ఫలించేదారి దొరక్క దిగులుపడుతూ వుంటారు. ఎందుకలా అణగద్రొక్కుకుంటారు—మీలోవుండే మహావేశాలన్నిటినీ ఎందుకలా వమ్ముచేసుకుంటారు. తలుపు తెరవండి నిర్భయంగా. అప్పుడే ఈ రణక్షేత్రంలో మీరు విజయలక్ష్మిని చేపట్టగలుగుతారు."

జవాబు చెప్పలేదు. ఆయన చెబుతున్న విషయాలను మననం చేస్తూ మౌనం వహించి మథనపడుతున్నాను. ఆయన మళ్ళీ అందుకున్నాడు.

'ఏవిటి అలా మౌనం వహించి వూరుకున్నారు. యంత్రానికి చైతన్యశక్తినిచ్చి సంచలనం పుట్టించండి. దాంతో మీలో స్తబ్దుడై పడున్న మానవుడు సజీవుడై పైకిలేస్తాడు. ఆటలోవున్న తమాషా అంతా అక్కడే వుంది. ఏమంటారు?'

'నిజంగా గెలుస్తామా ఎన్నటికైనా?—నిజంగా మీరు గొప్పవారు—మానవుల ఆలోచనలను తెలుసుకోగలరు—వాళ్లకు సంతరణోపాయం చూపగలరు'—

'అహహా! ఎందుకలా పొగడుతారు—ఇందులో నేను చేయగల సహాయమేమి వుంది—సరే ఆమాట అలా వుంచండి—ఇది ఇలా చూడండి' అంటూ పేకముక్కలు చకచకా కలుపుతున్నాడు.

'కోరుకోండి మీ యిష్టం వచ్చిన మూడు ముక్కలు!'—

'ఇస్పేటు ఏడు, ఆటీన్ రాజు, కళావరు ఆస్!'—

ఆశ్చర్యం! ఎంత అద్భుతం! నిజంగా గారడీ! ఆ మూడుముక్కలూ నా చేతికిచ్చాడు. నిజంగా ఎంత తెలివిగలవాడు. ఆయనమీద నాకు ఎక్కడలేని గౌరవం ముంచుకొచ్చింది.

'నిజంగా మీరు చాలా గొప్పవారు! నా మనసులో వున్న కోరికను ఎలా గ్రహించారు; ఏవో

కథల్లో విన్నాను ఇలాంటి సంగతులు. ఇప్పుడు ప్రత్యక్షంగా కళ్లతో చూస్తున్నాను'!

ఈమాట అనేటప్పటికి ఆయనలో కూడా హుషారు పుట్టుకొచ్చింది. మళ్లా నవ్వుతూ అన్నాడు:

'ఇదో బ్రహ్మవిద్య అనుకుంటున్నారా?—కాదు కాదు—ఇంత సులభమైన కార్యం మరొకటి లేదు మరొక తమాషా చేద్దామా?"

ఈసారి నేనే కలిపాను చీట్లను. వాటిని నా ముందే బల్లమీద పరుచుకున్నాను.

"మీరే ఆలోచించుకోండి మూడు ముక్కలనూ—నాకు చెప్పక్కరలేదు—మీరే గుర్తించండి—గ్రహించారా?"

ఆయన చెప్పినమాదిరే మూడు ముక్కలనూ గుర్తించి పైకి తీశాను.

'చూశారా! ఇప్పుడు చెప్పండి—మనసులో ఆలోచనలను గ్రహించింది మీరా నేనా?—ఈ ప్రశ్నకు మీరు జవాబు చెప్పక్కర్లేదు. — ఇదిగో ఇలా వినండి — ఆలోచనలుకూడా ఒక విధమైన రూపాలు: వాటికికూడా ఒకరకమైన కళాకాంతు లుంటాయి. ఈ కాంతులే మెదడులో వున్న రహస్యాలను బయటపెడుతూ వుంటాయి. చీట్లపేకలోవున్న కిటుకు యిదే. రోలెట్ ఆటలోవున్న తంత్రమూ యింతే. రోలెట్ ఆటలో గుండువంక తదేకదృష్టిగా చూస్తూవున్నా, చీట్లవంక తదేకదృష్టిగావున్నా, మన మనసులో వున్న తలపులు బయలుపడతాయి. ఈ రహస్యాన్ని గ్రహించాలనివుందా మీకు? చెప్పమంటే చెప్పేస్తాను'

ఆయనమీద నాకెంతో భక్తి కుదిరింది—ఆయన ఈమాటలు హాస్యాని కనటంలేదు. నేనూ నా ఆమోదాన్ని ప్రకటించుతూ చిరునవ్వునవ్వాను. ఆయనతో అన్నాను:

'ఈ రహస్యమే మీకు తెలిసివుంటే—తెల్లవారేవరకూ ఎందుకిక్కడ పడుండాలి—వెంటనే ఆట ముగించెయ్యలేరా?'

ఈమాట అనేసరికి ఆయనకు ఎక్కడలేని సంతోషం వచ్చింది. చుట్టదమ్ము గట్టిగా పీల్చాడు.

'నిజంగా మీరు అసాధ్యం మనుషులు—ఈ రహస్యాన్ని తెలుసుకున్నారు—ఇప్పుడు మీరు తలుచుకుంటే కోట్లకొలది ధనాన్ని సృష్టించెయ్యగలరు—ఏమండీ?'—

ఆయన మాట్లాడలేదు. నవ్వుమొగం పెట్టాడు—క్షణం ఏదో ఆలోచించాడు. చిరునవ్వునవ్వుతూ:

'మొత్తానికి మీరు తెలివిగలవారే—కాని మీ ప్రతిభాసంపత్తులను చూపే శక్తిమాత్రం యింకా రాలేదు—అదంతా అలా వుంచండి—అల్లాఉద్దీన్ లాంతరులో వున్న గుట్టంతా ఇలాంటిదే—ఆ రహస్యాన్ని గ్రహించాలని కోరికవుంటే చెబుతాను—మీ కోరికలను సాధించుకునే విధానాన్ని—... కాని... కాని...'ఇక్కడ కాదు'—క్షణం ఆగాడు—మళ్ళా సరాల్న:

"మిమ్మల్ని ఏదో వ్యాపార లావాదేవీల్లోకి దింపటానికి ప్రయత్నించుతున్నాననుకుంటున్నారా యేమిటి కొంపతీసి"—అని పక్కున నవ్వాడు.

ఎంత గడుసుమనిషి నా హృదయంలో వున్న కలవరాన్నంతా ఇట్టే పసిగట్టేశాడు!

'నావంటి అల్పుడికోసం మీరీ శ్రమంతా ఎందుకు పడుతారు బాబూ!—మీదయ—మీకు నామీద అంతకరుణ గలిగిందంటే, రమ్మంటే వస్తాను'—

నౌకరును పిలిచి నాబిల్లూ ఆయనబిల్లూ కూడా చెల్లించేశాడు. ఇద్దరం లేచాం—

ఇంకా తెల్లారలేదు వీధులన్నీ చీకటిగానే వున్నయ్. బజార్లల్లో మానవసంచలనమే లేదు. ఆయనప్రక్కనే, తలవంచుకు మౌనంగా నడుస్తున్నాను. తనవెంట నన్ను ఎందుకు రమ్మంటున్నాడు? ఎక్కడికి తీసుకుపోతున్నాడు? ఏమీ అర్థంకాని అయోమయావస్థలో పడి తన్నుకుంటున్నాను. ఒక్కటిమాత్రం విస్పష్టంగా తెలుస్తోంది. ఏ మచ్చన్నాచల్లనీ, ఏమంత్రమన్నా వెయ్యనీ, నన్ను మాత్రం తనవలలో పట్టుకున్నాడు. సరే పట్టుకున్నాడనుకోండి—పట్టుకుని ఏంజేయబోతున్నాడు. ఇలా ఆలోచించుకుంటుంటే నా చిన్ననాటిరోజులు జ్ఞాపకానికి వచ్చాయి. ఆనాడు నాకు యిలాం క్లిష్ట సమస్య లేవీ ఎదురయ్యేవే కాదు. నా బాధ్యతంతా తలిదండ్రులు మోస్తుంటే, రాజెవడికోడునురా అని హాయిగా తిని తిరుగుతూవుండేవాణ్ణి. ఆ రోజులు మళ్లా ఎప్పటికేనా వస్తాయా? నా జన్మకు శాంతి అనేది ఎప్పటికైనా లభిస్తుందా? ఓటి రథంలా వున్న ఈ జీవితాన్ని ఇలా ఎంతకాలం, భయంకరమైన ఈ

మిత్రులపళ్లాల ఒడిదుడుకులబాటను లాక్కుపోతూ వుండాలి?

కొంతసేపటికి గమ్యస్థానం చేరాం. ఒక యింటి ముందు ఆగాం. అది సామాన్యమైనలోగిలా? రాజప్రాసాదాలను మించివుంది. ఎన్నో అంతస్థుల మేడ. ప్రతి అంతస్థులోనూ ఆఫీసులు. వాటిని సూచించే 'సైన్‌బోర్డు'లు అపురూపమైన ఆ మందునుగురించీ దాని ప్రభావాన్ని గురించీ తెలిపే ప్రకటనలు, భవంతి ముందూ, మెట్లపొడుగునా ఎక్కడబడితే అక్కడ అమర్చివున్నాయి. లోపలికి వెళ్ళాం. పై అంతస్థుకు తీసుకుపోయే 'లిఫ్ట్' తలుపు తెరిచాడాయన. దాన్లో ప్రవేశించాం. ఎంత పైకెళ్ళిపోయామో తెలీదు. — ఆయన ఆఫీసుగదికి చేరాం. తలుపుమీద ఒకబోర్డు. దానిమీద ఇలా వ్రాసివుంది:

"డాక్టర్ ఫాస్ట్--నేత్ర వైద్యుడు"

తలుపుతీశాడు — పెద్దహాలు: దానికి వెనుక భాగంలో ఆయన వైద్యశాల. నన్ను వెంటబెట్టుకుని వైద్యశాలలోకి తీసుకెళ్ళాడు. బల్లలమీద డాక్టరు తాలూకు సాధనసామగ్రి యావత్తూ అమర్చబడివుంది. గోడలమీద కళ్ళపరీక్షకు సంబంధించిన చార్టు లున్నయ్. ఇవన్నీ చూసి చాలా ఆశ్చర్యపడ్డాను. ఈయన ప్రఖ్యాతి వహించిన నేత్రవైద్యుడు. ఈయనగారు నన్నెందుకు తీసుకొచ్చినట్టు! నాకేం కంటి జబ్బుం దనుకోలేదుగదా, కొంపదీసి!

కుర్చీలో కూర్చోబెట్టాడు — కోటు మార్చి డాక్టర్లు వేసుకునే బారాటి తెల్లకోటు తొడిగించుకున్నాడు. నా కళ్లను ఎంతో నిదానంగా పరీక్ష చేశాడు. నా కనుపాపలలోకి తదేకదృష్టిగా చూశాడు. ఏ గారడిచేశాడో! ఏమచ్చు చల్లాడో! యిట్టే నిద్రముంచుకొచ్చేసింది. ఆయన యేవో అంటున్నాడు. ఆమత్తులో ఆయన చెప్పేది నాకెలా అర్థమౌతుంది?...కొంతసేపటికి ఏవో అస్పష్టంగా వినిపిస్తోంది.

'అనవసరంగా మీ రిక్కడ ఎంతోసేపు పడి వుండక్కర్లేదు. మీ మనస్సులో కొన్ని వాంఛ లున్నయ్—అవి నాకిప్పుడు తెలిసిపోయాయ్! సవ్యమైన మార్గానపోవాలనే వాంఛిస్తున్నారు—కాని ఆ మార్గం ఫలానా అని మీకు అంతు చిక్కటం లేదు. ఈ లోకంలో రెండు రకాల మనుషు లున్నారు: అజ్ఞానులూ, జ్ఞానులూ. మొదటిరకం ఇతరులు చెప్పినట్టు విని ఆ ప్రకారం నడుస్తారు. వారి కెప్పుడూ దాస్యం చేస్తూవుంటారు. రెండో రకం లోకాన్ని పాలించేవాళ్లు. ఈ రెండు రకాల మనుష్యులకూ వుండే వ్యత్యాసం యిదే.

లోకచక్రం రెండు శక్తులను ఆధారం చేసుకుని పరిభ్రమిస్తూ వుంటుంది. దైవశక్తి మొదటిది. పరిస్థితుల ప్రభావం రెండవది. అజ్ఞానులు సర్వాన్నీ దైవేచ్ఛకు వదిలేసి కళ్లు మూసుకు నడుస్తారు. తెలివితేటలు గలవాళ్లు అలా చెయ్యరు. పరిస్థితులను అవగతం చేసుకుని అందుకు అనుగుణమైన పంథాలో నడుస్తూ వుంటారు. ఆ పంథా యేదో కనుక్కోవటానికీ, పట్టాలు తప్పకుండా ఆ మార్గాన్ని అనుసరించి ముందుకు సాగిపోవటానికీ తమకున్న శక్తిసామర్థ్యాలన్నిటినీ ఉపయోగించుకుంటూ వుంటారు. అలాంటి తెలివిగలవాళ్ల సంఖ్య బహుపరిమితంగా వుంటుంది. మిగతా జనమంతా, పట్టి గొర్రెల గుంపు. గాఢాంధకారంలో నడుస్తూ వుంటారు. కోరికలూ తాపత్రయాలూ లేక కాదు—కాని వాటిని సాధించటానికి తగిన శక్తిగాని, సహసంగాని వుండవు. తమలో వున్న ఆత్మశక్తిని అవగతం చేసుకోవడానికి వాళ్లకు స్థిమిత మేదీ?"—

డాక్టరు ఇదేధోరణిలో మాట్లాడుతున్నాడు—శబ్దాల చప్పుడుకూడా మధ్యమధ్య వినిపిస్తోంది. ఈ అయోమయావస్థలో ఉండుండి కపాలంమీద యేదో ఒత్తినట్టు నొప్పి—మరోసారి కళ్లమీద అపరిమితమైనబాధ. నన్ను ఈ అయోమయావస్థలోపడేసి ఏమి చేసేస్తున్నాడో! ఒకచెంప, యింతపనిలో వుండికూడా తన ఉపన్యాసధోరణిమాత్రం ఆపలేదు. చెప్పుకుపోతూనే వున్నాడు: 'రెండు గదులలో నివసించుతూవుంటాడు, మానవుడు. ఒకసారి లోపలిగదిలోకి నడుస్తాడు; మరోకసారి వెలుపలిగదిలోకి వస్తాడు. ఏగది మంచిది? ఏది సుఖశాలమైంది? అందమైనదేది? ఏది చిన్నది, కుంచితమైనది?—మనిషి ఈ రెండుగదుల రహస్యాన్నీ బాగా తెలుసుకోవాలి. మాటవరసకి మీ సంగతే తీసుకుందాం?— మీరీ గదుల్లో వుంటున్నారు. చీట్లపేకాడతారు — కాలక్షేపంచేస్తారు; వ్యాపార విషయాలు చర్చించుతారు. అప్పుడప్పుడు మిమ్మల్ని చూడానికి మీ కెప్పుడూ ఎరగని కొత్తవా రెవరోవస్తూ వుంటారు. వారిలో ఎవరు మంచివాళ్లు—ఎవరు చెడ్డవాళ్ళు—ఎవడు ఎలాంటి రకం—తెలుసుకోవాలి మీ తెలితేటలన్నీ ఉపయోగించి—అలా తెలుసుకో

లేకపోతే బండి బోల్తాకొట్టి తల్లక్రిందు లౌతుంది; విరిగి ముక్కలౌతాయి చక్రాలు. ప్రతివాడికీ దివ్య దృష్టివుంది. దాన్ని ఉపయోగించుకోటం నేర్చుకోవాలి—ప్రాచీనులైన యోగీశ్వరుల మాదిరి. ఈ శక్తిని బాహిరిల జేయటానికి సాధన అవసరం. అప్పుడే మనుష్యులు మీరు—దైవశక్తి మీలో అప్పుడే ప్రకాశించుతుంది. అది దేదీప్యమానంగా ప్రకాశించిందా మీరిక అనురులే—జరామరణా లుండవు—జన్మ రాహిత్యం పొందుతారు'—

ఇలా అంటూ డాక్టర్ ఫాన్సీ నావంక తేరి చూచాడు. తలకు ఏదో యంత్రాన్ని అమర్చు కున్నాడు. దేదీప్యమానంగా ప్రకాశించుతోంది ఆ యంత్రం. అవి అద్దాలా? లేక వజ్రాలకిరీటమా? కుర్చీ నాముందుకు యీడ్చుకుని కూర్చున్నాడు చేతిలో ఏదో గాజు గొట్టం

అబ్బా! ఎంతబాధ-

ఆ గొట్టంతో అలా నొక్కి ఎందుకలా బాధ పెడుతున్నాడు?తన శస్త్రచికిత్సా నైపుణ్యాన్నంతా నామీదనే చూపాలా?

'బ్రాందీ చక్కగా పనిచేసింది' అన్నాడు, చివరికి. తలవెంట్రుకలు ముఖంమీదికి ముసురుకుంటు న్నయ్. ఆయన ముఖం సరీగా కనుపించటంలేదు. ఏదో చెప్పాలని పెదవులు మెదిపాను. మాట పెగ లేదు—నాలి కెండిపోయింది. మాట తడబడుతోంది. గాజుగొట్టంలోనుంచి రెండుమూడుబొట్లు నాకంట్లోకి జారినయ్. కళ్లు భగ్గున మండిపోయాయి. భరించరాని బాధ—ఏమీ కనుపించకుండా పోయింది. గాఢాంధ కారం!...మూర్ఛపోయానో యేమో!—

కొంతసేపటికి మెలకువ వచ్చింది. ఆయన యింకా నాముందే కూర్చునున్నాడు. దూదితో కళ్లు తుడుస్తున్నాడు.

"పాపం!—చాలా బాధపడ్డారల్లే వుంది. ఇకేమీ బాధవుండదు—చికిత్స ముగిసిపోయినట్టే; ఇందుకు మీరు నాకేమీ ఫీజు యివ్వక్కర్లేదు. మీ మనస్సు సంతోషించితే అంతే చాలు—చికిత్స చాలా విజయవంతంగా జరిగింది.

కళ్లు తెరిచి చుట్టూ కలియ జూచాను. ఆయన చేసినం పనంతా అవగతం చేసుకుంటే నాలో నాకే ఆశ్చర్యం వేసింది. ఎన్ని పరికరాలు వాడాడు! చుట్టూవున్న బల్లమీద ఎన్నో రకాల పరికరాలు చెల్లాచెదరుగా పడివున్నయ్.

'మీరు చేసిన సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి—నాకు సెలవిప్పించండి—నేనిక వెళ్ళాలి—వంట్లో చాలా నీరసంగా వుంది—అయినా వెంటనే వెళ్ళాల్సిన పనుంది...'

కొంతసేపు ఊరుకున్నాను...ధైర్యం తెచ్చుకుని అడిగాను—'కొంచెం పైకమేమైనా సర్దగలరా? చేతిలో ఏమీ లేక అడుగుతున్నాను లెండి—'

ఓస్! యీమాత్రానికేనా యింత మొహమాటపడు తున్నారు—వెయ్యిరూపాయల నోట్లుతప్ప, చిల్లర నోట్లు దగిర పెట్టుకునే అలవాటులేదు నాకు అంటూ బల్లదగ్గరకు వెళ్ళి డ్రాయరులాగి దాంట్లో నుంచి ఒకనోట్లకట్ట తీసుకొచ్చి నా చేతి కిచ్చాడు:

'ఇందులో చిన్ననోట్లు మాత్రం యిప్పుడు ఉండండి—లేకపోతే యెవరేనా అనుమానించి పట్టు కుంటారు—మీ వ్యాధి కుదిరి పోయింది—దాని విష యం ఇక మీరు విచారించక్కర్లేదు మీ అవయవా లన్నీ యిప్పుడు చురుకుగా పనిచెయ్య గలవ్—వాటిని చక్కగా ఉపయోగించు కోండి; అవే మిమ్మల్ని రాజబాటను నడిపించుకు పోతాయి.

ఆయనకు తిరిగి మరొకసారి కృతజ్ఞత తెలియ జేసి బయటి వచ్చేశాను.

## 4

ఇంకా బాగా తెల్లవారలేదు: కప్పెడుకప్పెడు చీకటిగా వుంది. అలా వీధివెంటబడి కొంతదూరం నడిచాను. భీభత్స రసంలో నడచిన గతజీవితా న్నంతా మరచి పోవటానికి ప్రయత్నించుతున్నాను డాక్టరు నన్ను హోటల్లో కలుసుకోవటం, నాతో ఆయన చర్చ, తన చికిత్సాలయానికి తీసుకుపోవటం, ఆయన చేసిన చికిత్స—ఇదంతా తలుచుకుంటే ఆశ్చర్యం వేసింది. నిజంగా యిది నా ' నాటకంలో ఒక అద్భుత ఘట్టమే!

కొంతసేపటికి ఒక పార్కులోకి చేరుకున్నాను. ఈవిచిత్రాన్నంతా ఆలోచిస్తూ అక్కడ ఒక బల్ల మీద కూర్చున్నాను. జేబు తడిమిచూసు కున్నాను. డాక్టరిచ్చిన నోట్లకట్ట అలానేవుంది. కట్ట బయటకితీసి నోట్లు లెక్కబెట్టాను. దొంగనోట్లు కాదు. ప్రభుత్వ

చలమాణీలో వున్న నిజాయితీ నోట్లే. ఇంతసొమ్ము ఆయన దేశదిమ్మరికి నాకెందుకిచ్చాడు? ఏమిటీ ఉదారత — నామీద ఎందుకింత దాక్షిణ్యం. ఎంత ఆలోచించినా అర్థంకాని సమస్య! అగాధమైన సముద్ర మధ్యంలో నావతో సహా మునిగిపోయిన మనిషిని ఇప్పుడు ఆయన దయవల్ల ఒక తీరానికి చేరాను. అంతేకంటే ఏమనుకోవాలి.

అక్కడ ఎంతసేపు ఇలా ఆలోచిస్తూ కూర్చున్నానో నాకే తెలియదు. తెల్లవారింది సూర్యోదయమైంది. చలితీరింది. డాక్టరు తన శస్త్ర చికిత్సద్వారా నాకు నూతన తేజాన్ని ప్రసాదించాడు. ఈ తేజాన్ని చక్కగా వినియోగానికి తెచ్చుకుని ధన్యత పొందవలసిన బాధ్యత ఇక నామీదనే వుంది. ఆయన మేలు ఎలా మరిచిపోను. మరొకసారి నోట్లకట్ట తీశాను. మరొక పర్యాయం వాటిని లెక్క పెట్టాను.

ఇలా వ్యర్థంగా ఆలోచిస్తూ కూర్చుని లాభమేమిటి? తలదాచుకోవటానికి ఒక కొంప చూసుకోవాలి నూతన జీవితానికి నాందిగా — క్రొత్త జీవితానికి అనువైన దుస్తులు కొనాలి!

అమ్మో వెంటనే క్రొత్తయిల్లా! ప్రమాదం. పూర్వంవున్న గదికే వెళ్ళటం మంచిది. అక్కడే దుస్తులుమార్చి క్రొత్తజీవితానికి ఉపక్రమించాలి. నిచ్చెన ఎక్కినట్టు ఒకొక్క మెట్టే పైకెక్కినట్టు నలుగురికీ తోచాలి. క్రమేణా పైకిపోయిన తరవాత అప్పుడు మేడలు కటవచ్చు, శిఖరాలు ఎత్తవచ్చు — ఆపైని అదృష్టదేవత సర్వాలంకారాలతో వచ్చి తనంతట ఆలింగనం చేసుకుంటుంది.

ఈపిచ్చి తలకెక్కేసరికి నాలో ఎక్కడలేని ధైర్యమూ పుట్టుకొచ్చింది. ఆధైర్యంతోనే నా పాత బస చేరుకోవటానికి ట్రాం బండీయెక్కి, ధీమాగా బయలుదేరాను. ట్రాం కదిలింది; మామూలుగానే జనం కిటకిటలాడి పోతున్నారు ట్రాం కండక్టరూ తోటిప్రయాణికులూ నావంకే చూస్తున్నారు. చూడరేంజేస్తారు నా చింకిగుడ్డలూ, జిర్రబొచ్చూ నావాలకం ఎలావుంది మరి! నే నేరకం మనిషినో నాదుస్తులు చెప్పేస్తున్నాయి గదా! వాళ్ళు నన్ను చూడనట్టే నటించుతూ, ప్రాణాలు బిగబట్టుకుని ఎలాగో ఒకలా కొంచెంసేపు ట్రాంలో నే ప్రయాణం చేశాను. తరవాత, నావాలకం నేనూ, ఆబండిలో ప్రయాణం చేయటానికి నాకే భయమేసింది; బండిదిగి నడిచాను; జనం కంటబడకుండా వుండటానికి, సందుల వెంటా గొందుల వెంటాబడి చుట్టుతిరిగి పోతున్నాను. మళ్ళా కొంతసేపయే సరికి తిరిగి రాజబాట దగ్గిరికి చేరుకోవలసి వచ్చింది. అక్కడో పెద్దగుంపు మూగి వున్నారు నేనింతాక ప్రయాణం చేసిన ట్రాంబండి పట్టాలుతప్పి తలక్రిందులై రోడ్డు మీద పడివుంది. ప్రయాణీకు లందరికీ గాయాలు! ఇందాక నావంక వెర్రిజంతువును చూసినట్టు చూసిన ట్రాంకండక్టరుకికూడా ప్రమాదకరమైన దెబ్బతగిలింది నెత్తిమీద. నెత్తురు వరదలై పోతోంది. స్పృహలేని స్థితిలో ఆసుపత్రికి తీసుకు పోతున్నారు అదంతా చూసేసరికి నాకు కాళ్ళు వణికినై; ఇక అక్కడ నిల్చోలేక పోయాను. మానవుడు ఎన్నో వెర్రివెర్రి ఆశలు మూటగట్టుకుని బయలు దేరతాడు — కాని చివరికి అంతా ఇలా మన్నుపాలై పోతుంది. నేను కూడా ఆబండిలో అలానే కూర్చునుంటే ఈపాటికి నాగతికూడా ఇంతేగదా! ఈభీభత్స ఘటనను తలపోసుకుంటూ మళ్ళా నాదారిన నేను బయలుదేరాను.

సాయంత్రమయ్యేసరికి నాగదికి చేరుకున్నాను. స్థిమితంగా కూర్చుని టీ తాగుతున్నాను. నిజంగా ఆనాడు జరిగిన సంఘటనల నన్నిటినీ మరిచిపోవాలంటే మంచి పానీయమేదైనా వుండాలి. కాని ఆపేదవాడిలో టీతప్ప మరోపానీయ మెలాలభిస్తుంది. ఇన్నాళ్ళనుంచీ క్షౌరంలేక చిక్కగా పెరిగివున్న గడ్డాన్ని శుభ్రంగా గీసివేశాను. హాయిగా స్నానం చేసి, త్రోవలో కొనుక్కు తెచ్చుకున్న సూటు వేసుకున్నాను. నా ప్రక్కనే ఆవేళ కొన్న క్రొత్త పెట్టెలో ఎన్నో క్రొత్తబనియన్లూ, తువ్వాళ్ళూ, చేరుమాళ్ళూ, లాగులూ చొక్కాలూ పెట్టె పట్టకుండా కుప్పతెప్పలుగా వున్నయ్! నాతలలోకూడా దొంతర్లు దొంతర్లుగా ఎన్నెన్నో ఆలోచనలు! మధ్య మధ్య, పైకం జాగ్రత్తగా వుందా లేదా అని జేబు తడిమి చూసుకుంటున్నాను. దర్జాగాకూర్చుని పొగ పీలుస్తున్నాను.

నేను అద్దెకున్న యింటి యజమానురాలు సామాన్యం మనిషికాదు. ఒకసారి నేను పాతబాకీ అంతా ఒక్కసారిగా చెల్లించే సరికి ఆవిడకు నామీద ఎక్కడలేని అనుమానం పుట్టుకొచ్చింది. న్యాయానికి ఆమెను చెడ్డమనిషని అంటానికి కూడా వీల్లేదు.

వెనక నాతోపాటు యీగదిలోనే మరొకడు అద్దెకుండేవాడు — నారకంమనిషే. వాడు ఉన్నట్టుండి

తను నౌకరీ చేస్తున్న యజమానిని మోసగించి కొంత డబ్బు కొట్టేశాడు. ఇష్టంవచ్చినట్టు ఆసొమ్మును జల్సాగా ఖర్చుపెట్టడం మొదలెట్టాడు. అదిపసిగట్టి పోలీసులు పట్టేసి జైల్లోపారేశారు. ఈవిడ అప్పు డప్పుడు జైలుకివెళ్ళి వాణ్ణి చూసి వస్తూవుండేది. నాకొత్త అవతారాన్నీ, నాకొత్త సరంజామానూ చూసేసరికి ఆమెకు అనుమానం వేసింది. నాకుకూడా అకస్మాత్తుగా యింతసొమ్ము ఎలావచ్చిందా అని.

ఇలా ఆలోచిస్తూ కూర్చున్నాను. హఠాత్తుగా ఒక సంగతి జ్ఞాపకమొచ్చింది. నా గదిలో వుండిపోయిన ఆ మిత్రుడి సంగతంతా నాకు బాగా తెలుసు. వాడు చాలా పెద్దమొత్తాన్నే సంగ్రహించాడు. ఆ డబ్బంతా ఖర్చుచెయ్యలేదు. ఆసంగతి నాకు తెలుసు. అయితే ఆ సొమ్మంతా ఎక్కడ దాచిపెట్టవుంటాడు? ఇంటి యజమానురాలు కొంత సొమ్ము కాజేసింది. అలాంటి వ్యవహారాలను అంజించుకోవటంలో ఆవిడది అందెవేసిన చెయ్యి. వాడుకూడా ఏవంత సామాన్యం మనిషి కాదు. ఆవిడకంటె రెండాకు లెక్కువ చదివినవాడే. డబ్బంతా దానికంటబడనిచ్చాడా! అది యీ గదిలోనే ఎక్కడో వుండితీరాలి.

ఈరకం మనుషుల స్వభావం నాకు తెలుసు. వాళ్ళు డబ్బూ దస్కం పెట్టెల్లోనూ బీరువాల్లోనూ దాచరు. వాటిని మించిన మరుగులుంటై వాళ్ళకి. పోలీసులు బడి యీ గదంతా గాలించి వదిలిపెట్టారు. కాని వాళ్ళ కెక్కడగా అంతుచిక్కలేదు.

తలుపు మూసేసి గట్టిగా గడియ బిగించాను. గదిన బడి పరిశీలించటం మొదలుబెట్టాను. గదిలో హొయ్యికి సమీపంలో చలువరాయి పరచిన ఒక దిమ్మ వుంది. దానిమీద దీపమూ, గడియారమూ వుంచే అలవాటు. అమాంతం ఆ రాయి పెల్లగించాను. పెద్ద సొరంగం! నోట్లకట్టలూ, బంగారు నాణాలూ! ఇంకా యేవేవో నగలూ నాణాలూ అనేకం! చిన్న మొత్తం అనుకున్నారా—లక్షకు పైబడిన సంపద. మళ్లా వాటినన్నిటినీ అక్కడే వుంచి చలువరాయి మూసేశాను.

డాక్టరును కలుసుకున్న మరుక్షణంనుంచే ప్రారంభమైంది నా జీవితంలో ఈ ఉజ్జ్వల ఘట్టం. ఇప్పుడు ఈ రహస్యాన్ని గ్రహించగలిగానంటే డాక్టర్ చేసిన శస్త్రచికిత్సే కారణమనుకోవాలి. డాక్టర్ ప్రసాదించిందే ఈశక్తి—ఈ నూత్నదృష్టి—కాని జాగ్రత్తగా నడవాలి. ఇప్పుడు నాలో పొటమరించిన ఈ తెలివితేటల నన్నిటినీ ప్రపంచం మీద ప్రయోగించి విజయపరంపరను చేపట్టాలి!

నూతనపంథాలో జీవితయాత్రకు తిరిగి ఉపక్రమించాను. చేతిలో ఎంత డబ్బువున్నా, చలువరాతి పలకక్రింద ధనలక్ష్మి మూలుగుతున్నా, కొంత కాలం వరకూ బీదవాడి నాటకాన్నే ఆడదలచాను. కాని నా మనోవీధిలో ఆలోచనలు మితిమీరి ప్రవహించుతున్నాయి. నేనిప్పుడు చాలా భాగ్యవంతుణ్ణే; కాని దీంతో తృప్తికలగటంలేదు. ఇంకా గుటలు గుట్టలుగా ధనం పోగుచెయ్యాలి. నాకున్న సాధన సంపత్తి నంతా ఉపయోగించి, నిర్విరామంగా ధనసంపాదన చెయ్యాలి. పాతవ్యసనం మీదికే తిరిగి నా దృష్టి మరలింది. రాత్రిళ్ళు వెళ్ళి మళ్ళీ పేకాట ప్రారంభించాను. ఈ నేత్రచికిత్సకారణంగా ఆటలోవున్న మర్మాన్నంతా చక్కగా తెలుసుకోగల్గుతున్నాను. పూర్వం ఆటలో ఓడిపోతే, ఎక్కడలేని ఉక్రోషం దుఃఖం ముంచుకొచ్చేది. నా మనస్సును అల్లకల్లోలం చేసి పారేసేది. ఇప్పుడు, అలా అలజడి పడి లాభం లేదని చక్కగా గ్రహించగలిగాను. ఒకటి రెండు సార్లు ఆటలో ఓడినా ఫరవాలేదనుకున్నాను. ఓడిపోవాలి, ఓటమితోగాని అనుభవం చిక్కదు. ఆ ఓటమివల్లనే సహనమూ, ఓర్పూ మనలో ప్రభవించుతుంది. ఆ శక్తి కలిగిందా, ఇక ఫరవాలేదు. విజయమన్నది అప్పుడే లభించుతుంది. అలాంటి శక్తిగలవాడి అడుగుజాడల ననుసరించి విజయలక్ష్మి నిరంతరం నడుస్తూవుంటుంది. ఈ రహస్యాన్ని తెలుసుకునేసరికి నాలో ఎక్కడలేని ఉత్సాహమూ పుట్టుకొచ్చింది. సాహసోపేతుడనై ముందుకు సాగాను. పరాజయంలో విజయం, విజయంలో విజయం—ఇక నాకు పతనమంటూ లేదు!

ఇన్ని ప్రతిభా సంపదలుగల మహామహుణ్ణి వ్యర్థంగా ఈ పూరిగుడిసెలమధ్య కాలక్షేపం చెయ్యటం మంచిది గాదనుకున్నాను. భాగ్యవంతులుండే పేటకు మకాం మార్చేశాను. ఒక పెద్ద లోగిలి అద్దెకు తీసుకున్నాను. గృహనిర్వహణబాధ్యతను వహించటానికి యింటినిండా నౌకర్లను ఏర్పాటు చేశాను.

కొంతకాలానికి నా తలిదండ్రుల ఆస్తి యావత్తూ కూడా తిరిగి నాకు సంక్రమించింది. దాంతో వ్యాపార సాపారాల కుపక్రమించాను. ఎన్నో  వలు  న్నాను.  వటకెలుకు

వ్యాపారం చక్కగా నిర్వహింపబడుతూ వుండటానికి అనేకచోట్ల ఆఫీసులు స్థాపించాను. వాటిని నిర్వహించటానికి తగిన సమర్థులను ఉద్యోగాలలో నియమించాను. ఈకాలంలో వ్యాపారం వంటిది మరొకటి లేదు. బ్యాంకుల్లో సొమ్ము దాచుకోవటం మంచిదే. కాని లాభమేమిటి? వడ్డీతప్ప మరేమీ గిట్టుబాటు గాదు. బ్యాంకులుమాత్రం మేం చేస్తున్నదేమి? మూలధనాన్ని తిప్పుతున్నాయి అచిరకాలంలో బ్యాంకుల సంపద ద్విగుణీకృత మౌతుంది. నేనూ నా మూలధనాన్నంతా ఇలాగే ఉపయోగించాను—నా స్వంత వ్యాపారాన్ని పెంపొందజేయటానికి. పెద్ద వ్యాపారిగా పేరులో కొచ్చాను. దీంతో తృప్తిపడి వూరుకుంటే నేను మనిషినా?

దూర దేశంలో ఒకచోట పెట్రోలియం దొరికే ప్రదేశం వుందని విన్నాను. తగినంత మూలధనం లేక ఆ పరిశ్రమ పైకి రాలేకపోతోందని కూడా వ్యాపారస్థులద్వారా విన్నాను. ఎకాయెకి అక్కడికి వెళ్ళి ఆ కంపెనీ యజమానిని కలుసుకున్నాను. ఆయన తన గోడవంతా చెప్పాడు. ఆయనతో కలిసి వ్యాపారం చెయ్యటానికి ఒక ఒడంబడిక కుదుర్చుకున్నాను.

కొత్త ఫ్యాక్టరీలు కట్టాం. పనివాళ్ళను, అనేక చోట్లనుంచి,యంత్రాలను దిగుమతి చేసుకున్నట్టు,దిగుమతి చేసుకున్నాం. అనతికాలంలో పరిశ్రమ ఎంతో వృద్ధిలోకి వచ్చింది. లక్షలాదిగా ఆదాయం వస్తోంది. నా బుర్రకు ఒక పసందైన ఊహ తట్టింది.

పరిశ్రమను నేనే పూర్తిగా కొనేసి స్వాధీనం చేసేసుకున్నాను. నూనె అమ్మకానికి నా స్వంత మనుషులనే అన్నిచోట్లా నియమించి వ్యాపారం మరింత జోరుగా సాగించాను. ఇతర నూనె కంపెనీలను కూడా చాలావరకు కొనేశాను. నూనె వ్యాపారంలో నాదే యిప్పుడు పెద్దచెయ్యి. నేను నిర్ణయించిన ధరకే నూనెను అందరూ కొనాలి. పోటీదారంటూ ఒకణ్ణి నేను బ్రతకనిస్తేగదా, నాకు ధర తగ్గించుకోవలసిన అవసరం పటడానికి

ఈ వ్యాపారాలు ఇలా దిగ్విజయంగా కొనసాగుతూవున్నా నా మనస్సు మరో క్రొత్త పంథాకు ఉపక్రమించింది. స్టాక్ ఎక్స్ఛేంజ్ లోకి చేతులు చాచాను. ఈ వ్యాపారంతో సమానమైన చక్కటి వ్యాపారం జగత్తులో మరొకటేదీ లేదు. ఇది కూడా ఒక విచిత్రమైన నాటకరంగమే. అనేక రకాల పాత్రలు రంగంమీదికి వస్తాయి. రాజులూ మంత్రులూ ఒకప్రక్క, సన్నరకం వ్యాపారాలు చేసే చిన్న చిన్న వ్యాపారస్థులు మరోప్రక్క ఈ రంగంలో సదా చేరుతూ ఉంటారు. ఇదొక పెద్ద కోలాహలం — జూదం. ఇవ్వాళ పేరూ ప్రతిష్ఠా లేని వాళ్ళ రేపటికి కోటీశ్వరులు; ఈ వేళ కోటీశ్వరులుగా చలామణి అవుతున్నవారు, రేపు తినటానికి బిచ్చా ఫకీరు. ఇంతలో విజయం సాధించాలంటే ఎంతో చాకచక్యముండాలి. కొంచెం ఏమారామా అంతా తారుమారై తల్లక్రిందులై పోతాం. ఇదికూడా ఒక కళ; ఈ వ్యాపారానికి కొన్ని సూత్రాలుంటై. వాటిని ఉల్లంఘించకూడదు. ఆ సూత్రాలను ఆధారంగా చేసుకుని కత్తి అంచుమీద నడుస్తున్నట్టు అతి జాగ్రత్తగా నడవాలి.

ధరలు పెరుగుతూన్న వాటాలను అమ్మేస్తూ వుండాలి. తగ్గేవాటిని కొంటూవుండాలి ఇది ముఖ్య సూత్రం. వ్యాపారం చెయ్యటమంటే కొంతమందికి చికాకు. కొంతమందికి అదే జీవం. ఉదాహరణకు: నీగ్రో వున్నాడు. తన గుడిసెప్రక్కనే వజ్రాల గని వుందని అతనికి తెలుసు; కాని లాభమేమిటి? దాని ప్రయోజనాన్ని పొందటానికి యితరులు రావలసిందే. ఇతర పరిశ్రమల సంగతి కూడా ఇంత 'ఆశ' వుండాలి; దాన్ని సాధించుకోగల తాహతువుండాలి. ఈ రహస్యాలన్నీ తెలుసుకుని ఇల్లాంటి పరిశ్రమలలో కూడా ఎన్నిటిలోనో పెట్టుబడి పెట్టాను. సర్వత్రా జయపతాక లెత్తాను.

నేను భాగ్యవంతుణ్ణయినతరవాత ఎంతో దుబారాగా ఖర్చు కరామతులు చేస్తూవుండేవాణ్ణి. ఒకవేళ స్వంత ఖర్చులు తగ్గించుకున్నా, వ్యాపారం విస్తరించటానికి ఏజంట్లకు డబ్బు పారెయ్యాలి. నా పక్షాన వాటాపత్రాలు కొనటానికీ, అమ్మటానికీ బ్యాంకులకు కమిషన్ ఇస్తూవుండాలి ఇంకా ఎన్నో రకాల ఖర్చు కరామతులుంటై. నా స్వంతఖర్చులను తగ్గించుకుంటున్నానని ఎవరైనా పసిగడితే లేనిపోని నీలివార్తలను, కట్టుకథలనూ ప్రచారంచేస్తారు. నేను ముందే చెప్పానుగా,వ్యాపారము నేది జూదరునీ. ఎంతో మెలకువగా వుండాలి. దురదృష్టవశాత్తూ ఏ వ్యాపార శాఖలోనైనా ఏదైనా నష్టంవచ్చినా అలాంటిదేదీ జరగనట్టు, మేకపోతు గాంభీర్యం వహించాలి. దానిసానే మరో వ్యాపారసంస్థను నెలకొల్పి, ఆ లోటు బర్తీచేసుకుని బండి సాగించుకుపోతూ వుండాలిగాని బెంబేలు పడకూడదు. ఇది ఎలాంటి విచిత్రమైన నాటకం! మన జీవితమే ఒక పెద్ద నాటకం!

ప్రతి నగరంలో, ప్రతి వ్యాపారకేంద్రంలో అతిథి గృహాలను కట్టించాను. నా కొత్తదార్లను కొం చెయ్యటానికి తగిన సౌకర్యాలన్నీ యేర్పాటు చేశాను. వారి భోజన సదుపాయాలను చక్కగా ఏర్పాటు చేయగల సమర్థులైన మనుషులను నియోగించాను. ఎక్కడైనా ఏ సుందరశిల్పం అగుపడినా, ఏ మంచి చిత్రం దొరికినా దాటిని కొని తెప్పించటానికి వలసినంత డబ్బు ఖర్చుచేశాను. ఏ అందమైన వస్తువు కన్పబడ్డా దాన్ని కొనేశాను. ఖరీదైన దుస్తులు వేసుకునేవాణ్ణి; ఇక మోటారుకార్ల సంగతీ, గుర్రపు బగ్గీల సంగతీ చెప్పక్కర్లేదు. నా అట్టహాసానికి యివన్నీ అవసరం. తప్పనిసరి అవసరాలు!

ఒక నగరంలో రాజుగారి అతిథిని. గుర్రపు పందాల్లో నా చుట్టూ, ఆ ప్రాంతంలో ప్రసిద్ధులైన వారంతా ఉండితీరాలిసిందే. నా పటాటోపమంతా చూస్తూ అందగత్తెలు మాత్రం వూరుకుంటారా? వాళ్ల వలల్లోనుంచి తప్పించుకోవటం చావుతెంపులపనిగా వుండేది. ఎంతో సాముగ్మ మన్నుపాలు చేసుకోవలసి వచ్చేది. అన్నిటినీ రుచిచూస్తూనే వుండాలి. కాని ఎప్పటికప్పుడు మన స్వాతంత్ర్యాన్ని మనం కాపాడుకుంటూ వీటన్నిటికి సుదూరంగా పోతూవుండాలి. ఈ రంగంలో వున్న జీవన సంగ్రామం మరెక్కడా వుండదు. వీటినన్నిటినీ పైనుండే చూస్తూవుండాలి. ఒక్కసారి ఏ గాలానికో చిక్కుకున్నామా — హాత మారిపోతాం.

## 6

ఒకనాటి ప్రాతఃకాలం కాఫీ తాగుతూండగా కాట్సన్ స్టైయిన్ అనే పెద్దమనిషి నన్ను చూడ్డానికి వచ్చాడు. పెట్టుబడిదారులలో ఆయనదికూడా ఒక పెద్ద చెయ్యి. ఆ కబురూ ఈ కబురూ చెప్పి నెమ్మదిగా తన గోడు ప్రారంభించాడు.

ఇంతవరకూ ఆయన నా సలహాప్రకారమే తన వ్యాపారాన్నంతా నడుపుతూ వస్తున్నాడు. నా బ్రోకర్లందరూ ఆయనకు తెలుసు. వారిలో ఒకడు ఒక వ్యాపారవిషయంలో ఇయ్యవలసినంత భోగట్టా యివ్వలేదట. ఏవో కొన్ని ప్రధానవిషయాలను దాచిపెట్టాడుట. కొత్తదారులకు ఉన్న వ్యాపార మర్మాన్నంతా మరుగులేకుండా తెలియజేయటం నా వ్యాపార సంప్రదాయం. ఈ నా బ్రోకరు మాత్రం అందుకు భిన్నంగా ప్రవర్తించాడట. ఇతరులద్వారా ఆ సంస్థయొక్క గుట్టంతా తెలుసుకున్నాక కాట్సనుకు ఎక్కడలేని కోపం వచ్చింది. నన్ను కలుసుకుని, నాకుకూడా ఈ వ్యవహారంలో కొంత బాధ్య వుందని మొహాన చెప్పేసి పోవటానికి వచ్చాడు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది

కాని నిజానికి తప్పంతా నాదేనేమో. ఈమధ్య నాలో కొంత మందకొడితనం బలిసింది. ఆ యీ వ్యాపారాలను శ్రద్ధగా అజమాయిషీ చెయ్యటంలేదు. అందుచేతనే ఇలాంటిది జరిగింది. కమ్మని మద్యాన్ని అందించి ఆయన కోపాన్ని కొంత ఉపశమింపజేశాను. రాజ్యాంగ విషయాలను గురించి కబుర్లు చెప్పాను. మంత్రుల అశ్రద్ధవల్లా, వారు పరిశ్రమలలో అనవసరంగా జోక్యం చేసుకోవటంవల్లా మార్కెట్ ధరలకే మోసం వస్తున్నదని చెప్పాను. మన మందరం కలిసికట్టుగా యీ సమస్యను ఎదుర్కోవాలని పురెక్కించాను. వ్యాపారసంస్థలన్నిటినీ ఒకే సంస్థగా నడిచేలా కేంద్రీకరించెయ్యాలి. మనం వీటిలో ఎంత డబ్బు ఖర్చుచేస్తున్నామో ఎవరికీ తెలియనీకూడదు. ఇలాంటి పద్ధతి యేదో అవలంబించితేనేగాని మనం నిభాయించలేమని చెప్పాను. నీళ్లలో రాయిపడితే అలలు పుడతాయి — మళ్ళీ యిట్టే సమసిపోతాయి. వాటికోసం మనం ధైర్యాన్ని పోగొట్టుకోకూడదు. ఎవరెన్ని రాళ్ళు విసురుతున్నా మన పని మనం యథారీతిని చక్కబెట్టుకుపోతూ వుండాలి, అన్నాను.

నేను చెప్పిందంతా సావధానంగా విన్నాడు. ఆయన కోపమంతా పోయింది. మనస్సు మారిపోయింది.

'మీరు చెప్పిందంతా నిజమే. ఆర్థికసమస్యలను పూర్తిగా పరిష్కరించాలంటే పునాదుల సంగతి మరిచిపోకూడదు. మనం పెంచే నిర్మాణమంతా, వాటి బలం చూసుకునే జాగ్రత్తగా కట్టుకురావాలి. పునాదులు సరిగా లేకపోతే ఏ గాలివానో వచ్చి అంతా తలక్రిందులైపోతుంది. ఒక సంగతి చూడండి! మన పడవలు నడవాలంటే యంత్రాలు చక్కగా పనిచెయ్యాలి. రేవులకు చేరే నౌకామార్గాలు జాగ్రత్తగా గుర్తించుకోవాలి. అప్పుడే మనం నౌకలో క్షేమంగా ప్రయాణం చేయకలుగుతాం', అంటూ అభినయ సహితంగా తన అభిప్రాయాన్ని వెల్లడించాడు, సహర్షంగా.

'బాగుందనుకోండి! — ఇంతకీ మీ అభిప్రాయమేమిటో తేల్లేదు' అన్నాను.

ఒక అపురూపమైన చిత్రాన్ని చూసి ఆనందించుతున్నవాడులా జవాబు చెప్పాడు.

'ఎబ్బే మరేమీ లేదనుకోండి!—ఆర్థిక శాస్త్రాన్ని గురించిన భోగట్టా ఎంత తెలిసినా అది మనకు అన్నం పెడుతుందా? అని నా అనుమానం. వున్న డబ్బు దాచుకోకుండా ఏ పరిశ్రమలోనో పెట్టుబడి పెడితే లాభం వుంటుందనే ఒక ముక్క ఆర్థికశాస్త్రం చెప్పేసేది. ఆ పెట్టుబడి మొత్తాన్ని ఎలా ఖర్చుబెట్టాలో, లాభాలు ఎలా తియ్యాలో, మొదలైన కార్యకలాపాలన్నిటినీ మనం చూసుకోవలసిందేగదా—ఇదంతా ఒక పెద్దజూదం ఇందులో గెలవడ మెలాగనేదే మనం యోజించాల్సినసంగతి. ఇక నేను చెప్పదలచుకుంది' అన్నాడు.

ఆయన ధోరణంతా అర్థమైపోయింది. నా మెదడులో ఒక ఊహ మెరుపులా మెరిసింది.

ఇందులో మీరు భయపడాల్సిన పనేమీ లేదని హామీయిచ్చాను కావలిస్తే ఆయన వ్యాపారంలో నేనుకూడా వాటా కలుస్తానన్నాను. ఇద్దరం కలిసి కొత్త కంపెనీ నొకదాన్ని స్థాపించటానికి నిశ్చయించాం ఎక్కువ వాటాలు నా పేరనే వుండేలాగూ, వ్యవహారమంతా నా అజమాయిషీ క్రిందనే నడిచేలాగూ కాయితం కరాములు వ్రాసుకున్నాం. ఆయనకున్న ఆస్తిపాస్తులన్నిటినీ యిందులో తన వాటాలక్రింద వుంచేసే యేర్పాటు.

కొత్త కంపెనీ యిలా కొన్నాళ్లు నడిచింది. ఇంతలో యుద్ధంవచ్చింది. వాటాల విలువ క్రమేణా తగ్గిపోసాగింది. ఇందులో ఎక్కువ దెబ్బతిన్నవాడు ఆయన. నాకు నష్టం రాలేదని కాదు వున్నతేడా అల్లా ఏమిటంటే నేను మేకపోతుగాంభీర్యం వహించాను. ఆయన బెంబేలు పడ్డాడు. యుద్ధం ముగిసి సంధి జరిగినా ఆయన మనస్సుకు మాత్రం శాంతి లభించలేదు.

ఒకనాడు నౌకరు గది వాకిట్లో వుండి ఆయన్ని పిలిచాడు—జవాబు రాలేదు. తలుపు తెరిచి చూచాడు. గుండె ఆగిపోయి మంచంమీద చచ్చి పడున్నాడు. ఆయన చావటం కారణంగా ఆ కంపెనీకి నేనే సర్వాధికారి నయ్యాను. యుద్ధం ముగిసిన మరుక్షణంనుంచీ కంపెనీకి ఎంతో లాభం రావటం మొదలుపెట్టింది. సంపాదించిన ఈ సొమ్మంతా బ్యాంకుల్లో మురిగిపోకుండా ప్రభుత్వాలకు అప్పులిచ్చాను. రాజులకూ రాణీలకూ చేబదుళ్లిచ్చాను.

నన్ను కొనియాడనివారే లేరు. ప్రభుత్వం నేనుచేసిన సహాయాన్ని శ్లాఘించుతూ బిరుదులిచ్చి సన్మానించింది. రాజులకోర్లు నా యింటిముందు పడిగాపులు పడివుండేవి.

ఇలా సాగిపోతోంది నా జీవయాత్ర. కోట్లకొలది గడించాను. ఇంకా ఎంత కావలస్తే అంత గడించటానికి నా చేతిలో అనేక సావకాశాలున్నయ్. దేశంలో నా అంత ధనవంతుడూ, వాణిజ్య శిఖామణీ మరొకడెవ్వడూ లేడు. ఇదంతా పైకి బాగా నేవుంది. కాని లోపల పట్టిడొల్ల. పైకి ఎంత నాటకమాడుతున్నా మనస్సులో మాత్రం శాంతి లేదు. ఈ యంత్రాన్ని ఇలా త్రిప్పటానికి, ప్రారంభంలో వున్న ఉత్సాహం క్రమేపీ సన్నగిలిపోయింది. నిజమే!—జూదగాడికి శాంతి ఎలా లభిస్తుంది? దినదినం వాళ్ళను కొట్టి వీళ్ళను కొట్టి, వాడి కొంప గూల్చీ వీడికొంపగూల్చి, ప్రాణాలకు ప్రాణాలనే దిగమింగుతూ వుండేవాడికి మనశ్శాంతి వుంటుందా? నేను చేస్తున్న పనులు తలుచుకుంటే ఒకొక్కప్పుడు నాకు నాకే గుండె ఝల్లుమనేది. చుట్టూ వున్నవాళ్లంతా నన్ను తెగపొగుడుతున్నా, నాకుమాత్రం లోలోపల ఒక విపరీతమైన ఆరాటం, అశాంతీ నిరుత్సాహం బయలుదేరి నన్ను కండలు కండలుగా చీలుస్తూ వుండేవి. ఈ బ్రహ్మరథం వ్యర్థం. నా మనస్సే నన్ను అంధకారంలో ముంచుతుంటే ఈ నాటకం ఇలా ఎంతకాలం ఆడగలను. ఈ సర్కసు ఫీట్లన్నీ ఇలా ఎంతకాలం చేస్తూ వుండగలను?

నాలో చెలరేగుతున్న ఈ మనోవేదనను కొంతమంది పసిగట్టారు,—ముఖ్యంగా స్త్రీలు. నన్ను ఆకర్షించటానికి భగీరథ ప్రయత్నాలు మొదలుపెట్టారు నావంటి సరసుడూ, అందగాడూ, యోగ్యుడూ, జగత్తులో మరొకడెవ్వడూ లేడని పొగడ్తలు సాగించారు నన్ను ప్రేమించటం వల్లనే తమ జీవితం పవిత్రమౌతుందని అంటున్నారు.

వాళ్ళు నన్నెందుకు ఇలా ఆశ్రయించుతున్నారో నాకు తెలుసు. వారికి కావలసింది డబ్బు, సొమ్ములు, విలువైన దుస్తులు. వాటికోసం కాకపోతే అహోరాత్రులూ నాముందు ఈ భరతనాట్యాలు పట్టడమెందుకు? పాపం—పిచ్చివాళ్లు—వాళ్ళకు తెలిసిందిగాదు నే నెరకం మనిషినో? నేను షైలాక్ను—నాకు కావలసింది రక్తం, మాంసం—వీళ్లు నాకు ఏమిచ్చి తృప్తిపరచగలుగుతారు? ఈ ఆటవస్తువులలో కొన్నిటిని కొన్నాను, నా పని తీరి

పోయినతరవాత మామూలు వ్యాపార సరళిలో వీధిలోకి గిరాటు వేశాను—ఇది మరొకరకమైన జూదం, అనతికాలంలో ఈ ఆటమీదకూడా విసుగేసి పోయింది.

నా మనస్సులోని అశాంతి మాత్రం అలానే వుండిపోయింది.

## 8

శాంతిజ్యోతిని అన్వేషించుతూ పిచ్చివాడిలా దిశ దిశలా తిరుగుతున్నాను. ఒకనాటి సాయంకాలం రైలుస్టేషన్‌కు చేరుకున్నాను. స్టేషన్‌లో దీపాలు దివ్యజ్యోతుల్లా వెలుగుతున్నాయ్. లోపల్నుంచి ప్రయాణీకులు తమ సామాన్లా జట్లా పుచ్చుకుని తండోపతండాలుగా వచ్చి బళ్లలోకి ఎక్కుతున్నారు. ఆ గందరగోళమంతా చూసి నాకు ఆశ్చర్యమేసింది. బయట ఎలాంటి నాటకమో, ఇక్కడకూడా అలాటి నాటకమే. ఈ నాటకరంగంలో ఎన్నిరకాల మనుషులున్నారు. ఎన్నిరకాల దుస్తులు. ఎంతెంత ఆవేశం—తమ గమ్యస్థానాలకు చేరటానికి ఎంత ఆదుర్దా! ఎవరి ముఖంవంక చూసినా సరే—తమ స్వగృహానికే అగ్నిజ్వాలలంటుకుని భస్మమైపోతున్నట్టు ఏదో అంతులేని ఆందోళన. ఏ ముఖంవంక చూచినా సంతోషరేఖ అనేది ఏ కోశానా కనుపించదు. రైలు మోతను మించిపోయింది వీరి రణగుణధ్వని. ఎవరు పట్టుకో వస్తున్నారనీ వీరి కింత తొందరా, భయం? నిజంగా అది ఒక అరణ్యమే—మానవారణ్యం. ఎందుకలా అరుస్తారు. ఎందుకలా వెతజెందుతారు. ఈ గుంపులోనే చూచాను హేలీనాను. సామానులన్నీ సర్దివున్న బుట్టమీద కూర్చునుంది హేలీనా. ఎవరికోసమో ఎదురుచూస్తోంది. మాసిన దుస్తులూ, చినిగిన చొక్కా, కన్నీటి ధారలు!—ఎందుకలా ఏడుస్తోంది? ఏకాకి, అనాథ, చేతిలో పైసాలేదు—పొరుగూరి మనిషిలాగుంది—నగరం కొత్త—ఎరిగినవారెవరూ లేరు. ఎవడో మోసగించి తీసుకొచ్చి వుంటాడు. తాను వాంఛించిన అవినీతికి ఆమె అంగీకరించక పోవటంచేత ఇక్కడ స్టేషన్‌లోనే దిగవిడిచి వెళ్ళిపోయి వుంటాడు. ఆ విషాదమూర్తిని దూరంనుంచి చూసేసరికే నాకీ అభిప్రాయం కల్గింది.

ఆవిడ దగ్గరసా వెళ్లాను. 'ఎందుకలా కన్నీరు విడుస్తున్నారూ?—పాపం ఒంటరిగా వున్నారేం' అని అడిగాను మొదట్లో మాటాడలేదు గాని, తరచి తరచి అడిగేసరికి మంచి ఉద్దేశంతోనే మాట్లాడుతున్నానని గ్రహించి తన కథంతా చెప్పింది. నే ననుకున్నట్టే జరిగింది.

మా యింటికివచ్చి వుండమని ఆహ్వానించాను. నేను సద్భావంతోనే వున్నానని గ్రహించి అందుకు అంగీకరించింది. నా కారులోనే హేలీనాను యింటికి తీసుకువచ్చాను.

మారు పేరుతో నేనా యింట్లో వుంటున్నాను. అందుచేత నేనెవరో ఆచుట్టుపట్ల వాళ్లెవళ్లకీ తెలీదు. మాయింటి ఆవరణలోనే ఒక మూలగా వున్న చిన్న పెంకుటియింట్లో ఆమెను వుండమన్నాను.

ఆరాత్రి ఆమె నాతోనే భోజనం చేసింది. టీ పుచ్చుకుని కొంచెంసేపు ఆకబురూ ఈకబురూ చెప్పుకున్న అనంతరం ఆవిణ్ణి ఆవిడకిచ్చిన ఆ యింట్లో దిగవిడిచివచ్చాను.

తోటలో అటూ యిటూ పచారు చేస్తున్నాను. నా తలపులు ఆమెమీదికే పోసాగినై. పాపం ఆమె కూడా నామాదిరే దేశదిమ్మరి—తల దాచుకోటానికి కొంపైనాలేని అభాగ్యురాలు. పాపం ఎన్ని కష్టాలను భరించిందో ఇన్నినాళ్లా! ఈ ఏకాకి జీవితాన్ని ఎలా యీడ్చుకొస్తోందో! మాట్టానికి, పాపం, చాలా సుకుమారిలానే వుంది. చివరికి ఈ దేశదిమ్మరి చేతుల్లో పడ్డ దేవిటి! ఏంత తెలివితేటలు గల స్త్రీ; నేను చేసేదురంతాలు వింటే......ఎలా హడలిపోతుందో!

ఏమైనాసరే నాగుట్టుమాత్రం ఈ అమ్మాయికి తెలియనియ్యకూడదు. కాని యేమి చెయ్యాలిప్పుడూ? ఆమె మాటలనుబట్టీ రూపాన్నిబట్టీ చూస్తే మర్యాదగల కుటుంబంలో పుట్టి పెరిగిన దానిలా వుంది. ఈమె ముందుకూడా ఒక నాటకమాడాలి; లేకపోతే ఏమవుతుంది నామర్యాద?......మరి ఆమె సంగతో?

## 9

ఇంటి పెత్తనమంతా ఆమెకే వదిలేశాను. ఎంతో నిపుణతతో చక్కదిద్దుకొస్తోంది. స్త్రీ చెయ్యి తాకక కళావిహీనమైవున్న నా యిలు ఆమె వచ్చిందగ్గరనుంచీ కొత్తరూపం తాల్చుతోంది. నాకిది కావాలని ఆమె ఎప్పుడూ అడక్కపోయినా, ఆమెకు కావలసినవన్నీ నేనే గ్రహించి సర్వ సౌకర్యాలనూ కలిగించుతున్నాను.

ఇలా ఉండగా ఒక పెద్దగండం వచ్చి పడ్డది. నా జీవితాన్నే పునాదులతో కదలించివేసింది ఈ సంఘటన. నా ఆరోగ్యం చెడిపోయింది. మంచమెక్కాను. దివాలా తీసినవాడు కూడా ఇలా తల క్రిందులైపోడు!

వ్యాపారంమీద శ్రద్ధ సన్నగిలిపోయింది. ఏదో పెనుభూతం నన్ను ఆవేశించింది. చీకటి— చుట్టూ మహాంధకారం. జీవితంమీదనే రోతపుట్టింది ఏ డాక్టరు కుదురుస్తాడు దీన్ని. ఇంతకన్నా ఆత్మహత్య చేసుకోవటం మేలనిపించింది.

హెలీనా గుర్తించింది నా బాధను. ఏ డాక్టరూ కుదర్చలేని ఈ మనోవ్యాధిని కుదర్చటానికి తన తెలివితేటలన్నిటినీ ప్రయోగించి ప్రయత్నించింది. జయపతాక నెత్తింది కూడా!

ఎంత ధనాన్ని ఖర్చుపెడితేమాత్రం ఏ నౌకరు చేస్తాడు ఈ పరిచర్య?

హెలీనాను ప్రేమించాను గాఢంగా...కాని లాభమేమిటి? ఎంత ప్రేమించినా నా విషయాలను మనసువిప్పి చెప్పుకోగలిగితే గదా? నా పేరేమిటి? ఏం వ్యాపారం చేస్తున్నాను? ఎః దాన్ని నిర్వహించుతున్నాను. పాపం హెలీనాకు ఇవన్నీ ఏం తెలుసు? నా విషయం పాపం ఆవిడ ఏ భోగట్టా చెయ్యనేలేదు. పురుషుని ఎంత ప్రేమించినా ఆయన వ్యవహారాలలో తానెందుకు జోక్యం కల్పించుకోవాలి అనుకుందో ఏమో.

## 10

దినమంతా ఆ మారువేషంలో, ఈ మారువేషంలో రకరకాల వ్యాపారసంస్థల్లోనూ తిరుగుతూ వుండేవాణ్ణి; ఇప్పుడేనా నా పాతపద్ధతులు వదిలానా జ్యూతిరంగంలోనైనా మీరు నన్ను చూడవచ్చు. వ్యాపారంలో గడించిన సొమ్మంతా ఈ రంగంలోనే మంచినీళ్ళప్రాయంగా ఖర్చయిపోతోంది. నష్టం, నష్టం, నష్టం, అంతా సున్న చుట్టుకుపోతోంది.

ఈ చర్యంతా హెలీనాకు రవ్వంతేనా తెలీదు. ఎంత రాత్రివేళ యింటికి చేరినా ఎక్కడికెళ్ళావని ప్రశ్నించేది గాదు

ఒకనాటి రాత్రి ఇలాంటి చోటనే ఒకచోట కాలక్షేపం చేస్తున్నాను. ఎక్కడినుంచి వచ్చాడో డాక్టర్ ఫాన్సీ హఠాత్తుగా అక్కడ ప్రత్యక్షమయ్యాడు. నన్ను చూసి పూర్వంమాదిరే మందహాసం చేశాడు. కాని ఆయన్ను చూడనట్టు నటించాను. మళ్లా నన్ను చూసి చిరునవ్వు నవ్వుతూ:

'ఓహో! మరిచిపోయారల్లే వుంది; ఆనాటి చికిత్సవల్ల ప్రయోజనమేమైనా కలిగిందా? ఏం చేస్తున్నారిప్పుడు?' అన్నాడు.

నేనేం జవాబిచ్చానో......ఒక్కటి మాత్రం గుర్తుంది. నా కంఠంలోనుంచి ఈ వాక్యం మాత్రం దానంతటికది బయటికి వచ్చింది:

'మీరే చెప్పాలి, నాకేం తెలుసు—ఇకనయినా బాగుపడటానికి ప్రయత్నించుతాను'—

'మీరేమీ చెప్పక్కర్లేదు—మీ మాటల్లోనే తెలుసుకున్నాను మీ కథంతా? ఎందుకు మీకింత అసంతృప్తి?'—అంటూ నా చేతిలో వున్న గ్లాసు లాక్కుని వాసన చూశాడు. ఆయనకు కోపమొచ్చేసింది:

"ఇంకా ఈ త్రోవలోనే నడుస్తున్నారన్న మాట!—నా చికిత్సవల్ల మీ కేమీ ప్రయోజనం కలగలేదన్నమాటే" అంటూ ఆ ఆసవాన్ని క్రింద ఒలకబోసేశాడు.

నాకు ఏ సమాధానం చెప్పటానికీ తోచలేదు.

'ఇంకోసారి పరీక్షచేసి ఏ చికిత్సన్నా చేసి నన్ను ఒడ్డున వెయ్యండి; మీరు ఏమి ఇచ్చుకోమంటే అది ఇచ్చుకుంటాను — వైద్యానికి ఖర్చుపెట్టటానికి యిప్పుడు ఎంత డబ్బు కావలిసినా నాదగ్గిరుంది— మీకు తెలుసుననుకుంటాను' అన్నాను.

ఇద్దరం ఆయన చికిత్సాలయానికి బయలుదేరాం. పాతదినాలు జ్ఞాపకమొచ్చాయి. గదిలోకి అడుగుపెట్టగానే గౌను వేసుకున్నాడు. శస్త్ర పరికరాలనన్నిటినీ క్షణంలో సన్నద్ధం చేశాడు. నన్ను ఒక కుర్చీలో కూర్చోబెట్టి తన పని తాను సాగించాడు. మైకం వచ్చినట్టుంది. ఆయన చెప్పేది అస్పష్టంగా వినిపిస్తోంది.

'కన్ను యథారీతిగా బాగానేవుందే—రంగు మారలేదేమి చెప్పమా?—అద్దంలో కంటిపాప కనుపిస్తూ నేవుందే—ఎందుకు వచ్చాయి ఈ మసకలూ ఈ నీడలూ? వీటివల్లే బాధపడతారు రోగులు — ఇవి దృష్టిని చెడగొడతాయి — మనిషి అందం పోతుంది; తెలివితేటలు నశించుతాయి. ఎందుకు వచ్చాయి ఈ నీడలు ఈ కనుపాపలో! ఇలా తిరిగేవారందరికీ

ఈరోగమే వస్తుంది. పరిపక్వం కావాలి...అంత వరకూ రోగి ఇలా చెప్పరానిబాధలన్నీ అనుభవిస్తూ వుండాలిసిందే'--కొంతసేపు మెదలకుండా వూరుకొని చివరకి అన్నాడు:

'మీ కంటికి మందు వేశాను; కొన్నాళ్లపాటు ఓపిక పట్టాలి. తరువాత మరో మందు వేస్తాను. కాని వ్యాపార విషయాల్లో మాత్రం అశ్రద్ధగా వుండకండి. ఇది మీకు నా సలహా—ఇక పోయి మీ పనులు మీరు చూసుకోండి—కాని కష్టానికీ నష్టానికీ సంసిద్ధులు కండి!'—అంటూ మళ్లా మరో ద్రావకమేదో తెచ్చి నా కళ్ళల్లో వేశాడు. ఎంతో బాధ వేసింది. కళ్ళు తెరిచిచూసేసరికి ఆయన నావంక తీక్ష్ణంగా చూస్తూ 'ఇక మీరు వెళ్లివచ్చు'—అన్నాడు.

'మీరేదో సలహా యిస్తారని అనుకొన్నాను'—

'ఆఁ! మీవంటి ధనాఢ్యులకు సలహా లెందుకండీ—ఇలా అంటున్నందుకు నామీద కోపగించకండి'—

తలుపు తెరచాడు; నన్ను వెలుపలికి పంపాడు. నా చూపులో ఏమిటీ మార్పు! మసకలు క్రమ్మినవా?—ముందున్న వస్తువే కనుపించదేం?—నేనిప్పు డెక్కడువున్నాను—త్రోవే కనుపించదేం? ఏం చేశాడు డాక్టర్—ఎందు కిలా చేశాడు. ఏమిటి నా అపరాధం. కాని ఏం చెయ్యగలను, ఈ విషాద పరిస్థితిలో. నడిచిపోతున్నాను. త్రోవలో మోటారు కారు దెబ్బ కొట్టేసింది—పెద్ద గాయం—చూచే దిక్కెవరు?...ఎలాగో కొంతసేపటికి తడుముకుంటూ ఇంటికి చేరాను.

హేలీనా ఇంటి ముంగిలిలో నుంచుని నా కోసం ఎదురుచూస్తోంది. నా గాయాలవంక చూసి గుండె కరగిపోయి అమాంతం నన్ను పసిబిడ్డనులా కౌగిటిలోకి పొదువుకుంది.

'అమ్మయ్యా! వచ్చావూ—ఇంతసేపా...మీ కోసం ఇక్కడే నుంచుని ఎదురుచూస్తున్నాను'

* * *

నా ఆరోగ్యమంతా చెడింది, కళ్ళు అపరిమితమైన బాధ; దృష్టి మాంద్యం; ఎన్నాళ్లీ పడాలో ఈ బాధ; హేలీనా పరిచర్య చేస్తోంది లోపల చీకటి! బయట చీకటి! గాఢాంధకారంలో తడుముకులాడుతున్నాను. వ్యాపారమంతా సర్వనాశనమైపోయింది. ఎక్కడి ఏజంటక్కడ అఖాతాలలో ముంచేశారు. నా సంపదంతా ఎలా అక్రమంగా గడించానో అలానే హరించిపోయింది. జూదగాడికి ఎప్పుడో ఒకప్పుడు ఈ అనుభవం తప్పదు ధనార్జనలో క్రమమైన మార్గం లేకపోతే ఎవడికైనా ఈ దురవస్థ తప్పదు. జీవిత నిర్వహణలో రాక్షసమార్గం అవలంబిస్తే దాని పరిణామం యిదే. రాక్షస ప్రవృత్తిని అవలంబించి వాణ్ణి ఆరిపి, వీణ్ణి నాశనం చేసి మహేంద్రజాలం పన్ని మారుపేర్లతో, మాయవేషాలతో నానా నాటకాలూ ఆడి పదిడబ్బులు పోగుపడగానే గెలిచాం, గెలిచాం అని విర్రవీగి చంకలు ఎగరవేస్తాం— చూస్తూ చూస్తూ వుండగానే ఏదో మహా ప్రభంజనం చెలరేగి సర్వాన్నీ నేలమట్టం చేసేసుంది.



# క గూర

## ద్వితీయ

### శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"నువర్ణంబు ద్వితీయ" అని సూత్రము రచియించిన చిన్నయసూరి ఆ నువర్ణము ద్రుతాంతమో కాదో తన వ్యాకరణమున నెచ్చటను స్పష్టపఱుపలేదు సరిగదా! తద్గ్రంథ పరిశీలకులైన నా విషయమును గ్రహించు పరిస్థితినైనను గల్పింపలేదు. "ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు" (సం. ప. 12) అని ద్రుతము చివరనున్న పదములు ద్రుతప్రకృతికములని తన భావమును సూత్రమున వెల్లడించి ఆ సూత్రముక్రింద "ప్రథమాకయి షష్ఠి యొక్కెతరములయిన విభక్తులు..............వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు" అని వ్రాసెను. ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములని వచియించిన చిన్నయ "ప్రథమాకయి షష్ఠి యొక్కెతరములయిన విభక్తి ప్రత్యయము లంతిమునందుఁగల పదములు ద్రుతప్రకృతికములని వచియింపక విభక్తులు ద్రుతప్రకృతికములు" అనుట సమంజసమగునా? యను సందియమున కొస్పదమగుచున్నది—ప్రథమాకయి షష్ఠి యొక్కెతరములయిన విభక్తులు ద్రుతప్రకృతికము లనుటలోనున్న "విభక్తి" శబ్దము చేత విభక్త్యంతములయిన పదములె గ్రాహ్యములని యెఱుంగనగునని కొందఱు పెద్దలు వచియించురీతిగా విభక్తిశబ్దము విభక్త్యంతములగు పదముల నిర్దేశించునదిగనే యంగీకరింతము. ఎట్లయినను ద్వితీయా విభక్తి ప్రత్యయమగు "ను"వర్ణమునకుఁ జివర ద్రుతమున్నదా? లేదా? యన్నదే యిక్కడ గడ్డుసమస్యగనున్నది. ద్వితీయా విభక్తి ప్రత్యయమగు "ను"వర్ణము తనంతట తానే ద్రుతము గావున నా "ను"వర్ణ మంతమందుఁగల పదము ద్రుతప్రకృతిక మగుటలోఁ బ్రతిబంధక ముండదనియు నా "ను"వర్ణముపై ద్రుతముండదనియుఁ గొందఱు వచియింతురు. "తృతీయాదులకు నుగాగమంబగు" (త. ప. 8) అను సూత్రమునంగు తృతీయాదులకే నుగాగమము విధియించెను గావున "ద్వితీయ"యగు "ను"వర్ణంబుపై ద్రుతము నిల్వనేఱదనియును వచియింతురు. "ద్రుతాంతములయిన పదంబులు ద్రుతప్రకృతికములు" అను సూత్రము చేతనే ప్రతి పదమును ద్రుతప్రకృతిక మగుచున్నదనియు, "తృతీయాదులకు నుగాగమంబగు" అను సూత్రము స్పష్టార్థమె సృష్టింపఁబడినదనియు నిత్యాది హ్రస్వము మీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును." (సం 14) అను సూత్రమువంటిదే యనియు గావున "ను" వర్ణంబు య) సైతము ద్రుతాంతమే యనియు మఱి కొందఱు వచియింతురు. ఎన్ని విధములఁ బర్యాలోచించినను నీ ద్వితీయా "ను" వర్ణము ద్రుతాంతమో కాదో నిర్ణయించుటకు వీలుగాకున్నది. ద్రుతాంతమైనచో ఆ ను వర్ణముపై మఱియొక "ను" చేరవలెను. అప్పుడు "గురువు చేతను" వలె "గురువునను" అని యుండవలె. ఆ ద్వితీయా "ను" వర్ణము ద్రుతాంతము కానిచో "గురువును" అనియే యుండవలెను—ఈ ను వర్ణము ద్రుతాంత మన్నచో కొన్నిచోట్ల బాధ—ద్రుతాంతము కాదన్నచో కొన్నిచోట్ల బాధ—అదియును గాక యిదియును గాక "ముందునుయ్యి వెనుక గొయ్యి" అనునట్లుగా నేదియును స్పష్టము కాకున్నది.

చిన్నయ "డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు" (త. ప. 23) అని సూత్రమును సృష్టించి ద్వితీయాద్యేకవచనము పరంబగునపుడు నిగాగమము విధియించెను. "రామునిని"—ఇందు మొదటి "ని"కారమాగమము. రెండవ "ని" ద్వితీయా "ను" స్వర భిన్నత్వముతో నేర్పడిన "ని" కారము—ఈ ద్వితీయ

"ని" వర్ణము ద్రుతాంతమేయన్నచో మీఁద మరియొక నకారముండవలె—రామునినిన్ — ఈ చివరనున్న నకారము చిన్నయమతమున స్వత్వమునందినచో "ని" స్వరూపమునందును—అగుచో "రామునినిని" అని మొత్తము ("ఆగమ "ని" కారము, ద్వితీయ "ని" కారము, ద్వితీయపైనున్న ద్రుతరూపమైన "ని" కారము.) మూఁడు "ని" కారము లుండవలయును. నిగాగమము పాక్షికము గావునఁ దదభావ పక్షమున "రామునిని" అని రెండు నికారము లుండవలయును. కాని చిన్నయ స్పష్టముగ నిగాగమ భావపక్షమున "రామునిని" అనియు నిగాగమాభావ పక్షమున "రాముని" అనియు (త. ప. 23) నుదాహరించి యున్నాఁడు. "రామునినిని" అని త్రినికార రూపములుండుట సవ్యమైనది కాదు. కాని ద్వితీయా "ను" వర్ణము ద్రుతాంతమే యగుచో "రామునినిని" అని అనిష్టరూపములు సిద్ధింపక తప్పదు. ఈ రూపములను చిన్నయ యంగీకరింపఁడు.

ఇంక 'ను' వర్ణము ద్రుతాంతము కాదని యన్నచో మరికొన్ని యెడల నష్టము—"గురువును + అడిగెను—అను నీయెడ "ప్రథమేతర విభక్తి శత్రర్థక చు వర్ణములందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును" (సం ప. 2) అను నీ సూత్రముచే "గురువును" అనుదానిలోని ద్వితీయా "ను" వర్ణస్థమగు "ఉ" కారమునకు సంధి వైకల్పికముగ రావలయును. సంధి యగుచో "గురువు నడిగెను" అను రూపమగును. సంధ్యభావపక్షమున వేరొక రూపము ఉండవలెను. అగుచో "గురువును నడిగెను" అను రూపముండవలెను. ద్వితీయ నుకారముపై ద్రుతమున్నఁగాని యిట్టి రూపములు సిద్ధింప నేరవు. ఇట ద్వితీయ "ను" వర్ణము ద్రుతాంతమే యని తేలుచున్నది. గురువును + అడిగెను అనుచో ప్రథమేతర విభక్త్యాది సూత్రముచే సంధి వికల్పము గావున సంధి రానిపక్షమున "సంధి లేనిచోట స్వరంబు కంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సం. ప. 8) అను సూత్రముచే యడాగమమువచ్చి "గురువును యడిగెను" అనురూపమగుటను చిన్నయ గాని వైయాకరణులుగాని యంగీకరింపరు గదా! అగుచో "గురువును నడిగెను" అనురూపమే వ్యాకరణ వైయాకరణ సమ్మతము. ఇట్టి రూపమును సాధింప వలెనన్న ద్వితీయ యగు "ను" వర్ణము ద్రుతాంతమని యంగీకరింపవలె—ద్రుతాంతమని యంగీకరించినచో కల్గు నష్టము మున్నే వివరించితినిగదా! ద్వితీయ యగు "ను" వర్ణము ద్రుతాంతమనుటకును వీలుగాక ద్రుతాంతము కాదనుటకును వీలుగాక నిర్ణయరహితమగు స్థితిని నేర్పఱచినాఁడు చిన్నయ— ఇట్టి దుస్స్థితి తొలంగవలెనన్న నొక్కటే మార్గము— ను వర్ణము ద్రుతాంతముగ నంగీకరించి నిగాగమము ద్వితీయకు రాకుండఁజేసి తృతీయాదులకు మాత్రమె వర్తించునట్లు చేసినచో నా దుస్థితిని తొలగింపవచ్చును. కాని "గురువునును" అని యిట్టి ద్వినుకార రూపముల నైత మంగీకరింపక తప్పని పరిస్థితి కలుగగలదు.

ద్వితీయా "ను" వర్ణమునకు ద్రుతాంతత్వ మంగీకరింపక "గురువును + అడిగెను" ఇత్యాదులందు ప్రథమేతర విభక్త్యాదిచేత ప్రాప్తించు సంధి వైకల్పికముగాన సంధి రానిపక్షమున "కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి" (సం. ప. 21) అను సూత్రముచేత మరియొక నకారమును తెచ్చిపెట్టి "గురువును నడిగెను" ఇత్యాది రూపములు సాధింపనగునని యెవ్వరైన ననవచ్చును. కాని యది సమంజసము కానోపదు. ప్రథమేతర విభక్త్యాది సంధిసూత్రము సామాన్య సూత్రము. "కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి" అను సూత్రము విశేష సూత్రమని యా సూత్రమందలి "కొన్నియెడల - కానంబడియెడి" అను పదములె చెప్పుచున్నవి. సామాన్య సూత్రప్రవృత్తి కలుగు రూపములకు విశేషసూత్రమును సామాన్య సూత్రముగ వర్తింపజేయుట యంగీకరింపఁదగిన విషయము గాదు—ప్రథమేతర విభక్త్యాది సూత్రముచే కల్గు సంధ్యభావపక్షమునఁ నెల్లయెడలను నీ ద్రుతంబుమీఁద నకారంబును వర్తింపజేసి రూపసిద్ధి యొనర్చుట క్వాచిత్కముగ వర్తించునట్లు చిన్నయ సూత్రించిన సూత్రమునకు సామాన్య ప్రవృత్తిని కల్పించుటయే యగును. అట్టి పనిచేయుట చిన్నయ కెంతవఱకు సమ్మతమగునో విద్వల్లోక మెఱుంగకపోదు.

రామునిని + అడిగెను. ఇట మొదటి "ని" కారమాగమము. రెండవది ప్రత్యయము. ఈ ప్రత్యయ "ని" కారమందలి యికారము ఈకార స్థానికమగుటచే ప్రథమేతర విభక్త్యాది సూత్రము ప్రవర్తించుట

కవకాశము కల్పించవచ్చును. సంధియగునో "రాముని నడిగెను" అను రూపమగును. కాని సంధ్యభావపక్షమున మఱియొక నకారము తెచ్చి పెట్టికొని "రామునిని నడిగెను" అను రూపము సాధింపవలెను. కాని యిట్టి రూపము శ్రవణపేయము కాదేమో!-నిగాగమ అభావపక్షమున "రాముని + అడిగెను = రామునడిగెను అనిసంధిభావరూపమును, సంధ్యభావపక్షమున మఱియొక నకారము తెచ్చి పెట్టికొని "రాముని నడిగెను" అను రూపమును సాధించుకొనవలసి యున్నది. ఇక్కడ విశేషమొకటి యున్నది. నిగాగమము వచ్చినపుడు ద్వితీయా "ని" వర్ణమునకు సంధి యొనర్చినను, నిగాగమాభావపక్షమున ద్వితీయా "ని" వర్ణమునకు సంధిచేయని పక్షమునను "రాముని నడిగెను" అను నొక్కవిధము రూపమే సిద్ధించుచున్నది. ఇదియే విశేషము. "రాముని నడిగెను" అనునెడ "ని" ఆగమమన్నచో నది సంధిభావరూపమున కుదాహరణమగును. ఆగమము కాదు ప్రత్యయమన్నచో సంధ్యభావ రూపమున కుదాహరణమగును.

ఇంక నీ విషయమునుగుఱించి ఆంధ్రశబ్ద చింతామణి యేమిచెప్పుచున్నదో యించుక పరిశీలింతము.

"కూర్చి ల ను నమోభ వేద్ద్వితీయాతు" అని చింతామణి "ని, ను" రెండింటిని ద్వితీయావిభక్తి ప్రత్యయములుగఁ జేర్కొన్నది. ఈ ని, నులు రెండును "తిజ్యస్య శేషషష్ఠీ" త్యాదిసూత్రమున జేరలేదు కావున "అన్యే ద్రుతప్రకృతయో యేస్యుర్హ్యేను జీవితద్రుతా నిత్యమ్" అనుదాని చొప్పున ద్రుతాంతము లగును. కాఁగా "రామునిన్—వనమునున్" మున్నగు రూపములు సిద్ధించునవి. కావున నే చింతామణిలో ద్వితీయైకవచనమున న్యాగమము విధియింపలేదు. "మహతో నిలౌవిభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః" అని తృతీయాదులలో న్యాగమము చెప్పంబడినది.

"నిరమో మహతామ్" అని మహత్తులకు నివర్ణకము విధించిన కారణాన నమహత్తులకు "ను" వర్ణకము వచ్చునను నర్థము ప్రసక్తమగును. ఆ నువర్ణకము ద్రుతాంతమగుటను "వనమునున్" మున్నగు రూపములగును. దీని కచ్చుపరమగుచో "అనాదిషు విభక్తిషూ తోవా" అను సూత్రముచే సంధి వికల్పముగ వచ్చి "వనము నడిగెను", "వనమును నడిగెను" ఇత్యాది రూపము లగును. బాలవ్యాకరణమున "ను" వర్ణము నందలి యకారమున ఇకారము ప్రవర్తించి "ని" వర్ణము సాధింపఁబడినది గావున నా ప్రశ్నయందలి యుకార స్థానికమగు ఇకారమునకును ప్రథమేతర విభక్తిత్యాది సూత్రము స్ఫుటకవకాశమున్నది. కాని చింతామణిలో "ని, ను" వర్ణములు ప్రత్యేకముగఁ బరిగ్రహింపబడినవి కావున "అనాదిషు విభక్తిషూ తోవా" అను సూత్రము "ని" వర్ణమునకు వర్తింపదు. కాఁగా "రామునిన్ + అడిగెను" అనుచో అనాదిష్విత్యాది సూత్రము వర్తింపదని తేలినది. "కిమాదికస్యైతః" అను సూత్రము చొప్పున "కి" షష్ఠికి సంధి చేయుచున్నట్లు "ఆది" శబ్దముచేత "ని" ద్వితీయను గూడ పరిగ్రహించి సంధిచేసి రామునడిగె-రాముని నడిగె అను రూపద్వయము సాధింపవలసి యున్నది. ఇట్లే బాలవ్యాకరణమందు సైతము "ని" ద్వితీయకు "ప్రథమేతర విభక్తి" ఇత్యాది సూత్రముచేతనె కాక "విభ్యాగులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు" అను సూత్రముచేత "కి" షష్ఠికి సంధి

సంపాదించుచున్నప్పుడు యీ "ని" ద్వితీయకును సంపాదింపవచ్చును. ఇట విసర్గాదిసూత్రము వర్తింపుచుటయే సమంజసముగును. చింతామణిలో "నిరమో మహాత్మా" అని "ని" విధింపఁబడినను వెంటనే "లుక్చస్యాత్" అని ఆ "ని" వర్ణమునకు లోపము సైతము పాక్షికముగా చెప్పబడినది. అట్లే "ను" వర్ణకము సైతమువచ్చి (అనుహుప్తులకు) పాక్షికముగ లోపించుచును — "వనము నడిగెను" అను నిట్టి రూపములు "అనాదిషు విభక్తిష్వాత్తో వా" అను సూత్రము చెప్పిన వనమునున్ + అడిగెను అనునెడ సంధియైన రూపమో లేక "లుక్చస్యాత్" అను సూత్రము చెప్పిన "ను" వర్ణము లోపింపఁగా మిగిలిన వనమున్ + అడిగెను అనునవి మేనము కాఁగా నేర్పడిన రూపమో చెప్పుట కష్టతరము—విడియైన గావచ్చును. కాఁగా "అనాదిషు విభక్తిష్వాత్తో వా" అను సూత్రమున ద్వితీయా విభక్తి ప్రత్యయగ్రహణముగాని "లుక్చస్యాత్" అను సూత్రముగాని యెద్దియేనొక్కటి వ్యర్థము కాక తప్పదు. చింతామణిలో ద్రుతలోపసూత్రమే గాని ద్రుతస్వరలోపసూత్రము లేదు గాన రామున్—వనమున్ మున్నగు రూపములు సిద్ధింపవలెనన్న "లుక్చస్యాత్" అను సూత్రము లుండవలసిన యవుసరమున్నది. కాఁగా "అనాదిషు విభక్తిష్వాత్తో వా" అను దానిలో ద్వితీయను గ్రహించుట వ్యర్థమే యగును. వనమునడిగె—గురువునడిగె నిత్యాదులలో వనమునున్, గురువునున్ అను రూపములు పరిగ్రహించి సంధియైన రూపములనియే చెప్పవక్కర యుండదు. ను వర్ణము లోపించిన రూపములని వచియింపవచ్చును కాఁగా "లుక్చస్యాత్" అనుసూత్ర మావశ్యకముగుటకు అనాదిష్విత్యాదిసూత్రమున ద్వితీయ గ్రహణము వ్యర్థమే యగును.

# గ్రంథ పరిచయం

## శతపత్రసుందరి

గేయసంపుటి: రచయిత: శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు; ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 490 తిరువొత్తియూర్ హైరోడ్డు, చాకలిపేట, మద్రాసు - 21; వెల మూడు రూపాయలు.

'పేరునకు శతపత్రసుందరియైనా దీనిలోని పాటల రేకులు రెండువందలకు మించాయి. దాదాపు 17 ఏళ్లనుంచి రచించి పాడుకొంటూవచ్చిన ముక్తకములవంటి ఏకగేయాత్మక ఖండకావ్యములు, కొన్ని నాటకములలోని ఆయా రసవత్సన్నివేశములలోని గేయములు అన్నీ కలిసి 200 వరకూ సంపుటముగా ఏర్చి కూర్చాను. లోపలి రసభావ విన్యాసముల ననుసరించి ఈ గేయపు రేకులను స్థూలముగా చాల మట్టుకు వసంతపత్రావళీత్యాదిగా ఆరు ఋతువులనూ సూచించే ఆరుగుత్తులలోనికిని, కొన్ని జాతీయ గీతములనూ మరికొన్ని నూతనగీతములను నవవసంత పత్రావళి అను ఏడవగుత్తిలోనికిని చేర్చాను. వీనిలో 20 మాత్రము రవీంద్రుని గీతములకును, ఇతర సంస్కృతాంగ్లాది కవుల రచనలకు పరిమళమాత్రానువాదములు. మిగిలినవన్నీ స్వతంత్రములే'—

గ్రంథాదిని పొందుపరుపబడివున్న ప్రకాశకుల పై వాక్యాలవల్ల ఈ సంపుటిలో చేర్చబడిన గేయాల విషయం, గ్రంథనిర్మాణ విషయం స్థూలంగా మనకు కొంత బోధపడుతోంది.

ఈ సంపుటిలోని గేయాలలో చాలావరకు, ఆలిండియా రేడియోలో ప్రసారం చేయబడిన నాటికలలో చేర్చుటకు వ్రాసినవి. మిగతా రచనలుకూడా ఇంచుమించు ఆ కోవలోవే. ఈ దృష్ట్యా నిజానికి, 'ఈ గేయాలలో కావ్యగుణం ఎంతవరకు కలదు?' అనే విషయాన్ని ంచవలసిన పనేమీ లేదు. కాని (మద్రాసు ప్రభుత్వ) తెలుగుభాషాసమితి వారు, ఈ గ్రంథాన్ని ఉత్తమ ఖండకావ్య సంపుటిగా నిర్ణయించి (1952—53) బహుమతిని ప్రసాదించివున్న కారణంగా అట్టి పరిశీలన అవసరమౌతున్నది.

రచయిత ఈ గ్రంథానికి 'శతపత్రసుందరి' అనే నామకరణం ఎందుకుచేశారో మనకు బోధపడకుండా వున్నా, ఇందులో అదే శీర్షికను ధరించిన గేయం ఒకటి వుంది.

'శతపత్రసుందరీ! ఓహో శతపత్రసుందరీ!
సురభిళ భ్రాంతిలో
సుందర
నయనదళ కాంతిలో
ఈ ఉదయ సంధ్యవేళ, మెరసెలే
ఈ ఉదయ సంధ్యవేళ
నా హృదయభావ వేల విరిసెలే
        నా హృదయ భావవేల
ఓ శతపత్ర సుందరీ! ఓహో శతపత్రసుందరీ
అరుణ దరహాసమో
చందన
మరు న్నిశ్వాసమో
నీ మృదుల దళశతమ్ము తెరచితే
        నీ మృదులదళశతమ్ము!
నీ హృదిని మధురసమ్ము పరచితే
        నీ హృదిని మధురసమ్ము
శతపత్రసుందరీ ఓహో శతపత్ర సుందరీ!
అనంగ వాద్యములో
యౌవన
తరంగ లాస్యములో
నీ మధువు మధుకరాళి మరగెలే
        నీ మధువు మధుకరాళి!

నీ వలపు లీనకరాళి కరగెలే
నీ వలపు లీన కరాళి!
ఓ శతపత్రసుందరీ! ఓహో శతపత్ర సుందరీ'

ఈపాట యెందుకు రచింపబడినట్టు? దాని ప్రయోజన మేమిటి; రచయిత దీనిద్వారా ప్రతిపాదింపదలచిన దేమిటి? ఈ వాక్యాలలో ధ్వనింపబడుతూన్న మహార్థ మేమిటి? దీనిలో నిష్పన్నమవుతూన్న రసమేమిటి? 'నీ మృదులదళ శతమ్ము తెరచెలే' వగైరా ప్రయోగాల ఔచిత్య మెలాటిది? 'అనంగవాద్య'మంటే అసలు అర్థ మేమిటి—ఇదంతా ఒక అయోమయంగావుంది. 'నా హృదయ భావ వేల విరిసెలే' అంటున్నారు. నిజానికి రచయితలో ఏదైనా విరిస్తే విరిసేవుండవచ్చు; కాని దాన్ని తిరిగి మనలో విరియజేయటానికి తగిన కవితానిర్మాణ సామగ్రి రచయిత కున్నట్టు కన్పించదు. నిజానికి వీరి మనస్సులో ఏదో ఆవేశం వుందనే మనం అనుమానించటానికి తగిన ఉపపత్తులు కొన్ని పొడసూపుతున్నయ్. ఉదాహరణకు:

'ఊరకే మాధురులు
ఊరిపోతున్నాయి!
ఆవైపు ఈవైపు
అనికాదు, అలముకొను
అందమే వెలుగైన
అన్ని వేపులగూడ
అంధకారప్రభలు
ముందువైపులగూడ!
ఊరకేమాధురులు!!
వలపుటామనిలోన
తలలెత్తుపూల తే
నెల క్రోణిసోలు
ఆ యెలదేటిపాటలో
అలవల్లకౌట, ద
య్యాల చెరలాటలో!
ఊరకే మాధురులు!!
ఒక్కసారిగ నురగ
కక్కుతూ పొంగేసి
ఉరుముతూ విరిగేటి
కెరటమ్ము కేకలో
ఆ వెన్కనే మరో
అలరాక తెలుపుతూ
ఏవైపుచూచినా
ఎందుకో మాధురులు!!
వాడిపోయిన పూల
వాసనలు కాబోవు
క్రొత్తవాసంతికల
కొమరు లసలే కావు
మనసు మనస్సులె కాల
ముందు కల్పించితే
ఊరకేమాధురులు
ఊరిపడుతున్నాయి'—

ఇత్యాదయః ఇంకా కొంత వుందనుకోండి! నిజానికి రచయితకు మాధురు లూరించాలనే తాపత్రయం వుంది. కాని, మాధురులు! మాధురులు! అనంగానే ఒట్టినే ఊరి ఊరుకుంటాయా! కావ్యంలో మాధురిని ప్రభవింపజేయటం అంత తేలికపని కాదేమో.

రచయితలో మెచ్చదగిన ఒక చాకచక్యం మాత్రం వుంది. అనంతవాఙ్మయంలోని ఏమాట దొరకినా దాన్ని పుచ్చుకుని ఇట్టే ఒక గేయాన్ని అల్లేసి అక్కడ పెట్టేయగలరు—దానికి ఒకభావం, ఒక ప్రయోజనం ఉండనక్కరలేదు. మచ్చుకు 'మహల్' అనే మాట వుందనుకోండి.

'మా మహల్!
మా మనస్సులో మహల్!
ప్రేమ నిర్మితము విశాలమా మహల్
చిన్ననాడే మా చిట్టిచేతులు నిల్పిన మహల్!
మా మధురాశయముల యుద్యానవనమ్మున లేచిన
మా మహల్!
జన్మజన్మలకు మా సుస్నేహమె జ్యోతులైవెల్గు
మా మహల్!!
చంద్రవంక సౌందర్యము మబ్బుకన్నె మాధుర్యము
సంజవెల్గు సౌభాగ్యము సర్వకుసుమ సౌరభ్యము
కలిపి తీరిపి నిర్మించిన మా మహల్

మా మనస్సులో మహల్!
ప్రేమనిర్మితము విశాలమౌ మహల్!'

ఇలా ఎన్ని పాటలేనా వ్రాసెయ్యగలరు.

ఈ గేయాలు చాలావరకు అనుకరణలుగా కనుపించుతాయి. "ఎవరోహో" అని వీరుకూడా ఒక పాట వ్రాయటం నిజానికి హాస్యాస్పదం.

'సాగునదే! సాగునదే!
ధర్మచక్రము! ధర్మచక్రము!
వీగునదే! వీగునదే!
జగతి నలుదెసల ఆచంద్రార్కము!!
సాగునదే!!
పిలుచునదే! వినబడదో!
శిలలు ద్రవించు కరుణతో
పిలుచునదే! యెదయెద
హత్తించు ప్రేమగళమ్ముతో!!
సాగునదే!!
రాజు, రౌతు, ప్రభువు, బంటు
యతి, గృహస్థు చనుమార్గము
సర్వసమము, శాంతికాంతి
పథ మవక్రము! ధర్మచక్రము!!
సాగునదే! సాగునదే!
ధర్మచక్రము! ధర్మచక్రము!
వీగునదే! వీగునదే!
జగతి నలుదెసల నాచంద్రార్కము!'

ఈ 'ధర్మచక్రం' 'జగన్నాథ రథచక్రాలను చుట్టు'కున్న మంటిచక్రం బాపతుగా వుంది!

జయదేవాదుల ధోరణి కొంత, ఉమ్మర్ ఖయ్యామ్ధోరణి కొంతా, రవీంద్రుని ధోరణి కొంతా, భావకవుల ధోరణి కొంత, అభ్యుదయకవుల ధోరణి కొంత—ఈ పాటలలో వైవిధ్యం మాత్రం పుష్కలంగావుంది. రచయిత వ్యక్తీకరించిన స్వతంత్రభావాలు మాత్రం బహు పరిమితం. తప్పనిసరి అవసరం యేర్పడి అలాటిది యేదైనా రచించవలసి వచ్చినా అది మరింత విచిత్రమైన రచనగా తయారై, చివరకు యేదోవిధంగా ఏ పాతగేయం దారికో తిరుగుతుంది.

ఈ స్వాతంత్ర్య ఘంటారావం వినండి:

'స్వాతంత్ర్యశుభోదయ ఘంటా
నాదం బడె మ్రోగెను మింట!
టంతం టతం టతటం!
టంతం టతం తం!
వీతెంచెను నవాశామారుత
మోతల్లీ! మా నవభారతి!
టంతం టతం టతటం!
టంతం టతంతం!—'

కంచెంబు మెట్లమీదినుంచి క్రిందికి దొర్లుతున్నట్టు

'టంటట టంటటంటటట టంటట
టంటట టంట టంటటా'

అనే ధోరణిలో ఈ ధ్వన్యనుకరణ పాటచివరిదాకా నడుస్తుంది. కాని యీ గంటలుమాత్రం మన హృదయంలో ప్రతిధ్వనించవు. కారణం, ఈ ఘంటారావం మానవహృదయాన్ని ఆవేశపెట్ట గల ఏభావానికీ సంకేతం కాలేకపోవటం. 'గంటలు గంటలు' అని ఒకకవి వ్రాశాడంటే వాటితోపాటు ఆకవి పొందుపరచిన భావాల ఉధృతం ఎలాంటిదో కూడా మనం అవగతం చేసుకోవలసి వుంటుంది.

## వాణీవిలాస వనమాల

తేకుమళ్ల రంగశాయికవి ప్రణీతము; ప్రచురణ: ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, మద్రాసు. వెల 9.6-0.

ఇది ఒక మహత్తరమైన ఉద్గ్రంథం; పద్యాలలో రచింపబడివున్నా, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంగా పరిగణింపదగి వుంది. సంస్కృతవాఙ్మయంలో కూడా విజ్ఞానసర్వస్వరూపంలో ఇలాంటి గ్రంథమేదీ వున్నట్టు వినికిడిలేదు. రంగశాయికవి ఇలాంటి గ్రంథమొకటి వుండటం అవసరమని ఆనాడే ఎలా ఊహించగలిగాడో చిత్రమైన విషయం.

రంగశాయి కాలాన్ని నిర్ణయించటానికి ఆయన రచించిన ద్విపద భాగవతంమాత్రమే ఆధారంగా వుంది. దాన్లో పుష్పగిరి తిమ్మన తనకు సహాధ్యాయి అయినట్టు పేర్కొన్నాడు. ఈ పుష్పగిరి

తిమ్మన 18 వ శతాబ్ది ఉత్తరార్ధంలో జీవించివున్నట్టు వీరేశలింగం పంతులు గారు నిర్ణయించారు. ఆ కారణంగా రంగశాయి కవికూడా అప్పటివాడని ఊహించవలసి వుంది.

ఇది నాలుగు అధ్యాయాల గ్రంథం. ఈ నాలుగు అధ్యాయాలలోనూ భారతీయ ప్రాచీన విజ్ఞానమంతా సంగ్రహరూపంలో నిక్షేపింపబడి వుంది. ప్రథమాధ్యాయంలో సృష్టిక్రమమంతా వివరింపబడి వుంది. ద్వితీయాధ్యాయంలో భారత దేశంలో గల సమస్త నదీనదాలూ పుణ్యక్షేత్రాలూ వివరింపబడి వున్నయ్. తృతీయాధ్యాయంలో ధర్మాచరణపద్ధతులు నిరూపింపబడినై. నాల్గవ అధ్యాయంలో ఆయుర్వేదం మొదలుకొని శిల్పశాస్త్రం వరకూ భారతీయవిజ్ఞాన శాస్త్రముల సారాంశమంతా పొందుపరుపబడివుంది. ఈ కవికి గల విజ్ఞానవిస్తృతిని అవగతంచేసుకుంటే నిజంగా విభ్రాంతి కలుగుతుంది.

భారతీయవిజ్ఞానాన్నంతా ఇలా వనమాలగా గుదిగూర్చి శ్రీ వేంకటేశ్వరస్వామికి అర్పించుకున్న మహాపురుషుడు రంగశాయి నిజంగా కృతకృత్యుడు. ఇది ప్రతి గ్రంథాలయంలోనూ తప్పక వుండి తీర వలసిన మహాగ్రంథం.

## శబ్ద ప్రపంచం

రచయిత: శ్రీ వేమరాజు భానుమూర్తి; ప్రచురణ: విజ్ఞానసాహితీ ప్రచురణలు—మద్రాసు - 5. మూల్యం ఒక రూపాయి.

'విజ్ఞానం వికసిస్తున్న కొలదీ, దాని ప్రభావం మన నిత్యజీవితంలో అడుగడుగునా ప్రత్యక్షమౌతున్న కొలదీ విజ్ఞాన విశేషాల నన్నిటినీ అందరి అందుబాటులోకి తీసుకురావలసిన అవసరం నానాటికి హెచ్చుతున్నది' అని రచయిత తొలిపలుకులో తెలుపుతున్న వాక్యాలు అక్షరాలా నిజం. కాని విజ్ఞానశాస్త్రరహస్యాలు నేడు విద్యాధికులకు మాత్రమే అందుబాటులో వున్నయ్; కారణం అలాంటివన్నీ ఆంగ్లభాషలో మాత్రమే రచింపబడి వుండటం.

నిజానికి, శాస్త్ర విజ్ఞానవిషయాలను తేట తెలుగులో చెప్పబూనటం భగీరథ ప్రయత్నమే. అయినా శ్రీ భానుమూర్తి గారు ఈ రంగంలో తీవ్రంగా కృషి చేస్తూ కొంత విజయాన్ని చేపట్టగలిగారు. లోగడ వీరు రచించిన సైన్సు కథ, రైలుకథ, పరమాణు కథ ప్రజల మన్నన లందుకున్నయ్.

ప్రస్తుతం రచించిన 'శబ్దప్రపంచం' శబ్దవిజ్ఞానాన్ని వ్యక్తపరుస్తున్నది. శబ్దము, పుట్టుక, లక్షణము, పరిణామం, ప్రయోజనం వీటిని రచయిత అనేక ప్రముఖాంగ్లగ్రంథముల ఆధారంతో రచించారు. చదువరికి విసుగు జనించకుండా కథగా చెబుతారు. తెలుగులో శబ్దశాస్త్రానికి సంబంధించిన విపులమైన రచన ఇంతవరకు ఇది ఒక్కటే.

## శ్రీ వేంకటేశ సుప్రభాతము

"శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్" అన్న మకుటంతో ప్రచారంలో వున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రభాత సేవా శ్లోకములకు ఆంధ్రానువాదం. అనువాదకులు శ్రీ కె. నారాయణ రావుగారు, తహసిల్‌దార్ కావలి. అనువాదకులు భక్తిరసపూరితములైన ఈ శ్లోకములను, పాడుకోవటానికికూడా అనువుగా ద్విపదలలోకి అనువదించారు. శైలియింకా కొంచెం దేశీయంగావుంటే బాగుండేది. వెల తెలియదు.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

